# వేయి పడగలు

## విశ్లేషణాత్మక విమర్శ




1984 రక్తాక్షి ఉగాది

విశ్వనాథ సాహిత్యపీఠం అవార్డు పొందిన గ్రంథం


డాక్టర్ ఎస్. గంగప్ప

వేయి పడగలు - విశ్లేషణాత్మక విమర్శ

(1984 రక్తాక్షి ఉగాది విశ్వనాథ సాహిత్య పీఠం అవార్డు పొందిన గ్రంథం)


రచన :

డా॥ ఎస్. గంగప్ప, ఎం. ఏ., పిహెచ్. డి.,

రీడర్, తెలుగు ప్రాచ్య భాషావిభాగం, 1.0

నాగార్జున విశ్వ.విద్యాలయం, 1.1

నాగార్జున నగర్ – 522 510, గుంటూరు జిల్లా, 1.2


1.3

1.4




ప్రథమ ముద్రణ ; మే 1987

2.0

ప్రతులు : 1000 2.1

2.2

వెల : రూ. 10/- 2.3

2.4

ప్రతులకు : 3.0

శ్రీమతి ఎస్. పార్వతమ్మ, 3.1

శశిప్రచురణలు

సి-73, శ్రీనివాస నగర్ కాలనీ, 3.2

గుంటూరు-522 006 3.3

ముద్రణ : వైష్ణవి ప్రింటర్స్, గుంటూరు-1, ఫోన్స్ : 25383, 25109.

# విషయ సూచిక

# విశ్వనాథవారి వేయిపడగలు
# విశ్లేషణాత్మక విమర్శ

## 1.0 విశ్వనాథవారి జీవిత సంగ్రహం :

" కవి ప్రతిభలోన నుండును గావ్య గత శ
తాంశములయందుఁ బొంబిది యైన పాళ్ళు
ప్రాగ్వివశ్చిన్మతంబున రసము వేయి
రెట్లు గొప్పది నవకథా ధృతిని మించి."

— శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు :
శ్రీమద్రామాయణ కల్పవృక్షము – బాలకాండము – అవతారిక

"కావ్యాత్మ సిద్ధిగన్న వ్యంగ్యము సొంపు
కలయఁ జూచెడి కాంక్ష కలుగునేని,
పరిణత గేయ కావ్యార్థ, సౌందర్యంబు
పరికించు నభిలాష పరగునేని,
గీర్వాణ రూపకాపూర్వ శిల్పపు శోభ
తెలుగులో నరయంగఁ దలతువేని,
విద్వన్మనః పద్మ వికసనార్కాలోక
ములు విమర్శలో కాంచ వలతువేని,

ఓయి తమ్ముడ ! విశ్వనాథోదరాశి
పూర్ణిమా హిమభానుఁడై పురుషమూర్తి
నపతరించిన వాగ్దేవియైన వాని
సత్యనారాయణునిఁ జేరఁ జనఁ గదయ్య !" [1]

"ఆంధ్ర సాహిత్యములో శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు మకుటాయమానమైన కవిగా, విమర్శకులుగా సుప్రసిద్ధులైనారు. ఆయన ప్రతిభ సర్వతోముఖమయినది. నేటి సాహిత్య రీతులలో ఆయన ముట్టనిది లేదు. ముట్టి నాయన బంగా

రము చేయగలడు. కవిగా ఆయన విశిష్టత ప్రత్యేకమైనది. శ్రీమద్రామాయణ కల్పవృక్షమును రచించి నేటి ఆధునిక యుగములో ఆయన ఒక అద్భుతమైన మహాకావ్యమును తెలుగువారికి అందించినారు. నేటివరకు తెలుగులో రచింపబడిన రామాయణము లన్నింటిలోను ఈ కల్ప వృక్షము మకుటాయమానమైనదని అనేకము లగు విద్వాంసుల అభిప్రాయము. శ్రీ విశ్వనాథ సత్యనారాయణ అత్యంతము కవియే యైనను ఆయన ఏ రచన చేసినను దానిలో మూలతః కావ్యాత్మయే యుండు ననియు పలువురి అభిప్రాయము.

"రామాయణ కల్పవృక్షమే కాక శ్రీ సత్యనారాయణగారు అనేక ఖండకావ్యములను, గీత కావ్యములను రచించినారు. ఆయన రచించిన "కిన్నెరసానిపాటలు" చదివి ఒడలు పొంగిపోవు లక్షలాది జనులు కలరు. అటు మహాకావ్యములు, ఇటు గేయరచన ఒకే చేతినుండి వెలువడుట మరియొకచోట కనిపించదు.

"ఆయన నవలలు చిన్నకథలు పలుమంది చదువుదురు. ఇచ్చట నాయన యొక్క విరాట్ మూర్తి యనవలయును. ఇన్ని భిన్న మార్గములు ఒక కలము నుండి వచ్చుట గొప్ప విలక్షణత్వము. ఆయన ప్రతి పుస్తకములో వస్తువేమి, భాష యేమి, శైలియేమి, చూచి తీరవలయును. ఆయన పిపీలికాది బ్రహ్మ పర్యంతము ఏ వస్తువయినను తన రచనయందు జొప్పించును. ఆయన పాత్రలు చాలా విలక్షణముగా నుండును. ఆయన ఆ పాత్రలు ఎక్కడ నుండియో తెచ్చినవి కావు. కేవలము కల్పితములు కావు. ప్రతి దినము చూచుచున్న మనుష్యులే ఆ పాత్రలకు మాతృకలు. ఆ పాత్రలలో కల్పనా వాస్తవముల మనోహర సమావేశము చూడ నగును. ఇది విశ్వనాథవారి విశిష్టత"

"వేయి పడగలు 'జాన్ క్రిష్టోఫ్' వంటి నవల యైనను దీనిలో చరిత్ర, సాంఘిక శాస్త్రము, రాజనీతి, ప్రాచీన సంస్కృతి సర్వోత్కృష్ట నిరూపణ, శిల్ప సౌందర్య పరాకాష్ఠ – ఇవన్నియు కలవు. అందు పెద్దయెత్తున రసము చిప్పిలు చుండును." [2]

"విశ్వనాథ వారి వచనము వచనము గాదు – వచనకవిత. అనగా గద్యము నకు కావలసిన గుణముల కంటె పద్యమునకు వలయు భావన, ఆవేశము మెండు నుండును. వారి 'వేయి పడగలు' చదువు చున్నప్పుడు నేనొక మహాకావ్యమును

చదువుచున్నానను కొంటిని. శయ్యా సౌభాగ్యము, సమాసములోని తూకము, నన్నయ కవితా రీతులు - అన్నియు ప్రత్యక్షముగు చుండును. నన్నయ యన్న నాతనికి పిచ్చి. అక్షరమక్షరము నాతని ననుసరింప నావేశము" [3]

ఇలాంటి మహా పండితుల ప్రశంసలకు పాత్రమై, సర్వోత్కృష్ట గుణ సంభరితమైన విశ్వనాథవారి 'వేయిపడగలు' నవలను విశ్లేషించి వివేచించడానికి ముందు విశ్వనాథవారి జీవిత సంగ్రహం తెలుసుకోవడం అవసరం. ఇది తరువాతి గ్రంథావలోకనను ఎంతగానో ఉపకరిస్తుందనడంలో సందేహం లేదు.

## 1.1 బాల్యం :

శ్రీ. శే. సత్యనారాయణగారి ఇంటి పేరు విశ్వనాథ వారు. వారి పూర్వులలో ఒకరు ఎప్పుడో కాశీకి వెళ్ళి, అక్కడి నుండి శివలింగము తెచ్చి కృష్ణానదీ తీరములో, హంసల దీవికి పై భాగములోని ఒక గ్రామంలో ప్రతిష్ఠించడం వల్ల ఆపల్లె విశ్వనాథ పల్లె అయిందనీ అదే వారి ఇంటిపేరు అయిందనీ అంటారు. విశ్వనాథ వారి తల్లి దండ్రులు పార్వతమ్మ శోభనాద్రి అనే పుణ్య దంపతులు. వీరి నోముల ఫలమే సత్యనారాయణగారు. వీరి జననం 10-9-1895. వీరి పూర్వులు ఆ వెనుక విశ్వనాథపల్లి వదలి నందమూరికి నివాసం మార్చుకొన్నారు. "వారి పూర్వులలో నొకరగు వెంకట నరసు గారు విశ్వనాథపల్లి విడిచి నందమూరు వచ్చిరి. ఆ గ్రామము మును నిర్మించిన వారు విశ్వనాథవారే. అప్పుడూరంతయు వారిదే. తరువాత వారిని తెచ్చి పొలము లిచ్చి గ్రామమును జన సంభరిత మొనరించిరి. వెంకట నరసుగారి నాలు పురుషాంతరముల తరువాతి వారు సత్యనారాయణగారి తండ్రి శోభనాద్రిగారు. ఆయన గొప్ప ప్రతిభావంతులు, మహాదాత, అసాధారణ వ్యవహార జ్ఞానము కలవారు. వారు గ్రామస్థులకు భారత రామాయణాదులు పురాణముగా చెప్పెడివారు. హరికథ చెప్పు నలవాటుకూడా వారికుండెడిదట. వారొక హరికథ రచించినట్లు కూడా ప్రతీతి".[4] తన తండ్రి దాతృత్వాన్ని గురించి "ఆ నా తండ్రి యున్ దధీచి, శిబికర్ణాదుల్ పునారూప సంస్థానం బొందిన పుణ్యమూర్తి" అని విశ్వనాథ వారు వివరించారు, వారు పరమ శివభక్తులు; 1902 లో కాశినుంచి శివలింగం తెచ్చి నందమూరులో శివాలయం నిర్మించి ప్రతిష్ఠించారు. ఈ విశ్వేశ్వరుడే విశ్వనాథవారి యింటివేల్పు. విశ్వనాథవారు విశ్వేశ్వర శతకము ఈ దేవుని గూర్చి

రచింపబడడమేగాక రామాయణ కల్పవృక్షం సైతం అంకితమిచ్చి తమభక్తి ప్రతిపత్తిని ప్రకటించుకొన్నారు.

## 1.2 విద్యాభ్యాసం :

విశ్వనాథ వారికి ఇద్దరు అక్కగార్లు, ఒక చెల్లెలు, నలుగురు తమ్ముళ్ళు. తమ్ముళ్ళలో పెద్దవారు విశ్వనాథ వెంకటేశ్వర్లుగారు. చిన్నవారు రామమూర్తిగారు. విశ్వనాథవారు రామదాసను వారి సాయంతో యోగాసనాలు నేర్చుకొన్నారు. చిన్నప్పుడే విశ్వనాథవారు ప్రకృతి ప్రకృతిలోని వైచిత్రిని గమనించారు. వీటినే తమ తెలుగు ఋతువులలో, వేయిపడగలలో ఉపయోగించుకొన్నారు. "వాన కురిసినచో నేనును మా అన్నయ్య తాటి తోపులలోనే యుండెడి వారము. అన్నియు నెంద్ర కాయలు, తేళ్ళు, మండ్రగబ్బలు. ఎండ్రకాయలను పట్టుకొని వానిని తలక్రిందులుగా వేసిన వాని పొట్టక్రింద తలుపులుండును. ఆ తలుపులు తెరచినచో వానికి తాళము లుండవు. లోన చిన్న చిన్న యెండ్రకాయ పిల్లలు కనిపించును. దాని కడుపుక్రింద నొక్కటియే తలుపు ఏకాండమైన చెక్క. కొన్ని మండ్రగబ్బలు, కొన్ని పెద్ద తేళ్ళు కలవు. వాని పొట్టక్రింద కూడా తలుపులున్నవి. అవి చెక్కల తలుపులు. అందులో కూడా పిల్లలుండును. అనుమతింప బడియెననగా మేము వాని నేమియు చేసెడివారము కాము. వృధాగా చంపినచో పాపము కదా ! మరల నా చెక్కల తలుపులు మూసి తాడిచెట్లమీద వదలి పెట్టెడి వారము ఈ తేళ్ళు పట్టుకొనుట మొదలైన సాహస కృత్యములు మా అన్నయ్య చేసెడివాడు."[5] మొదట వారి చదువు నందమూరు, పెదపాడు, ఇందుపల్లి, వెలినూతల, నాగపురప్పాడులలో సాగింది. మనుచరిత్రతోపాటు గణ యతి ప్రాసలను, పద్యరచనను, నేర్పిన ఘనత గురువులు శ్రీ గుటనిపూడి వీరభద్రయ్యగారికి దక్కింది. సత్యనారాయణరు నాటకము లనిన చెవి కోసికొనెడివారు. గొల్ల భాగవతులు ఆడే వీథి నాటకాలు అంటే వీరి. మరీ ఇష్టం. కూచిపూడి భామా కలాపాలు అంటే మరీ ఇష్టం. భట్రాజుల చాటు పద్యాలు మరీ ఆకర్షించేవి. ఇవన్నీ విశ్వనాథవారిని భవిష్యత్తులో ఒక మహాకవిని చేయడానికి ఉపకరించాయి. ఉన్న డబ్బంతా దానధర్మాదులకై తండ్రి వెచ్చించారు. అప్పులు చేశారు. 1908 నాటికి వారి యాస్తి నాస్తి కాలేదు గాని చాలవరకు తరిగి పోయింది. పిల్లలకు ఆంగ్లవిద్య నేర్పించాలి అన్నకోరిక అధికంగా ఉండేది. ఉన్న పొలం కౌలుకిచ్చి వచ్చిన డబ్బుతో సత్యనారాయణగారిని బందరు హైస్కూ

లులో మొదటి ఫారంలో చేర్పించారు. "శోభనాద్రిగారు పిల్లలను చూచుట కప్పు డప్పుడు బందరు వచ్చుచుండెడివారు. కుమారుడు పాఠ్యపుస్తకములు చదువకుండ పద్యములు వ్రాయుచుండుట చూచి తండ్రిగారు మండిపడి 'నీవేదో పెద్ద ఉద్యోగము చేయుదువని ఆంగ్లము చెప్పించుచుండగా నీకు తెలుగు కవిత్వ మేమిరా? చాలు ఇంక చదువుమాను కొమ్ము' అని పుస్తకము లన్నియు కట్టకట్టి పారవేసిరట. వారించుక శాంతించిన పిమ్మట సత్యనారాయణగారు 'నేనొకసారి చదివిన పుస్తకము మరొకసారి చదువలేను. అది నాకు చేతకాదు. నేనే ఫారము తప్పిన ఆ ఫారముతో చదువు మాన్పింపుము ఇదే షరతు." అని చెప్పి వారి నొప్పించిరి. అప్పుడే తండ్రిగారు వ్రాసిన 'నీవు రామకథ వ్రాసితి నంచనిపించుకో వృథాయాసము గాక కట్టుకథలై హికమా పరమా యటంచు' కుమారుని కానతిచ్చిరి. సత్యనారాయణగారంత 'ఈ పద్యములతో రామాయణము వ్రాయుటెట్లు? నేను కొన్నియేండ్లు పరిశ్రమ చేయవలెను. అనంతరము వ్రాయుచుండవలెను. అది యేండ్లుమీద జరగవలసిన పని నేను కవిత్వము వ్రాయుచుండగా నీవూరకుండవలెను. నాకు భగవంతు డాయుర్దాయ మిచ్చినచో నేను రామాయణము వ్రాయుదును. ఘన స్వామికి అన్నపూర్ణాసహిత విశ్వేశ్వరున కంకితమిత్తు' నని మనవి చేసికొని యుండిరి. వారు దయతో నంగీకరించిరి. శ్రీరామచంద్ర మూర్తియు విశ్వేశ్వరస్వామియు వారికాయుర్దాయము నొసంగి వారిచే శ్రీమద్రామాయణకల్పవృక్షము వ్రాయించుకొనిరి." 6

విశ్వనాథవారి కప్పటికే వివాహమైనది వారి సతీమణి వరలక్ష్మమ్మగారు. వీరు విద్వత్తు, దైవభక్తి వరులైన కూచిభొట్ల సీతారామశాస్త్రిగారి ప్రథమ పుత్రిక. వివాహము మహా వైభవోపేతముగా చేశారు. ఆనాటి వారి దాతృత్వం అపారమని తెలిసినవారు చెబుతారు. స్కూలు ఫైనలు వరకు హిందూ హైస్కూలులో చదువుతూ ప్రతి తరగతిలోను మొదటి ముగ్గురులో ఒకరుగా, అన్నిపరీక్షలలోను ఉత్తమ శ్రేణిలో పాసవుతూ వచ్చారు. పాఠశాలలో వినడమే కాని, ఇంటిపట్టున పట్టుమని పదినిమిషాలైనా గట్టిగా చదివేవారు కారు. అది వారి సూక్ష్మాగ్ర బుద్ధికి, ధారణకు నిదర్శనం హిందూ హైస్కూలులోనే చెళ్ళపిళ్ళ వేంకట శాస్త్రిగారు తెలుఁగు పండితులుగా ఉండేవారు. విశ్వనాథవారు వారికి శిష్యులుకావటమే విశేషము. పింగళికాటూరి కవులు విశ్వనాథవారికి సహాధ్యాయులు. విశ్వనాథవారు ఆనాడు కవితలల్లేవారు. అది గొప్ప కవిత్వంకాకపోయినా ఆనాటి మిత్రులలదరూ మెచ్చుకొనేవారు. శోభనాద్రిగారి ఆస్తి సన్నగిల్లింది. ఆంగ్ల విద్యా ప్రావీణ్యంతో

పుత్రుడు ఉద్యోగం చేయాలన్నది తండ్రి కోరిక కాని ఈ తెలుగు పద్యరచనకు బాధపడి కుమారుని హెచ్చరించారట. గుర్వనుగ్రహంతో విశ్వనాథవారికి చక్కని కవిత అలవడింది. హైస్కూలు విద్య పూర్తయ్యాక నోబుల్ కళాశాలలో ఎఫ్.ఏ. 1916 లో కృతార్థు లయ్యారు. బి ఏ. లో అక్కడే ప్రవేశించారు మూడు నాలుగు సార్లు తప్పడం సంభవించింది. కానీ ఈ సమయంలోనే వారికి సంస్కృతాంగ్ల భాషల్లో పాండిత్యం గడించే అవకాశం లభించింది.

## 1.3 ఉద్యోగం-రచనా వ్యాసంగం :

బి.ఏ. లో తప్పిన సమయంలోనే ఆర్థికమయిన ఇబ్బందుల మూలంగా నోబుల్ కళాశాలలోనే విశ్వనాధవారు ట్యూటర్‌గా చేరుట సంభవించింది అప్పుడే భారతీ స్వాములని పేరుగాంచిన కానుకొలను త్రివిక్రమరావుగారియొద్ద కౌముదిని, బందరులోని కంభంపాటి రామమూర్తిశాస్త్రిగారివద్ద సంస్కృత వ్యాకరణమూ, శ్రీ పరిమి నరసింహశాస్త్రిల వారివద్ద సూత్రభాష్యాన్ని అభ్యసించారు. వీటితో పాటు ఆంగ్ల గ్రంథపఠనం నిత్యకృత్యమైనది. వారి సహజప్రతిభకు ఈ పాండిత్యం ప్రకర్షనిచ్చింది. ఆ తరువాత కొంతకాలం నిరుద్యోగ బాధననుభవించక పోలేదు. అయినా బందరులో జాతీయకళాశాల స్థాపన జరిగాక 1921-26 ల మధ్య తెలుగు పండితులుగా పనిచేశారు. ఆ రోజుల్లోనే వారి కవిజీవితం ప్రారంభమైనది ఆనాడు స్వాతంత్ర్యంకోసం పోరాటం అత్యధికంగా సాగుతుండేది. ఆంధ్రప్రశస్తి కిన్నెరసాని పాటలు, గిరికుమారుని ప్రేమగీతాలు, నర్తనశాల నాటకం మొదలైన రచనలు చేయడం జరిగింది. కాలగర్భంలో కలసిపోయిన ఎన్నో చారిత్రకసత్యాల్ని త్రవ్వి తీసిన శ్రీ మల్లంపల్లి సోమశేఖర శర్మగారికి ఆంధ్రప్రశస్తిని అంకిత మివ్వటం విశ్వనాధవారి విజ్ఞతకు చక్కటి నిదర్శన. సాహితీ సమితి సభ్యులుగా, శ్రీ కోలవెన్ను రామకోటేశ్వరరావుగారితో కలసి 'జయంతి' అనే ద్వైమాసిక పత్రికా సంపాదకులుగా ఉండేవారు. 1921 లో వారికి ప్రథమ సంతానం కలిగింది వారే అచ్యుతదేవరాయలు. 1927 లో బి. ఏ పూర్తిచేయడమూ సుమారు ఆ సమయంలోనే తండ్రి శోభనాద్రిగారు పరమపదించడమూ జరిగింది ఆ వెనుక రెండేండ్లలో ఏం. ఏ. పూర్తిగావించి బందరు హిందూకళాశాలలో 1931 వరకూ, 1933 వరకూ గుంటూరు ఏ. సి. కాలేజీలోను ఆంధ్రోపన్యాసకులుగా ఉండేవారు. 1932 లో వారి సతీమణి వరలక్ష్మమ్మగారు దివంగతులుకావటం తటస్థించింది.

అచ్యుతదేవరాయలు తరువాత వారికి ఇద్దరు పుత్రికలు జన్మించారు. ఈ సందర్భములో శ్రీమంతాచార్య కల్యాణానంద భారతీస్వాముల వారివద్ద ఛాందోగ్యోపనిషదాదులు చదువుకొన్నారు. 1933 తరువాత ఐదేండ్లు నిరుద్యోగిగాఉండి ఆంధ్రదేశమంతటా కవిగా, ఉపన్యాసకుడుగా, విమర్శకుడుగా ఈ సమయంలోనే విశ్వనాథవారు ప్రసిద్ధిపొందడం జరిగింది. 1934 లో "వేయిపడగలు" నవల రచించి అడవి బాపిరాజుగారి "నారాయణరావు" నవలతోపాటు ఆంధ్రవిశ్వకళాపరిషత్తువారి బహుమతిని అందుకొన్నారు. అప్పుడే రామాయణ కల్పవృక్ష కావ్యరచన ప్రారంభించారు. అంతకుముందు, వెనుక అనేక నవలలు రచించారు అదోని సాహిత్య సమాజం వారికి బందరులో జరిగిన సన్మాన సభలో కవిసమ్రాట్ బిరుదు ప్రదానం జరిగింది. 1938లోనే ఒక నిరుపేదకన్యతో విశ్వనాథవారికి ద్వితీయ వివాహమైనది ఆమెను సైతం విశ్వనాథవారు మొదటిభార్య వరలక్ష్మమ్మగారి పేరుతోనే పిలిచేవారు. ఆమెకు ఇద్దరు పుత్రులు ఒకపుత్రిక జన్మించారు ఆమెను వివాహమాడిన పిదప విశ్వనాథవారి అదృష్టం పండింది. కాని వారి ప్రథమసంతానం రామచంద్రుడు మరణించడం వారికి ఎనలేని శోకకారణమయినది. విశ్వనాథవారి వైరాగ్యభావాలకది హేతువైంది.

ఈ సందర్భంలో వారింతకుముందే రచించిన నాటకాలు పేర్కొనటం అవసరం 1918 లోనే ధన్యకైలాసం, 1920 లో సౌప్తికప్రళయం, అవతార పరివర్తనం, 1924 లో నర్తనశాల, 1924-25 అనార్కలి, 1933-34 లో 'వేనరాజు' 1935 లో తల్లికానిపిల్ల, 1937 లో త్రిశూలం రచించడం జరిగింది.

1938లో బెజవాడ సి. వి. ఆర్. కళాశాలలో ఆంధ్రోపన్యాసకులుగా నియమితులై 1957 వరకు నిర్వహించారు. 1940 లో నవ్యసాహిత్య పరిషత్తునకు అధ్యక్షత వహించారు.

1942లో వారికి గుడివాడలో గజారోహణ మహోత్సవం జరిగింది రామాయణంతోపాటు ఖండకావ్యాలు, నవలలు, రేడియోనాటికలు, విమర్శలు పుంఖానుపుంఖంగా రచించి సమస్త సాహిత్య ప్రక్రియలకు స్రష్టలయ్యారు. 1956 లో గుడివాడలోను, కరీంనగర్‌లోను షష్టిపూర్త్యుత్సవం విజయోపేతంగా జరిగింది. తరువాతి సంవత్సరం వారు ఉద్యోగ విరమణగావించారు. ఆ వెనువెంటనే వారు 1965 లో ఆంధ్రప్రదేశ్ సాహిత్యఅకాడమీ ఉపాధ్యక్షులుగా ఎన్నికకావడమే గాక మన ప్రభుత్వంచేత శాసనమండలి సభ్యులుగా నియమితులయ్యారు. దానికి

రాజీనామాఇచ్చి కరీంనగర్ కళాశాలాధ్యక్షులయ్యారు. 1962 లో రామాయణ కల్పవృక్షం పూర్తిచేసి 'కవిసమ్రాట్' బిరుదు సార్థకత నిలబెట్టుకొన్నారు. ఈ మధ్యకాలంలో 1946, 43 లలో కావ్యవేద హరిశ్చంద్రములు, 1951 'అంతానాటకమే', ఆకాశరాజు, 1957 లో ప్రవాహం, 1963 లో భస్మాసుర చయనం, లోపల - బయట, 1964 లో సత్యాగ్రహం అనే నాటకాలు రచించారు.

1.4 సత్కారాలు :

1963 లో విశ్వనాథ మధ్యాక్కరలకు కేంద్ర సాహిత్య అకాడమీ పారితోషికమూ! కలకత్తా నగరంలో పుష్ప కిరీట సన్మానమూ, 1965 లో ఆంధ్ర విశ్వకళా పరిషత్తు వారి కళాప్రపూర్ణ బిరుదమూ, 1970 తో కేంద్రప్రభుత్వం వారి పద్మభూషణ బిరుదమూ, శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం వారి డాక్టరేటూ, కేంద్ర సాహిత్య అకాడమీ వారి ఫెలోషిప్, ప్రదానం చేసి గౌరవించారు. 1967 లో అఖిలభారత వంగరచయితల మహాసభ వారి అవార్డు లభించింది. గౌ॥ శ్రీ పి.వి. నరసింహారావుగారు విశ్వనాథవారి 'వేయిపడగలు' నవలను 1970 లో హిందీలోనికి తర్జుమాచేసి ఔత్తరాహులకు సైతం తెలుగుదనాన్ని చవిచూపడం జరిగింది. 1971 సం॥ విశ్వనాధవారి జీవితంలో స్వర్ణకాలం. వారి సాహితీమూర్తిని అదృష్టదేవత వరించింది. ఇదే సమయంలో వారికి జ్ఞానపీఠం వారి లక్షరూపాయల బహుమతి లభించడం తెలుగు జాతికే గర్వకారణం. అదే సంవత్సరంలోనే ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వం వారిని ఆస్థాన కవిగా నియమించింది. జ్ఞానపీఠం అవార్డు వల్ల లభించిన డబ్బు, చాలా ఉపయోగించి నందమూరులోని విశ్వేశ్వర దేవాలయం బాగుచేయించి ధ్వజస్తంభం ఎత్తించి మూడురోజులు మహోత్సవాలు జరిపించి తమ భక్తి ప్రపత్తిని ప్రకటించుకొన్నారు.

"విశ్వనాథ వారికి చివరిదశలో కర్మసిద్ధాంతముపై నమ్మకము దృఢమైనది. ఎవని కర్మనుబట్టి వానికి సుఖదుఃఖములు కలుగుచుండు ననియు, నపకారమో ఉపకారమో చేసినవారు నిమిత్త మాత్రులనియు వారి భావము. జాతకములన్న వారికి విశ్వాసమున్నది. కాని జాతకము చెప్పు వారూరక యేవో గ్రంథములు చదివి ఫలితములు చెప్పిన నవి యట్లు జరుగకపోవచ్చు ననియు, జ్యోతిషము చెప్పువారు తపస్సంపన్నులైనచో వారు చెప్పు ఫలితము లమోఘము లగుననియు వారి యాశయము.

జ్ఞానపీఠమువారి లక్ష రూప్యముల పారితోషికము అందించినప్పుడు, వారు వార్తా పత్రికలలో తమ యభిప్రాయము తెల్పుచు వారి జాతకమునందా కాలమున లక్ష రూప్యముల సముపార్జ్జ గ్రహయోగ మున్నదనియు, నది యా రూపమున రాకపోయినచో మరొక రూపమున నైనను వచ్చి తీరెడిదనియు వ్యక్తము చేసి యుండిరి కర్మ సిద్ధాంతముపై వలెనే మానవు లొనరించు దుష్కర్మములకు భగవంతుడు వేయు శిక్షల పైచిత్రి పై కూడా వారికి విశ్వాసముండెడిది. పెదపాడులో చదువు కొనునప్పుడొక తెలివికల వాడు వారి పుస్తకములు చింపి ముక్కలు చేసి వారి నాయనమ్మ గారితో వారే చింపి బయట ముక్కలు పారవేయుచుండినట్లు చెప్పెడివాడు. వారాయన యెన్ని చెప్పినను వినక నిందించుచుండెడివారు. తరువాత బందరులో వారైదవ ఫారము చదువుచుండగా నా తెలివికలవాడు పెద్దజ్వరముగాచ్చై నూతిలోపడి మరణించెను. భగవంతు డున్నాడనియు నతడు దుష్టులకు విధించు శిక్ష లిట్లుండు ననియు వారి కప్పుడు గాఢతరమైన విశ్వాస మేర్పడెను. తరువాత వారు ప్రస్థానత్రయము సభాష్యముగా పఠించి అద్వైత పరమార్థము పూర్తిగా నెఱింగిన పిమ్మట నా విశ్వాసము ద్విగుణీకృతమయ్యెను. చిన్ననాటి గ్రామ జీవితము సంఘవ్యవస్థా రూపముగా సర్వ విద్యా సర్వవిజ్ఞాన శాఖలతో వారికి పరిచయము కలిగించె. అప్పుడు వారి హృదయము మీద పడిన తరువాత యఱువదేండ్ల యాధునిక విద్యాసంఘర్షణచేత చెదరిపోకుండ జేసినది. ఆనాటి ఆచారము లందలి బలము, అందలి ఆర్ద్రత అప్పటివారి హృదయ స్వభావములు పూర్వజన్మ సంస్కృతిచే వారి హృదయమందు గాఢముగా హత్తుకొని వారికి పూర్వ సంప్రదాయాభిమాని యను పేరు తెచ్చిపెట్టినవి. 'వేయిపడగలకు' ఆంధ్రవిశ్వ కళాపరిషత్తు వారి పారితోషికము లభించిన పిమ్మట బందరులో జరిగిన సన్మాన సభలో వారు తమ సారస్వత జీవితము నంతయు సనాతన ధర్మోద్ధరణమునకు వినియోగించెదనని ప్రతిజ్ఞ చేసియుండిరి. సద్యః పరనిర్వృతితో పాటు తమ గ్రంథములో లోకసంగ్రహమును ప్రతిపాదించుట ఆయనకు వెన్నతో పెట్టిన విద్య. బహువిషయ ప్రతిపాదకములైన బహుకావ్యములలో సంప్రదాయ వైశిష్ట్యము లోకసంగ్రహాభి

భాషలను వారు వ్యంగ్యముగను, వాచ్యముగను కూడా వెల్లడించి యున్నారు. ఇది వారిని సంప్రదాయ పక్షపాతి యని పేర్కొనునట్లు చేయుటతో నాగరిక అభ్యుదయ విరోధియని కొందరు నిరసించు నంతవరకును పోయినది. వారికి కొందరు పూర్వాంధ్ర మహాకవుల మీద పరమాదర ముండినమాట సత్యమే. అట్లే ప్రతిభావంతులైన ఆధునిక కవులను సైతము వారు చాలా కొనియాడెడివారు. వారు కేవల గుణ పక్షపాతులు."[7]

## 1.5 చరమ దశ :

క్రమంగా వారికి అంతర్ముఖత్వం కలిగింది. జప యోగాభ్యాసాలతోపాటు, రచనా వ్యాసంగాన్ని కొనసాగిస్తూనే ఉండేవారు. చిన్న తనంలో హరి నాగభూషణంగారు, ఆవెనుక హిందూస్థానీ సంగీతంలో అసామాన్యులుగా పేరుపొందిన నారాయణరావుగారి పరిచయం మూలంగా విశ్వనాథవారిలో సంగీతాభినివేశం అత్యుత్తమాభివృద్ధి గాంచింది. కరీంనగర్‌లో ఉద్యోగ విరమణ గావించి విజయవాడకు తిరిగి వచ్చారు. ఆపైన రెండోయేట 1976 సెప్టెంబర్ 14, 15 తారీఖుల్లో స్వగృహంలోనే విశ్వనాథవారికి సహస్ర చంద్రదర్శన శాంతిపౌష్టికోత్సవం మిత్రులు, అభిమానులు, శిష్యులు కొనసాగింపగా యథావిధిగా జరిగింది. తరువాత కొన్ని మాసాలు మాత్రమే వారు జీవించారు. హృద్రోగంతో గుంటూరు ప్రభుత్వ వైద్యశాలలో దైవధ్యానంలో దివంగతులయ్యారు. కవి సూర్యాస్తమయంతో తెలుగు సీమలో పెంజీకట్లు ముసురుకున్నాయి. పండిత లోకంలో దుఃఖ మావరించింది. అలాగా ఆ మహాకవి అనంత దారిద్ర్యాన్నైనాక సర్వభోగాలను అనుభవించి, సహస్రమాస జీవియై శివైక్యం పొందారు. "పుట్టుట గిట్టుట కొరకె, పెరిగొప్పుట తగ్గుట కొరకే" ఇది కాలధర్మం. తప్పింప ఎవరి తరము ?

## సూచికలు

1. ఆచార్య దివాకర్ల వేంకటావధాని : కవిసమ్రాట్ విశ్వనాథ పు. 266

2. పి. వి. నరసింహారావు : వేయిపడగలు – పండితప్రశంస
— విద్వాన్ తాటికొండ వేంకటకృష్ణయ్య,
ముదివేడు ప్రభాకరరావుగార్ల 'బ్రహ్మోపమ మూర్తి'
— అనుబంధము పు. 202, 203, 204, 205.

3. విశ్వనాథవారి వచనరచన – పుట్టపర్తివారి అభిభాషణ—పై దే.
పు. 206, 207.

4. ఆచార్య దివాకర్ల వేంకటావధాని : కవిసమ్రాట్ విశ్వనాథ పు. 2.

5. పై దే. పు. 159.

6. పై దే. పు. 5, 6.

7. పై దే. పు. 287, 288.

— x —

# 2.0 తెలుగునవల - పుట్టుపూర్వోత్తరాలు

ప్రస్తుత ప్రకరణంలో విశ్వనాథవారి జీవితవిశేషాల్ని సంగ్రహంగా తెలుసుకోవడం జరిగింది. వారి 'వేయి పడగలు' నవలను విశ్లేషించడానికి ముందు తెలుగు నవల పుట్టుపూర్వోత్తరాల్ని సంక్షిప్తంగా సమీక్షించడం అవసరం. ఇది నేపథ్యంగా ఉపకరిస్తుంది.

## 2.1 ఆంగ్ల నవల—ఆవిర్భావం :

తెలుగు నవల ఉత్పత్తి వికాసాల్ని తెలుసుకొనేముందు పాశ్చాత్య ప్రభావంతో ఇతర భారతీయభాషల్లో లాగానే తెలుగులోను నవల ఉత్పన్నమైంది గనుక ఆంగ్లనవల, దాని లక్షణాల్ని అతిక్లుప్తంగా గ్రహించడం అవసరం.

"ఉత్పత్తి సాధనాలు సమాజగతిని ప్రగతిని నిర్దేశిస్తాయి. ఉత్పత్తి సాధనాల్లో వచ్చినమార్పు జీవితంలోని అన్ని రంగాల్లోనూ కనిపిస్తుంది. సాహిత్యం, జీవితంలోని ప్రధానాంగాల్లో ఒకటి. కాబట్టి అది అలాంటిమార్పులకు దూరంగా ఉండడం అసంభవం, అసాధ్యం. ఒకసారి మనం సాహిత్యచరిత్రలను పరిశీలిస్తే ఈ విషయం స్పష్టంగా కనిపిస్తుంది. అయినా సాహిత్యప్రక్రియల్లో నవలవలె అమాంతంగా దూసుకొనివచ్చి మహావృక్షంలా వ్యాపించిన ప్రక్రియ మరొకటి కనిపించదు. అయితే 'నవల' అమాంతంగా దూసుకొనివచ్చిందా? అని ఆలోచిస్తే నవలవంటి నేలనంటిన ప్రక్రియ మరొకటిలేదని కనిపిస్తుంది ఎంచాతంటే అది నేలలోపుట్టి నేలను విడువని ప్రక్రియ. మనిషి జీవితానికి సామాజిక స్థితికి అతి చేరువలో కలిగినంత ప్రాముఖ్యం మరే ప్రక్రియకూ నేటివరకు లేదు. నవలను మించిన మరొక ప్రక్రియవచ్చేదాక సాహిత్య సామ్రాజ్యాన్ని నవలమాత్రమే ఏలగలదు అనేది ఎవరూ కాదనలేని వాస్తవం.

"నవలకు ఇంత ప్రభావ ప్రాచుర్యాలుండటానికి కారణం దాని ఆవిర్భావం ఒక విప్లవ పరిణామంలో జరగడమే. ఇంగ్లాండులో కనుగొనబడిన యంత్రం పారిశ్రామిక విప్లవానికి వాచకం పలికింది. మానవుడు పుట్టిన నాటినుంచి ఎన్నడూ కనీవినీ ఎరుగనంతమార్పు జీవితంలో ప్రవేశపెట్టింది ఈ పారిశ్రామికవిప్లవం.

ఉత్పత్తి సాధనాల్లో ఇంత గొప్పమార్పు అంతకుముస్సు ఎన్నడూరాలేదు. పారిశ్రామిక విప్లవం జీవితంలో అన్నిరంగాల్లోనూ అనంతమైన మార్పులనుతెచ్చింది. అంతకుపూర్వపు జీవన విధానమునూ, విలువలనూ సమూలంగా మార్చివేసింది. ఈ మార్పు మేధావులను దిగ్భ్రమ చెందించింది పతనమైపోతున్న పాతవిలువలను చూచి గోల్డ్‌స్మిడ్, షెల్లీ, కీట్స్‌లను ఏడ్చేటట్లుచేసింది

"పారిశ్రామిక విప్లవం మేధావులను ఆధ్యాత్మిక చింతననుంచి లౌకిక చింతనకూ, హేతువాద దృష్టికీ మళ్ళించింది ప్రజాస్వామ్యానికీ, ప్రజాస్వామిక ఆలోచనా విధానానికీ అంకురార్పణచేసింది. కొంతలో కొంత మానవులంతా సమానులేనన్న సిద్ధాంతాన్ని నమ్మేటట్లుచేసింది. అంతస్తులు అంతరించాలనే ఆలోచనా విధానానికి రూపకల్పనచేసింది.

"పారిశ్రామిక విప్లవానికి పూర్వపు సాహిత్యం కొందరికోసం రాయబడింది. రాజులకూ, రాణివాసాలకూ, కవిత్వానికీ, నాటకాలకూ మాత్రం పరిమితంఅయింది. సామాన్య మానవునికి అందులో స్థావరంలేదు. మానవులంతా సమానులేనన్న ఆలోచనా విధానంతో అచ్చుయంత్రం కనుగొనబడడంతో సాహిత్యం సామాన్యుల దరికి చేరింది. చదివేవాడు సామాన్యుడు, ఆలోచించేవాడు సామాన్యుడు, రాసేవాడు సామాన్యుడు కాబట్టి సామాన్యునిగురించి రాయాలనే తపన కొనసాగింది. ఈ తపన లోంచి ఆవిర్భవించిందే 'నవల'.

"నవల ఆవిర్భావానికి సామాజిక పరిస్థితులే కారణం అది సమాజంలోంచి పుట్టింది. సమాజాన్ని చిత్రించింది. సామాజిక పరిణామాలను తనలో ఇముడ్చుకొంది. ఈ ప్రక్రియకు అద్భుతాలుగిట్టవు. మానవాతీతమైనకల్పనకు ఇందులో తావులేదు ఇందులోని పాత్రలు మనవి. సంఘటనలు మనవి. కథ మనది. సుఖదుఃఖాలు మనవి. ఇది జీవితం. సిసలైన జీవితం. జీవితాన్ని చిత్రించడం నవలాకారునిపని. తమ జీవితాన్నే చదువుతారుకాబట్టి పాఠకులు మురిసిపోతారు. అందువల్లనే నవలకు అంత ప్రాధాన్యం, ప్రాచుర్యం.

"ఇంగ్లీషులో తొలి నవల ఆవిష్కరణకు కారకుడైన డిఫో పండితుడుకాడు. ప్రవృత్తి రీత్యా రచయిత కాడని, తెలుసుకున్నప్పుడు ఆశ్చర్యం కలుగుతుంది. అతడు వ్యాపారి పత్రకం చేసేవాడు. కళ అంటే ఏమిటో అతనికి తెలియదు. అయితే ఆనాటి సామాజిక దుస్థితులకు స్పందించి 'రాబిన్ సన్ క్రూసో' అనే

నవల రాశాడు. అది ప్రపంచ ప్రఖ్యాతం అయింది. ఆనాటి సమాజాన్ని చూచి రాసిన రాబిన్ సన్ క్రూసో ఆదిమ కాలపు జీవితాన్ని వర్ణిస్తాడు. ఇదీ ఇందులోని ఇతి వృత్తం. నవలా కారుడు పండిత ప్రకాండుడు కానక్కరలేదు. సామాజిక స్థితిగతులను చూచి స్పందించగల హృదయం గలవాడు కావాలి. 'Novel' అన్నది ఎవరో తెచ్చిపెట్టిన పేరుకాదు. క్రొత్తగా కనిపిస్తే జనం దాన్ని 'Novel' అన్నారు. పదబంధాలు, భాషాపాండిత్యాలు, సమాస శృంఖలాలు, ఎరుగని ప్రక్రియ నవల. ఇది సామాన్యునివలె నిరాడంబరం అయింది జీవితంవలె సత్యమైంది. ప్రకృతివలె సుందరం అయింది. ఆకాశంవలె విశాలంఅయింది. సూర్యునివలె తేజోవంతం అయింది. వాయువువలె సర్వవ్యాప్తం అయింది "[1]

ఇలాగ పాశ్చాత్యదేశాల్లో ఉత్పన్నమై యావత్ప్రపంచంలోనూ తన ప్రభావాన్ని, ప్రచారాన్ని, ప్రకటించి తద్వారా అన్ని భాషలలోను అతి సామాన్య జనానికి పేమాత్రం చదువవచ్చిన వారికైనా—హర్షకారణమైన ఈ నవల లక్షణాల్ని పరిశీలిద్దాం.

1.2. ఆంగ్ల నవల - లక్షణాలు :

నవలా సాహిత్యాన్ని పాశ్చాత్య లాక్షణికులు Prose Fiction అంటారు. Fiction అంటే కవిత్వమూ లేక కట్టు కథ అని అర్థం. అయితే వాస్తవ జగత్తు లోంచి వస్తువును సంఘటల్ని పాత్రలను గ్రహించి, కల్పన జోడించి చేసే రచన నవల. కథనాత్మక వచనరచన Prose-Fiction. ఇలాంటి రచన తెలుగులో, అంతకంటే సంస్కృతంలో ముందునుంచి ఉన్నప్పటికీ వాస్తవమైన Prose Fiction ఆధునిక యుగం లోనే పాశ్చాత్య వచన రచనా ప్రభావముతోనే మనకు సంక్రమించిదన్న సంగతి పరమ సత్యం. ఇది పూర్వోక్తం.

ఈ నవలకు కొన్ని లక్షణాలున్నాయి.[2] ఇతి వృత్తం, పాత్రలు, సంభాషణ నవల దేశ కాలాలు అంటే వాతావరణం, శైలి, జీవిత విమర్శ లేక తత్వం, అని నవలలో ఆరు లక్షణాలని విమర్శకుల అభిప్రాయం. ఆ నవల 'హాహా హూహూ' వంటి చిన్నది కావచ్చు. వేయిపడగలు వంటి పెద్దది కావచ్చు. అది ఉత్తమనవల కావచ్చు. లేదా అనుత్తమమైనదైనా కావచ్చు. కాని ఈ షడంగాలు మాత్రం తప్పని సరిగా నవలలో ఉంటేనే మనోహరంగా ఉంటుంది. ఇది జనరంజకం కావాలను

న్నప్పుడు తప్పనిసరిగా ఇతివృత్త నిర్మాణంలో, పాత్రపోషణలో, ఆ పాత్రల సంభాషణలో, రచన మొదలైన వాటి నిర్వహణరీతిలో, వాతావరణ కల్పనఅంటే ఆనాటి సమకాలిక సామాజికార్థిక ధార్మికాది పరిస్థితులను అభివర్ణించడంలో జనాకర్షకమైన శైలి విన్యాసంలో వీటన్నిటినిమించే జీవితాదర్శలక్ష్యాల్ని, అంటే జీవిత దృక్పథాల్ని, వివిధ కోణాలనుంచి వివరించేదిగా ఉండాలన్నది నిర్వివాదాంశం. అంటే జీవితాన్ని ప్రతిబింబించేదిగా నవల ఉండడం అవసరమన్న విషయం ముఖ్యం. అది సాంఘికం కావచ్చు, చారిత్రం కావచ్చు, పౌరాణికం కావచ్చు, లేదా సమకాలిక జీవితవర్ణన కావచ్చు. అయినప్పటికీ అన్నింటిలోను కల్పన ఎంత ఉంటుందో అంత సహజత్వమూ ఉండడం అవసరం. అప్పుడే ఏ నవలఅయినా హృదయంగమమై, సార్వకాలికమై ఉండగలదు. లేకపోతే అది సర్వజనామోద యోగ్యమై రసానందానికి హేతుభూతం కాలేకపోతుంది.

జీవిత వ్యాఖ్యానమే నవలలోని ఇతివృత్త ప్రధానాశయం గనుక నవలలో జీవితంలోని కష్టసుఖాలు నైతికపు విలువలు అనేకానేక నవలలోని ఇతివృత్తం. ఎంతైనా జీవితంలోని సమస్తవిషయాలు యథాతథంగా నవలలో చోటుచేసుకోడానికి వీలులేదు. కల్పనతో కూడిన జీవితసత్యాలను వివరించేదిగా ఉండవలసిఉంది. దీనికి కారణం లేకపోలేదు. లలితకళలలో సాహిత్యమూ ఒకటి అనేవిషయం గుర్తుంచుకొంటే కళ అనేది వాస్తవభ్రమ (Illusion of Reality) అన్న సంగతి సరిపోతుంది ఇది నవల. ఇతివృత్తంలోను సమంగా సమకూరుతుంది. ఈ ఇతివృత్తాన్ని రెండువిధాలుగా చెప్పడం జరుగుతూంటుంది. మొదటిది సముచితంగా కట్టుదిట్టంగా లేక వదులుగా ఉండేది. రెండోది అంగసౌష్ఠవమై బిగిబిగిగా ఉండే కథావస్తువు. మొదటిరకం నవలలో ప్రధాన కథకు సంబంధంలేని అనేకాంశాలు వర్ణించబడి కథాగమనానికి ఉపకరించకుండాపోతాయి. ఇలాంటిదాన్ని ఆంగ్లంలో — "Rather a history of the miscellaneous adventures which befall our individual in the course of life than the plot of regular and connected epopoeia, where every step brings us a point nearer to the final catastrophe".[3] కాబట్టి బిగిబిగి కలిగిన ఇతివృత్తంలోని ప్రతి సన్నివేశమూ. ప్రతిఘటనా. ప్రధాన కథాపోషకమై ఉండాలన్నది సారాంశం ఇతివృత్తం ఎంత విస్తృతమైనా, సంక్లిష్టమైనా, అందులోని ప్రధా

సాంతం సమైక్యం. ఏకసూత్రతని పాటించే ఈగుణం లేకపోతే నవల హృద్యమూ, అనవద్యమూ, కాజాలదని చెప్పడం ముఖ్యం.

పాత్రలు ప్రధానమూ, అప్రధానమూ అని రెండుతెగలు. వీటిలో ప్రధాన పాత్రలతోపాటు అప్రధానపాత్రలు సైతం సజీవమై మనం నిత్యం చూస్తూ ఉండే వ్యక్తుల్లానే నడయాడుతూ ఉండవలసిఉంది అందుకే తగినరీతిలో సుఖదుఃఖాలు, ఆనందపారవశ్యాలు, తత్ఫలితాన్ని అనుభవించవలసిఉంది ప్రధాన పాత్రలకు ఇతరపాత్రలు తమ వ్యక్తిత్వాల్ని నిలబెట్టుకొంటూనే సహకరించవలసిఉంది. అంటే ఆ పాత్రల వైశిష్ట్యానికవి సహకారులుగా ఉండాలని అర్థం అంటే పాత్రలు రక్తమాంసాలతోకూడి సజీవమై ఉండడం అవసరం. నవలా రచయిత ఈవిషయంలో జాగరూకుడై ఉండవలసి ఉంది.

ఇతివృత్తానికి పాత్రలకు అవినాభావసంబంధం అవసరం. కొన్నింటిలో ఇతివృత్తం ప్రాధాన్యం వహిస్తే మరికొన్నింటిలో పాత్రల ప్రాముఖ్యమే ఉంటుంది అలాకాక రెంటికీ ఎడతెగని సంబంధం ఉన్నప్పుడే మనోహరంగా ఉంటుంది.

నవలలోని కథాకథనం సొగసుగా, మనోహరంగానేగాక సహజంగా ఉండడం ముఖ్యం సముచితంగా నాటకీయంగా సంభాషణలు కొనసాగవలసిఉంది అంటే అందులో అనుస్యూతత ఉండడం ప్రధానం. ఈ సంభాషణ సందర్భోచితమై సులభమూ, ఔత్సుక్య స్ఫోరకమూ, నవనవోన్మేషమూ, ఆసక్తిదాయకమూ అయిఉండడం నవలారచనకు నికషోపలం.

వీటన్నిటిలోని భావాలు, ఆవేశాలు, ఆవేగాలు వాటితీవ్రత అభివర్ధించడం సందర్భానుగుణంగా అవసరం. అంటే రసవ్యంజకత అందులో ఉండడం ముఖ్యం, శృంగారం, వీరం, కరుణం, హాస్యం మొదలైన రసాలు, ప్రణయం, సాహసం. విషాదం, హాసాదిభావస్ఫోరకమై నవల కొనసాగవలసిఉంది అప్పుడే అది రస నిష్యంది కాగలుగుతుంది.

ఇన్ని విధంగా సమకూరిన నవలలో సమకాలిక వాతావరణ చిత్రణ ముఖ్యం. అంటే దేశకాల పరిస్థితుల సమైక్యాన్ని నవలా కారుడు సాధించడం అవసరం. ఆనాటి ధార్మిక సామాజిక, ఆర్థిక పరిస్థితుల్ని అభివ్యక్తీకరించడంలో కృతకృత్యు

దైతే నవల మనోజ్ఞ మవుతుంది. కారణం నవలలోని ఇతివృత్తం జీవిత వ్యాఖ్యాన మన్న విషయం మనం ఇక్కడ గుర్తుంచు కొంటే ఈ విషయం స్పష్టమౌతుంది.

ఇక ఆరోది, చివరది నవలలో అతి ప్రధానాంశం. నవల జీవిత వ్యాఖ్యానం; లేదా జీవిత విమర్శ; లేదా జీవిత తత్వం. అంటే జీవితంలోని తాత్వికత. దాన్ని ఎన్ని విధాలుగా వ్యాఖ్యానించ వీలవుతుందో నవలా రచయిత శిల్పం మూలంగా వ్యంగ్యంగా వివరించవీలుంది. నాటకంలాగానే నవల మరింత అధికంగా జీవిత ప్రతిబింబం. కారణం అందులోని పాత్రలు మనలాంటివాళ్ళే. లేదా లోకంలోని వ్యక్తుల్నే తీసుకొని ఒక నూతనసృష్టిని చేయడమన్నమాట. ఆ పాత్రల భావాల్ని వ్యక్తీకరించడంలో రచయిత తప్పనిసరిగా జీవితాన్ని ప్రతిబింబించి తీరతాడు. అలా ప్రతిఫలింపజేసినప్పుడే అది సహజసుందరమై మన మనఃఫలకాలపై చెరగని ముద్రవేస్తుంది. తద్వారా రచయితచేసే జీవిత వ్యాఖ్యానం మానవజాతి మనుగడకు మరింత మహోదయాన్ని చేకూరుస్తుంది. అంటే అది నీతిప్రబోధకమై సమాజ శ్రేయస్సుకు పాటుపడుతుందని భావం. ఇక్కడ మనం గమనించవలసిన ఆంగ్ల సూక్తిని స్పృశించడం అవసరం. — "In fiction every thing is true except names and dates; in history nothing is true except names and dates." కాబట్టి ఈ సత్యంఅనేది ఎంతవరకు అవసరమో అంత వరకే. అలాగే నీతిసైతం. అయితే కళ కళకోసమే అనే సిద్ధాంతంలో నీతికి చోటు లేదు. అయితే కళ నీతిప్రబోధకమై ఉండాలన్నది అపరిహార్యమైన గుణం. కారణం జీవితంనుంచి ఉత్పన్నమౌతుంది కళ. జీవితంతోపాటే పోషించబడు తుంది. అదే మళ్ళీ జీవితాన్నే ప్రతిస్పందింపచేస్తుంది. తన ప్రభావాన్ని చూపుతుంది. కాబట్టి దాని ప్రాధాన్యాన్ని మనం విస్మరించలేము. ఆ విధంగా సత్యం, నీతి, ధర్మం మొదలైన గుణాలన్నింటిని సంపుటీకరించి రచయిత నవలను మలచుకో వలసి ఉంది. జీవితవ్యాఖ్యానంతో కూడిన అలాంటిదే ఉత్తమోత్తమైన నవల.

ఈ లక్షణాలన్నీ అన్ని నవలల్లోను ఉండాలన్నది విమర్శకుల అభిప్రాయం. వీటిని ఆధారంచేసుకొనే ఉత్తమమైనవి, అనుత్తమమైనవి అని తేల్చిచెప్పడం జరుగుతుంది.

"నవల శక్తి ప్రాధాన్యములేని ప్రబంధము. ప్రదర్శనములేని నాటకము."[4] అంటే Marion Crawford అనే పండితుడు నవలనుగూర్చి 'Pocket theatre'[5] అన్న దీన్ని పింగళివారు పై విధంగా వివరించారు. ఇంకా దీని వివరణ వారిలా చేశారు. "నాటక కథకంటే నవలకథ ఎక్కువ విశాలముగా ఉండును గనుక దాని యందు ప్రాసంగికములు అధికముగా చేయునవకాశము గలదు. ఈ యవకాశమును బట్టి, ఆ యుపకథలు చేరినకొలది కథాబంధమున శైథిల్యమురాకుండ ప్రధాన కథయు ఉపకథలును ఏకసూత్ర గ్రథితములునై యుండునట్లు నవలకర్త జాగ్రత్త పడును. కథావైశాల్యమును బట్టియే పాత్రల స్వభావోన్మీలనముకూడ నాటకము నందు కంటే ఎక్కువ అసంభ్రమముగా సాగవలెను."[5] అప్పుడే శిల్ప పరిరక్షణ జరిగి నవల హృద్యమవుతుంది.

ఇదంతా తెలుగు నవలాపరిశీలనకు ఉపకరిస్తుందనే భావనతో విశ్లేషించడం జరిగింది. క్రమంగా తెలుగునవల ఉత్పత్తి వికాసాల్ని పరిశీలిద్దాం.

## 2.3 తెలుగునవల - పుట్టుక, వికాసం :

ఆధునిక యుగంలో అనేక సాహిత్యప్రక్రియలు పాశ్చాత్య సాహిత్య ప్రభావంతోనే వెలిశాయి. కవిత, నాటకం, నవల, కథ, జీవితచరిత్ర, స్వీయచరిత్ర, వ్యాసం, పరిశోధన మొదలైన సాహిత్యప్రక్రియలన్నీ ఆవిర్భవించాయి. కవిత, పద్య, గేయ, వచన కవితలుగా మారిపోయింది. ఈనాడు మినీకవిత వెలిసింది. మరి తక్కిన ప్రక్రియలన్నింటా వచనందే పెద్దపాత్ర. నవలలో దీని వైశిష్ట్యం మరీ కనిపిస్తుంది.

"1857 తర్వాత భారతదేశం మొత్తంమీద ఒక నూతనచైతన్యం ఆవిర్భవించింది. కలకత్తా, మద్రాసు, బొంబాయి నగరాలలో ప్రారంభంఅయిన విశ్వవిద్యాలయాలలో ఆంగ్లభాషద్వారా బోధనం జరగడంవల్ల యువకులు చాలామందికి ఆంగ్ల సాహిత్యంతో పరిచయం ఏర్పడ్డది. మహర్షి అరవిందులమాటల్లో చెప్పాలంటే 'ఈ ఆంగ్లసాహిత్య సంపర్కం మనలోఉన్న విమర్శనాత్మకదృష్టిని పెంపొందించింది. నూతన సృజనాత్మక ప్రక్రియలవైపుకు మనదృష్టిని మళ్ళించింది. కొత్త సంఘర్షణలను ధైర్యంగా ఎదుర్కొని వాటినిజయించి సిసలయిన జాతీయతను వికసింపజేసింది.

"నవల, నాటకం, చిన్నకథ, ఆత్మకథవంటి ఎన్నో నూతనప్రక్రియలు ఈ ఆంగ్లభాషా ప్రభావంవల్ల మనకు సంతరించినవే. ఈ విధంగా తెలుగునవల ఆవిర్భావానికి ఆంగ్లభాషా ప్రభావమే కారణమని విజ్ఞులు, విమర్శకులు నిరూపించి ఉన్నారు."[6]

"తొలి తెలుగు నవల వ్రాసే ప్రయత్నం 1872 లో జరిగింది. అయితే సరిగ్గా వంద సంవత్సరాల క్రితం ఈ ప్రక్రియకు 'నవల' అన్న పేరు చెలామణిలో లేదు. ఇంచు మించుగా డెబ్బై సంవత్సరాల నుంచే యీ పేరు బాగా ప్రచారం లోకి వచ్చింది. స్థిరపడింది. స్థితినీ ప్రాచుర్యాన్ని పొందింది.

"నూరు సంవత్సరాల క్రితం నవలను వచన ప్రబంధమనే వాళ్లు. అంతే ఏదైనా ప్రబంధాన్ని, వచనంలో వ్రాస్తే అది ఇంగ్లీషు సాహిత్యంలోని 'నవల' కు తెలుగులో తుల్యస్థానాన్ని సముపార్జించ గలదని పెద్దల అభిప్రాయం, అయి వుంటుంది. 'తెలుగులో మొదటి వచన గ్రంథము నేనే చేసితి'. అని వీరేశ లింగం పంతులుగారు వ్రాశారంటే, ఇదే పరమార్థాన్ని దృష్టిలో పెట్టుకొన్నారన్న మాట"[7]

1872 కు పూర్వమే కొక్కొండ వెంకటరత్నం పంతులుగారు రాసిన 'మహా శ్వేత' కాదంబరి అనువాదం మొదటి నవల అని నిడదవోలు వారి వాదంకాగ, 'తెలుగులో మొదటి వచన ప్రబంధం నేనే చేసితి' నని పేర్కొన్న వీరేశలింగం పంతులుగారు చెప్పిన మాటల్ని వివరించి, 1872 లో కర్నూలులో డిప్యూటీ కలెక్టరుగా పనిచేస్తూండిన నరహరి గోపాలకృష్ణమ చెట్టిగారు రచించిన 'శ్రీరంగ రాజ చరిత్ర' లేక 'సోనాబాయి పరిణయ' మన్నదే మొదటి నవల అని డా॥ రమా పతిరావుగారు నిరూపించారు.[8]

"తొలి తెలుగు నవల (శ్రీరంగ రాజ చరిత్ర) అట్టి ఆంగ్ల ప్రభావం కొంచెమూ లేకుండానే ఆవిర్భ వించింది"[9] అని మొదలి నాగభూషణ శర్మగారి అభిప్రాయం. "కాబట్టి ఈ గ్రంథం (శ్రీరంగ రాజ చరిత్ర) పై ఆంగ్ల సాహిత్య ప్రభావం కూడా ఉన్నది"[10] అని డా॥ రమాపతిరావుగారి అభిప్రాయం.

"ఇంగ్లండులో పారిశ్రామిక విప్లవం రాకుండా ఉండి ఉంటే ఇంగ్లీషు వాళ్లు మన దేశానికి వచ్చి ఉండేవారు కారు. వారు రాకుంటే మన సాహిత్యంలో

నవల అవతరించి ఉండేదికాదు. మనం అమరకోశం చదివి, అచ్చ తెలుగు కావ్యాలు రాసి అంకితాలుగా అమ్ముకోవలసి వచ్చేది.

"ఇంగ్లీషువాళ్లు మనను బానిసల్ని చేశారు. నిజం. కాని కొన్ని కాంతి మంతం అయిన ఆలోచనలను మనలో ప్రవేశ పెట్టారు. ఒక విషయం మనం గమ నించాలి, భారత దేశంలో బ్రిటీష్ ప్రభుత్వం స్థిరపడే నాటికి ఇంగ్లాండులో డెమో క్రసీ స్థిరపడింది. బానిసత్వంతో పాటు ఆంగ్లేయులు హేతువాదాన్ని కూడా తమతో తెచ్చారు. మనలో ప్రబలి ఉన్న మూఢాచారాలను గుర్తించేటట్లు చేశారు. ఆ ఆలో చనా విధానమే సాహిత్యంలో ప్రవేశించి తెలుగులో నవలా ప్రక్రియకు నాంది పలికింది." అని ఓ ప్రక్క చెబుతూనే మరో పక్క "తెలుగులో ఇంగ్లీషులో వలె నవల ఉనికి రాలేదు. తెలుగు నవల ఒక ప్రణాళికా బద్ధంగా సాహిత్యంలో ప్రవే శించినట్లు కనిపిస్తుంది"[11] అని దాశరధి రంగాచార్యులుగారు తెలుపగా మొదలి నాగ భూషణ శర్మగారు మొదటి నవల అయిన శ్రీరంగ రాజ చరిత్రపై ఎలా ఇంగ్లీషు ప్రభావముందో వివరించారు. అది గమనించ తగ్గది.

"లార్డ్ మేయో బెంగాలీల ఆచార వ్యవహారాలు తెలిపే నవల రాయించాలను కున్నారు. అలాంటి నవల రాసిన వారికి బహుమతి ప్రకటించారు. ఆ ప్రకటనను నరహరి గోపాల కృష్ణమ శెట్టిగారు చూశారు. వారు డిప్యూటీ కలెక్టరు. ఇంగ్లీషు సాహిత్యంలో పరిచయం ఉన్నా తెలుగు సాహిత్యంలో అంత దగ్గర సంబంధం లేని వాడు. ముఖ్యం అయింది అతడు విద్వాంసుడు, పండితుడు కాడు అతడు హిందువుల ఆచారము తెలుపునట్టి నవీన ప్రబంధము, రచించడానికి పూనుకొని 'సోనాబాయి పరిణయము' అనే ఉపనామంగల 'శ్రీరంగరాజు చరిత్ర' రచించాడు.

"ఇంగ్లీషులో వలె తొలినవలా రచయిత తెలుగులోనూ పండితుడూ కళా కారుడూ కాడు.

"రెండవది సామాజిక స్థితిగతులను తెలియ పరచాలనే ఆతురత ఇద్దరికీ ఉంది".

"చెట్టిగారు వచనంలో రాశారు. అది నేటికి జటిలంగా కనిపించవచ్చు. అయినా ఆనాటి ఛాందస భాషను వదిలి రచన చేయడంలో శెట్టిగారి ప్రగతి శీలత స్పష్టంగా కనిపిస్తుంది.

"నాల్గవది చెట్టిగారు కథా కల్పనలో కులాలకు అతీతం అయిన కథను కల్పించారు. రాజకుమారుడు లంబాడీ కన్యను ప్రేమిస్తాడు.

"అయిదవది ప్రేమను గురించిన ఒక అవగాహన కలిగి అది కులాలకు అతీతం అయిందనే దృష్టి ఏర్పరచు కోవడం."

శ్రీరంగ రాజ చరిత్ర 1872 వ సంవత్సరంలో ప్రచురించబడింది అని వివరించారు. అంటే ఇంగ్లీషు నవలా ప్రభావం పరోక్షమని వారి భావమేమో? ఏమైనప్పటికీ ఇంగ్లీషు ప్రభావం మన నవలా రచనపై ఉందనీ, తెలుగులో మొదటి నవల శ్రీరంగ రాజ చరిత్రమనీ సుస్పష్టం.

తెలుగు నవలా సాహిత్యాన్ని మొదలి నాగభూషణశర్మగారు ఐదుయుగాలుగా విభజించారు.[12] —— అవి ఇవి.

| | |
|---|---|
| 1. ప్రారంభ యుగం | 1872–1900 |
| 2. అనువాద యుగం | 1900–1920 |
| 3. వికాస యుగం | 1920–1942 |
| 4. మనోవైజ్ఞానిక యుగం | 1943–1960 |
| 5. సమకాలీన యుగం | 1960– |

ఇది స్థూలవిభజన మాత్రమే. ఇంకా రకరకాలుగా వర్గీకరింవవచ్చు

మొదటినవల 'శ్రీరంగరాజ చరిత్రము'ని తెలుసుకొన్నాము. తరువాత 'గద్య తిక్కన' అని పేరుగాంచిన కందుకూరి వీరేశలింగం పంతులుగారి రాజశేఖర చరిత్రము. ఇది సంఘ సంస్కర్తఅయిన కందుకూరివారు ఇంగ్లీషులోని 'వికార్ ఆఫ్ వేక్ ఫీల్డ్'ను ఆధారంగాచేసుకొని తెలుగు వాతావరణంలో ఆనాటి తెలుగుజాతి జీవన విధానాన్ని అభివర్ణించడానికి యత్నించారు. 1893, '95, '96 లలో 'చింతామణి' బహుమతిగ్రహీత శ్రీ ఖండవిల్లి రామచంద్రుడిగారి 'ధర్మవతీ విలాసము', 'మాలతీ రాఘవీయము', 'లక్ష్మీసుందర విజయము' చెప్పుకోదగ్గవి. 1894 లో చింతామణి పత్రిక బహుమతికి నోచుకొన్ననవల చిలకమర్తి లక్ష్మీనరసింహంగారి 'రామచంద్ర విజయము'. వీరు కందుకూరివారి ననుసరించారు రచనలో. తరువాత

చిలకమర్తివారు 1896, 97, 98 లలో వరుసగా 'హేమలత', 'అహల్యాబాయి', 'కర్పూరమంజరి' నవలలకు చింతామణి బహుమతులను పొందారు. ఈ సందర్భంలో ఇంకా అనేక నవలలువచ్చాయి. 1900 తరువాత వచ్చినవి అనువాదాలు. అందులో ఓ.వై. దొరస్వామయ్య కపాలకుండల, ఆనందమఠం, కమలాకోమల, బెంగాలీనుంచి అనువదించారు. ఇంకా ఎందరో అనేకనవలలు రచించారు. కొన్ని చారిత్రకనవలలు సైతం స్వతంత్రంగా వెలువడ్డాయి. ఆంధ్రచరిత్ర నాధారంగా రచించబడ్డ నవలలూ ఉన్నాయి. మౌలికమైన సాంఘికనవలలు శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారి 'శ్మశాన వాటిక' లేదా 'విషభుజంగము' (1917), వెంకట పార్వతీశ్వరకవుల మాతృమందిరము (1919), చిలకమర్తివారి రాజారత్నము (1919), గణపతి (1920). ఈ గణపతి తెలుగు హాస్యనవలల్లో మకుటాయమానమైంది. ఆనాటి సాంఘిక స్థితి గతుల్ని వ్యంగ్యంగా చిత్రించారు.

1920–1940 తెలుగునవలా వికాసయుగం చాలా ప్రాముఖ్యం వహిస్తుంది. సామాజిక చైతన్యంకోసం, రాజకీయాలను, ఆర్థికస్థితిగతులను, తెలుగుదేశంలోని మతధార్మిక స్థితులను వ్యక్తిజీవితాన్ని వివిధ దృక్కోణాలలోంచి చిత్రించే ప్రముఖ నవల ఉన్నవ లక్ష్మీనారాయణగారి 'మాలపల్లి', ఆనాటి బ్రిటీషుప్రభుత్వం ఈ నవలను నిషేధించిందంటే ఆ నవలకున్న ప్రాధాన్యం గమనించవచ్చు. ఈ యుగంలోని మహారచయితలు. చలం, విశ్వనాథ, అడవిబాపిరాజు ముగ్గురూ మూడురకాల వ్యక్తిత్వాలు, స్వభావాలు గలవారు. స్త్రీ జనోద్ధరణం చలం నవలల్లోని ప్రధాన లక్ష్యం. పురావైభవాన్ని పరిరక్షించాలన్న సనాతనపరులు విశ్వనాథవారు. అడవి బాపిరాజు సమకాలిక స్థితిగతుల్ని వర్ణిస్తూనే కళాత్మకంగా ఉండాలన్న కళోపాసకులు. చారిత్రక నవలారచయితగా నోరి నరసింహశాస్త్రిగారికొక ప్రత్యేకత ఉంది. వీరందరిలో విశ్వనాథ 1918 లోనే 'అంతరాత్మ'ను రచించిన ప్రారంభకులు. వారి రెండోనవల 'ఏకవీర' (1925) ఉత్తమనవల. తెలుగు నవలా సాహిత్యంలోనే బృహత్తరమూ, సంక్లిష్టమూ బహుపాత్రకమూ అయిన వీరినవల 'వేయి పడగలు' ప్రముఖస్థానాన్ని ఆక్రమిస్తుంది. వీరు సుమారు అన్నిరకాల నవలలు అంతవరకు రచించి నవలాసాహిత్య నిర్మాత కాగలిగారు. ఈ యుగమే మనకు ప్రసక్తమైనది

ఆ వెనుక 1940–60 ల మధ్య మనోవైజ్ఞానిక నవలలు వెలిశాయి. ఈ కాలంలో కొడవటిగంటి, బుచ్చిబాబు, గోపీచంద్, డా॥ జి.వి. కృష్ణారావు, రావిశాస్త్రి, రచయిత్రులలో లత, రంగనాయకమ్మ, మాలతీచందూరు, డా॥ శ్రీదేవి పేర్కొన

దగినవారు. 1960 తరువాత అధికంగా రచయిత్రులదే పై చేయి. అయితే అనేక సమస్యలకు చిత్రణ, జీవితంలోని వివిధ దృక్కోణాలనుంచి పరిశీలించడమూ, 'మార్క్సిజం' 'హ్యూమనిజం' అస్తిత్వవాదం మొదలైన లక్షణాలు ప్రాధాన్యం వహించి నవలారచన కొనసాగింది. చైతన్యస్రవంతి (Stream of Consciousness) పద్ధతికి సంబంధించిన నవలలుఉన్నాయి. స్వభావవాద సిద్ధాంతానుగుణమైన నవలలువచ్చాయి. సరే ఆరంభంలోనేవచ్చిన డిటెక్టివ్ నవలలు, చౌకబారు నవలలు, దెయ్యాలు భూతాలు మొదలైనవాటిని చిత్రించే వాటినకళ్ళు మళ్ళీ పాఠకులను ఈమధ్య ఆకట్టుకొంటున్నాయి. రచయితల నవలలకంటె మహిళల నవలలంటే చెవికోసుకొనే పాఠకులసంఖ్య హెచ్చింది. ఆడవాళ్ళ పేర్లుపెట్టుకొని రచించే మగ రచయితలూ ఉన్నారు. మళ్ళీ మన పూర్వవైభవమన్న పేరుతో భ్రాంతిమాత్రకమైన నవలలూ వస్తున్నాయి. వీటికన్నిటికీ పత్రికలు సహకరిస్తున్నాయి. పాఠకులు పోషిస్తున్నారు.

ఇదంతా ప్రముఖంగా విశ్వనాథవారు నవలాకారుడుగా మహోన్నత శిఖరారూఢుడై ఉన్నారని తెలపడానికి ఉపోద్ఘాతం మాత్రమే. తరువాత వారి 'వేయిపడగలు' నవలా విశ్లేషణకు ఇది ఉపకరిస్తుందన్న ఆశతో చేసిన ప్రయత్నమే.

2.4 విశ్వనాథవారి నవలలు – వర్గీకరణ

ఆధునికాంధ్ర సాహిత్య ప్రపంచంలో సమస్త సాహిత్య ప్రక్రియల్ని సృజించి ఉత్తమ సాహిత్య నిర్మాతలయ్యారు విశ్వనాథవారు.[1] వారు నిజంగా కవిసమ్రాట్టులే. కావ్యాలు, ఖండకావ్యాలు, గేయరచనలు, నవలలు, కథలు, నాటకాలు, విమర్శలు – అన్నిటినీ రచించి కృతార్థులయ్యారు. తమదైన ఒక ముద్ర వేశారు. ప్రస్తుతం విశ్లేషణకు ప్రసక్తమయ్యేది వారి 'వేయిపడగలు' నవల. కనుక వారి నవలా సాహిత్యాన్నంతటినీ వర్గీకరించి, వేయిపడగలు విమర్శనాత్మక దృష్టితో సమాలోచించటానికి వీలు కలిగించుకోవటం అవసరం.

విశ్వనాథవారి నవల లన్నిటినీ స్థూలంగా మూడు విధాలుగా విభజించవచ్చు. సాంస్కృతిక నవలలు సాంఘిక నవలలు, చారిత్రక నవలలు. మళ్ళీ చారిత్రక నవలలు, దాక్షిణాత్య చారిత్రక నవలలు–, మళ్ళీ వీటని పురాణవైర గ్రంథమాల,

భారత చరిత్ర, కాశ్మీరు చరిత్ర, నేపాల్ చరిత్ర మొదలైన వాటికి సంబంధించిన నవలలుగా విభజించవచ్చు. వీటి నీ విధంగా పేర్కొనవచ్చు.

1. సాంస్కృతిక నవలలు
2. సాంఘిక నవలలు
3. ఆంధ్ర చారిత్రక నవలలు
4. దాక్షిణాత్య చారిత్రక నవలలు
5. భారత చారిత్రక నవలలు
6. కాశ్మీరు చారిత్రక నవలలు
7. నేపాల్ చారిత్రక నవలలు
8. రాజకీయ సంబంధి నవలలు
9. సంగీత సంబంధి నవలలు
10. సాంస్కృతిక భౌగోళిక నవలలు

1. సాంస్కృతికాలు :

అంతరాత్మ [1918] ; మూడు తరాలు [1932] : హా హా హూ హూ [1932]

2. సాంఘికాలు :

వేయిపడగలు [1934] : దేవతల యుద్ధము [1942] : వీరవల్లభు [1935] : మాబాబు, చెలియలి కట్ట [1932] ; స్వర్గానికి నిచ్చెనలు [1948] : పునర్జన్మ [1964] : తెరచిరాజు [1954] : నీలపెండ్లి [1962] : పరీక్ష [1949]: శార్వరినుండి శార్వరి దాక [1962] : బాణావతి [1964] : కుణాలుని శాపము [1948] : గంగూలీ ప్రేమకథ [1963] : జేబుదొంగలు [1940] : విష్ణుశర్మ ఇంగ్లీషు చదువు [1961] : ప్రాయశ్చిత్తము [1960] :

3. ఆంధ్ర చారిత్రకాలు :

వీరపూజ [1948] : చందవోలురాణి [1970-71] : ధర్మచక్రము [1945] : కడిమిచెట్టు [1943] : ప్రళయనాయుడు, బద్దన్నసేనాని [1947]

4. దాక్షిణాత్య చారిత్రకాలు :

ఏకవీర [1925] స్నేహఫలము [1948]

5. భారతచరిత్రను సంబంధించిన నవలలు :

వీటినే పురాణవైర గ్రంథమాల అని అంటారు. భగవంతునిమీది పగ [1958] : నాస్తిక ధూమము [1958] : ధూమరేఖ [1959] : పులిముగ్గు [1960]: చంద్రగుప్తుని స్వప్నము [1960] : నందోరాజా భవిష్యతి [1963] : అశ్వమేధము [1960] : నివేదిత [1963] : హెలీనా [1963] : వేదవతి [1963] : నాగసేనుడు [1961] : అమృతపల్లి [1960] :

6. కాశ్మీరు చరిత్రకు సంబంధించిన నవలలు :

యశోవతి [1965] : మిహిరకులుడు [1964] : కవలలు [1965] : పాతి పెట్టిన నాణెములు [1965] : భ్రమరవాసిని [1965] : సంజీవకరణి [1965]

7. నేపాల్ చరిత్రకు సంబంధించిన నవలలు :

దిండుకింద పోకచెక్క [1964] : చిట్లీచిట్లని గాజులు [1964] : సౌదామిని [1964] : దూతమేఘము [1964] : లలితాపట్టణపు రాణి [1964] : దంతపు దువ్వెన [1964]

8. రాజకీయ సంబంధి నవలలు :

పులుల సత్యాగ్రహము [1948] : సముద్రపుదిబ్బ [1960] : వల్లభమంత్రి [1958] ; దమయంతీ స్వయంవరము [1961] :

9. సాంస్కృతిక భౌగోళిక నవల :

ఆఱునదులు [1964] :

ఈ ద్వితీయప్రకరణం 'వేయి పడగలు' నవల విశ్లేషణకు నేపథ్యంగాఉండి, సమగ్రమైన అవగాహన కలిగించ గలదన్న భావనతో ఇక్కడ ఈ విషయాలన్నీ పొందుపరచడం జరిగింది.

సూచికలు

1. దాశరథి రంగాచార్య : తెలుగు నవల – పుట్టుక, పరిణామం. అభ్యుదయ–ఈ దశాబ్దపు నవల విశేష సంచిక 1980 – పుటలు 1-3.

2. W. H. Hudson : Introduction to the study of literature – the study of prose Fiction P. 131

3 పై దే. పు. 139.

4. పింగళి లక్ష్మీకాంతం : సాహిత్య శిల్ప సమీక్ష – పు. 368.

5. i) పై 2 వ సూచికలోనిదే పు. 129.
ii) పింగళి లక్ష్మీకాంతం; సాహిత్య శిల్ప సమీక్ష – పు 368.

6. మొదలి నాగభూషణశర్మ : తెలుగు నవలా వికాసము పు. 17

7. డా॥ అక్కిరాజు రమాపతిరావు : తొలి తెలుగు నవల : తెలుగు నవల నూరు సంవత్సరాలు పు. 1

8. పై దే. పు. 1–8

1. పై 6 వ సూచికలోనిదే. పు. 7

10. పై 1 వ సూచిక లోనిదే పు–3.

11. పై దే. పు. 3,4.

12. పై 6 వ సూచిక లోనిదే పు. 41

# 3.0 వేయి పడగలు - ఇతివృత్తం - నిర్మాణ వైఖరి

వేయి పడగల్లోని ఇతివృత్త నిర్మాణ వైఖరిని పరిశీలించే ముందు వివిధ విమర్శకుల అభిప్రాయాలు, వేయి పడగల్లోని ఇతివృత్తం గూర్చి తెలుసుకోవడం అవసరం.

3.1 "నిజానికి శిల్పము కాని, సాహిత్యము కాని జాతీయమై యుండవలెను. విజాతీయమై యుండరాదు. వ్రాసిన వానికి ముక్తి, చదివిన వానికి రక్తి ముక్తి, ఎంత సముద్రముమీద ఎగిరినను పక్షి రాత్రి గూటికిచేరును. ఇది జాతీయత. ఇది సంప్రదాయము".[1] ఇది విశ్వనాథవారి అభిప్రాయం.

"వేయి పడగలు ముప్పైఏళ్ళ తెలుగుజాతి జీవితానికి ప్రతిబింబం. విదేశ పాలన దాని మంచిచెడ్డలు, జమీందారీలు, వానివ్యవస్థ, సహాయ నిరాకరణోద్యమం, దాని ప్రభావం—ఇవి అన్నీ కలిసి ఒకజాతిని ఏ విధంగా నడిపించాయో తెలియ జేస్తాయి."[2]

"విశ్వనాథవారి సాంఘిక నవలలు ఒకయెత్తు ఈనాడు సంఘంలోవచ్చిన మార్పులు, సంస్కరణలు తప్పుత్రోవను పడినవని విశ్వనాథవారి అభిప్రాయము. కనుక తిరిగి పూర్వపు వర్ణాశ్రమ ధర్మవ్యవస్థ పూర్వపు మతసాంఘిక సంప్రదాయములు కావలెనని వారు కథలల్లుదురు. నవలలు వ్రాసెదరు. అట్టి నవలలో అగ్రగణ్యమైనది 'వేయి పడగలు'...... అట్లు వచ్చుటలో కథావిషయైక్యము లోపించుటయు కలదు. అందుచేతనే ఒక ప్రసిద్ధవిమర్శకుడు వేయిపడగలలో వేయి పడగలే కాని పాము ఎక్కడను గోచరించుటలేదని విమర్శించెను."[3]

"వేయిపడగల్లో ప్రజల ధార్మిక నైతికజీవితాన్ని ఒకవైపు చిత్రిస్తూ రాను రాను మానవుడి స్వార్థం, అహంకారం, వ్యాపారలక్షణాలనే (Commercial nature) ప్రజాజీవనం ఎంత దుర్భరమైపోతున్నదో నిరూపించారు. అంతేకాని, పూర్వ రాజరికాన్ని, జమీందారీ వ్యవస్థను, తిరిగి స్థాపించాలనే ఉద్దేశ్యంతో ఆ నవల వ్రాయబడలేదు."[4]

"ప్రగతి కాములము, నభ్యుదయ శీలురము నను కొందఱు రాజకీయవేత్తల దృష్టిలోనిది [వేయి పడగలు] యభ్యుదయ నిరోధక సాహిత్యము. నేటికంటె గతకాలము మేలనుకొనకపోవుటయే వారిదృష్టిలో నభ్యుదయమన్నమాట. మొత్తము మీద నిందు లోపములకంటె గుణములే యధికమని సాహిత్యపరులంగీకరింతురు."[5]

"ఇరవయ్యో శతాబ్దిలో ప్రబలిన 'ప్రాబ్లం ప్లేస్'లో అద్భుతం కొంత ఉంటున్నది. పైగా సిద్ధాంతాలను చర్చించేటప్పుడు చాలవరకు భిన్నమతాలుకూడ చర్చింపబడతాయి. అందువల్ల పాఠకుడు విముఖుడుకాడు. దీనికితోడు హాస్యముంటుంది. 'షా' తననాటకాల్లో ఈ పనిచేశాడు. పైగా సిసింద్రీలాంటి చతురోక్తి ప్రతిచోట తాండవిస్తుంది. అందువల్ల 'షా' నాటకాలు తృప్తికరంగా ఉన్నాయి- (షాకు డైనమిక్ విట్ లేకపోతేనా—ఏమయ్యేవాడో అన్నాడు ఆర్చర్).

"విశ్వనాథ సత్యనారాయణగారు 'వేయి పడగల్లో ఇలాంటివి చేయలేదు. ప్రతిచోటా శాస్త్రీయ జ్ఞానలోపం గోచరిస్తుంది. పైగా సామాజిక సమస్యలను చర్చించేటప్పుడు భిన్నాభిప్రాయాలను పాత్రలచేత చర్చించరు. ఒకవేళ ఆ పాత్రలు ఇతర అభిప్రాయాలను ఎత్తుకొన్నా ఆయా మతాల్లోని దుర్బలాంశాలనే ఎత్తుకుంటాయి. ముఖ్యాంశాలను వీరు గుర్తించకపోవడం వల్ల గాని, వీరి సిద్ధాంతాన్ని కూలద్రోస్తూ వుండటం వల్ల గాని ఎత్తుకోరు. అదేపనిగా సనాతన ధర్మాన్నిగూర్చి ఉపన్యాసాలు బనాయింపిస్తారు దీనివల్ల సనాతనుడుకాని పాఠకునికి అసంతృప్తి, పరాఙ్ముఖత్వం కలిగిస్తాయి. పైగా 'షా'కు ఉన్న సర్వతోముఖమైన చతురోక్తిలేదు. అందువల్ల వీరి 'వేయి పడగల'ను సొంతంగా చదివేవాళ్లకూడా అరుదు. సనాతనుడైన పాఠకునకుకూడా కలిగేది సంతోషమేకాని ఆనందంకాదు."[6] అని తీర్పు నిచ్చారు డా॥ జి. వి. కృష్ణారావుగారు.

"తులనాత్మక విమర్శ దృష్ట్యా ధర్మారావు పాత్రకు సాటి రవీంద్రుని గోరా. "అయ్యా ! ఒక్క వ్యక్తికి మర్యాదోల్లంఘనము జరిగినదని మీరింత కష్టపడుచున్నారే ? మీ భావము వలన మీ ప్రవర్తన వలన నొక మహా దివ్య సంఘమునకు నాపత్తు కలుగుచున్నది. మీరు సంఘ మర్యాదోల్లంఘనము చేసితినని మీకు గోషము...." అను ధర్మారావు మాటలు బ్రహ్మసమాజము వారిపై క్షాలుదువ్వు గోరా మాటల వలెనే ఉన్నాయి. కాని ఇద్దరి వ్యక్తిత్వాలు భిన్నము. ధర్మారావెంత తెలుగువాడో, గోరా అంత వంగీయుడు. గోరా చేరుకున్న గమ్యస్థానము

"సర్వధర్మాన్ పరిత్యజ్య ...." ధర్మారావునకు సర్వధర్మములు తనేనన్న భావము. ధర్మారావు పయనించనేలేదు. ఇక గమ్యస్థానము చేరుకోవడ మెక్కడ ? 'సర్వథా చ్యుతమైన మొగిలు కొండ కొమ్మనుండి జారి జారి ఝరిణీ రూపమున గాలు నిలువ ద్రొక్కుకొన లేకుండ నూరకే ప్రవహించుటకే ప్రవహించినట్లు' స్పందించి పోవుట ధర్మారావు స్వభావము. ఈ భేదమే రవీంద్రుని విశ్వకవిని చేసినది. ఆయన కంటె ప్రతిభావంతుడైన విశ్వనాథను తెలుగు కవి సమ్రాట్‌గానే నిలిపినది. 'నౌకాభంగము' నుండి 'గోరా' వరకు రవీంద్రుడెన్ని మెట్లు పైకెక్కెనో, 'ఏక వీర' నుండి 'వేయి పడగల' వరకు విశ్వనాథ అన్ని మెట్లు క్రిందికి దిగెను." [7] అంటారు ఆర్. ఎస్. సుదర్శనం గారు.

కాని వీరికి సమాధాన మన్నట్లు "ఇది భారతీయ ఋష్యాత్మ. అందుకే ఠాగూరు 'గోరా' కంటె 'వేయి పడగలు' వేయిరెట్లు గొప్ప గ్రంథం అసామాన్య సూత్ర దర్శనం విశ్వనాథకే ఉంది. తెలుగు భాషలో వేయిపడగలు పుట్టడం ఆ జాతి అదృష్టం."[8] అంటారు డా॥ తుమ్మపూడి కోటేశ్వరరావుగారు.

ఇన్నివిధాల అనుకూల ప్రతికూల విమర్శలకు గురియైన విశ్వనాథవారి వేయి పడగలు నవల వైశిష్ట్యం స్పష్టమౌతుంది. అందుకే ఇక్కడ మనం ఆస్కార్‌వైల్డ్ చేప్పిన మాటలు గుర్తించడం సముచితం.

"Diversity of opinion about a work of art shows that the work is new, complex and vital.

When critics disagree, the artist is in accord with himself."[9]

ఈ ఆస్కార్‌వైల్డ్ మహాశయుని మాటలు కవిసమ్రాట్ విశ్వనాథ సత్య నారాయణగారిపట్ల ప్రత్యక్షర సత్యం. అంటే ఒకానొక కళాస్రష్టనుగూర్చి విమర్శక లోకంలో ఏకాభిప్రాయం లేనప్పుడు ఆ కళావేత్త తనదైన బాణీకలిగి ఉండటమే గాక తన వైశిష్ట్య నిరూపక రచనావైవిధ్యమూ, సంశ్లిష్టతా, శ్రేష్ఠతా నిలబెట్టుకొన్నా డని ఆస్కార్‌వైల్డ్ అన్న మాటలకు అర్థం. ఈ విషయం విశ్వనాథవారికి సము చితరీతిని సరిపోతుందనడం అత్యుక్తికాదు. అతిశయోక్తి అంతకంటెకాదు. స్వభా వోక్తిఅనడమే సహజం. పైపెచ్చు వారి వేయిపడగలు రచనాశిల్ప వైవిధ్యవిష

యంలో మరీ వాస్తవాన్ని వివిధ దృక్కోణాలనుంచి పరిశీలించాక అందరికీ అభి వ్యక్తమయ్యే అత్యుత్తమాంశం.

3.2 విశ్వనాథవారి వేయిపడగల్లోని ఇతివృత్త నిర్మాణదక్షత పరిశీలించే ముందు అందులోని ఇతివృత్తాన్నిగూర్చి తెలుసుకొందాము.

"విశ్వనాథవారి భావాలకు పరకాష్ఠ వేయిపడగలు. శిల్పం దృష్ట్యాకూడ ఇది ఆయన నవలలో ఉన్నతమైనది. వేయిపడగలు ముందు వచ్చిన నవలలు ఒక యెత్తు. తరువాత వచ్చిన ఉపన్యాసాత్మకాలైన నవలలు వేరొక యెత్తు. ఈరెంటికీ మధ్య అత్యున్నతంగా నిలచే నవల వేయి పడగలు.

"వేయి పడగలు ఒక బృహన్నవల. గాల్స్‌వర్దీ వ్రాసిన 'ఫోర్ సైట్ సాగా' లోను ఇందులోనూ మూడు తరాల వారి జీవితం చిత్రించ బడ్డది. ఆ మూడు తరాలలో జాతి జీవిత విధానంలో వచ్చిన్న మార్పులు పాశ్చాత్య వ్యామోహంతో దేశంలో ఇన్నాళ్ళు నిలచిన జాతీయత, జాతి ధర్మము, వీని క్రమ క్రమ క్షీణత ఈ నవలలో విచిత్రంగా చిత్రించ బడ్డాయి.

"ఇది ఒకరకంగా చారిత్రక నవల. ఇరవయ్యో శతాబ్దం ప్రారంభం నుంచి మూడు దశాబ్దాల పాటు తెలుగు దేశంలో జరిగిన కథ ఇందులో చూపబడ్డది. ఒక విధంగా చూస్తే 1900–1930 మధ్య కాలంలో తెలుగు దేశంలో వచ్చిన ఆర్థిక సాంఘిక రాజకీయాల పరిణామ చరిత్ర వేయి పడగలని చెప్పవచ్చు. విశ్వనాథ వారికి మన పూర్వాపరాలను నాడు మన పెద్దలు నియమించిన సంఘ వ్యవస్థఅన్నా ఎంతో మక్కువ. కొన్ని వేల సంవత్సరాల నుంచి భారతీయ సంస్కృతికి, సంఘ వ్యవస్థకు వివాహ వ్యవస్థ కేంద్రమై ఉన్నది. పాశ్చాత్య వ్యామోహంతో పైపై మెరుగులతో వివాహ వ్యవస్థ అన్నా, పూర్వాచారాలన్నా, దైవభక్తి అన్నా ప్రజలలో కనిపిస్తున్న నిరాదరణ ఆయనను ప్రతి క్షణం బాధ పెట్టింది. ఈ వేదనకు పర్యవసానమే 'వేయి పడగలు' రచన. ఈ రచనలో ప్రతిక్షణం, విశ్వనాథ వ్యక్తిత్వము, ఆయన భావనా బలము ద్యోతకం అవుతూనే వుంటాయి. విదేశ పాలన యెడ కలిగిన వైముఖ్యం మనలో జాతీయోద్యమ భావాన్ని ఎంతగా మేల్కొల్పిందో, పాశ్చాత్య నాగరికతా ప్రభావము వారి మత నైతిక భావాల ప్రభావం మనలో అంతటి వైముఖ్యం కరగించలేదు. విశ్వనాథ భావనలో రాజకీయమైన జాతీయత కూడ అంత ముఖ్యమైనదే"[10]

విశ్వనాథవారి వేయి పడగలు నవల ముప్పైఏడు అధ్యాయాలలో విస్తరించిన వారి నవలల్లోనేకాదు, తెలుగు నవలాసాహిత్యంలోనే బృహత్తమమైన గ్రంథం.

మొదటి అధ్యాయం "వేయిపడగల పాము విప్పారుకొని వచ్చి కాటందు కొన్నది కలలోన రాజును" అనే గణాచారిపాటతో ఆరంభమవుతుంది. సుబ్బన్న పేటలో ఈపాట పాడుతూ గణాచారి తిరుగుతూ ఉంటుంది. చివరకి రావిచెట్టు క్రింద కూర్చుంటుంది. పెదకాపు ఆవుపాలు పాముతాగటం, నాగేశ్వరస్వామి అతనికి కలలోన కనిపించి దేవాలయం నిర్మింపజేయమనడం, మరో నిస్సంతయిన బ్రాహ్మ ణుడు సంతతికలిగిన దేవాలయం కట్టింతునని మొక్కుకోవడం, అలాగే జరగడం, ఆ ప్రాంతంలో వీరన్ననాయుడు కోట నిర్మించి దేవాలయం స్థాపించడం జరిగింది.

"వీరన్న నాయుని వంశంవారు స్వామికి ప్రతినిధులు. బ్రాహ్మణ వంశం వారు ప్రచారకులు. కాపు వంశపుటాడబడుచులు స్వామికి వ్యాఖ్యాతలు. ఈ రీతిగా భూమ్యాకాశములమధ్య స్వర్గ మర్త్య లోకములమధ్య ప్రత్యక్ష ప్రత్యక్షములమధ్య నొక స్థిరమైన సంబంధమేర్పడెను.

"పైన భగవంతుడు, క్రిందరాజును, బ్రాహ్మణుడును, ఈరెండు మహా సంస్థలకు మధ్య గణాచారి త్రెంచరాని లంకె.

"ఇది నాలుగు స్తంభముల ధర్మమంటపం. స్వామి, జమీందారు, బ్రాహ్మ ణుడు, గణాచారి—వీరు నలుగురు స్తంభములు.

"ఈ ధర్మమంటపము నిత్యకల్యాణము పచ్చతోరణముగా మూడువందల యేండ్లు నిరంతరంగా నవ్యవహితముగా శోభాయమానమై యొప్పెను. ఈ మూడు వందల యేండ్లలో వేయిపడగలతో భాసించిన నాగేశ్వరస్వామి సుబ్బన్న పేటమీద తన సహస్ర ఫణామండలి ఛత్రముగాఁజూచి యా చల్లనినీడలో నాయూరి ప్రజల జోకొట్టెను. వారును ధర్మమోక్షములమధ్య నూగుచున్న యర్థకామములను సుయ్యా లలో సుఖనిద్ర గాంచుచుండిరి."[11]

రావిచెట్టుకింద సభదీరిన వారిలో ఒకరు గణాచారిపై కోపగించుకొన్నాదట. తక్కిన కొందరు వారించారు మళ్ళీ అదేపాట పాడుతూ వెళ్ళిపోయింది గణాచారి

రెండవ అధ్యాయం : ధర్మారావు పరమేశ్వరశాస్త్రి కుమారుడు. పరమేశ్వర శాస్త్రి నాగేశ్వరశాస్త్రికి ఐదవతరమువాడు. కృష్ణమనాయుడు సుబ్బన్నపేటకు

జమీందారుఅయిన కాలంలో రామేశ్వరశాస్త్రి దివాను. "ఆయన నాలుగువర్ణముల నుండి బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్ర కన్యలను వివాహమాడి నల్గురియందును సంతానము బడసెను. ఇదియుగాక రత్నగిరి యనునొక భోగాంగననుంచుకొనెను. ఆమె యందును సంతానముకలిగెను."[12]

రామేశ్వరశాస్త్రి ఔదార్యం, చివరికి దారిద్ర్యంతో మరణించడం, కృష్ణమ నాయుని దేవిడిలోని సర్వసంభారాలతో సంస్కారం జరిగింది. ధర్మారావు దారి ద్ర్యంతో క్రుంగిపోయాడు కృష్ణమనాయుడు ఆదుకొన్నాడు గోవన్నమూలంగా. ధర్మారావు సన్నిహితుడయ్యాడు కృష్ణమనాయునికి. కృష్ణమనాయుని కుమారుడు రంగారావుకిది ఇష్టంలేదు. ఆపాటికి రంగారావు బి. ఏ. మొదటిసంవత్సరం చదు వుతూ ఉండేవాడు బహూదూరంలో. కృష్ణమనాయుని మరణంతో ధర్మారావు చదువు అర్ధంతరంగా ఆగిపోయింది.

మూడవ అధ్యాయం ; ధర్మారావుకు గణాచారికన్పించి 'వేయి శిరస్సుల నాగరాజును కలలో స్పృశించినది' అని చెప్పింది. పరమేశ్వరశాస్త్రి రంగాజమ్మ అనే క్షత్రియ స్త్రీని వివాహమాడాడు. ఆమెకు ధర్మారావంతటి పుత్రుడున్నాడు. తీర్థ యాత్రలలో వైశ్యకన్య హైమవతిని వివాహమాడాడు. పెదకాపు కూతురు మంగను వివాహమాడాడు. మంగపుత్రుడే పసరిక. దేవదాసి గిరిక పరమేశ్వరశాస్త్రిగారుంచు కొన్న రత్నగిరి అనే వేశ్యపుత్రిక; ధర్మారావుకెదుటపడి 'అన్నా' అని పిలిచినది.

నాల్గవ అధ్యాయం : కృష్ణమ నాయని దయా దాతృత్వాలు, కళాపోషణ, శౌర్యపరాక్రమాలు వర్ణితం. రంగారావు పాశ్చాత్య వ్యామోహం, కృష్ణమనాయని మరణానంతరం రంగారావు పట్టాభిషేకం, పూర్వ రాచరిక పద్ధతులు నశించడాన్ని సహించని లక్ష్మణస్వామి అనే ఏనుగు రంగారావుకెదురేగి ఆతని నిర్లక్ష్యానికి ప్రతీకారంగా మరణించాడు; రంగారావు పట్టాభిషేకంలో రకరకాల వినోదాలు, విశేషాలు, పెదతండ్రి పుత్రులు రామేశ్వరుడు, రాధాకృష్ణయ్య, సర్వారాయుడు, దివానుల ఆధిపత్యం, పట్టాభిషేకం సందర్భంలో రత్నగిరి క్షేత్రయ్య పదాభినయం చిత్రితం.

ఐదవ అధ్యాయం : రామేశ్వరం ధర్మారావుపై కక్ష పూనడం, రుక్మిణమ్మా రావు దానిని తప్పించడం, ధర్మారావుకు కబీరు (రత్నగిరి తమ్ముడు) బాసటగా నిల

పడం, గిరికా ధర్మారావుల సోదరి ప్రేమ, ధర్మారావు కార్యానికి కావలసిన అప్పు విషయంగా రంగాజమ్మ తోడ్పాటు, వదిన కిమ్మని గిరిక ధర్మారావుకు ఉంగరం ఇవ్వడం ఇందలి విషయాలు.

ఆరవ అధ్యాయం : అరుంధతీ ధర్మారావుల కార్యం – చిన్న గొడవలు; రంగాజమ్మ రుక్మిణమ్మ రావుల వితరణ; ధర్మారావు పై చదువుకై రాణి సాయం–

ఏడవ అధ్యాయం : ధర్మారావు బందరు చదువు; అతని మిత్రులు సూర్యపతి, రాఘవరావు, కిరీటి – మైత్రి; ధర్మారావు గుంటూరు చదువు; మిత్రులిద్దరు కొండవీటి కొండను, పూర్వవైభవాన్ని దర్శించడం; సెలవుల్లో సుబ్బన్న పేటకు వెళ్ళి అరుంధతిని ఇంటికి తీసుకొని రావడం, వారి దాంపత్య సుఖం; రంగాజమ్మ పుత్రుడు, అన్న అయిన రామచంద్ర రాజుతో కలయిక; రంగాజమ్మ మరణం; గిరిక భక్తి విశేషం.

ఎనిమిదవ అధ్యాయం : గుంటూరులో ధర్మారావు సంసారం: కలరా వ్యాపించడం; బీదతనం; బాధలు, కష్టాలు; రాణి రుక్మిణమ్మారావు అనారోగ్యం; ధర్మారావు సుబ్బన్న పేటకు వెళ్ళి దర్శనార్థం కోటలోకి వెళ్ళి దర్శనం కాక తిరిగి రావడం; బెజవాడ మిత్రులు – సూర్యపతి, రాఘవరావు, కిరీటి, రాధాపతి; గుంటూరులోని నాయరు జీవితం; బెజవాడ సంగీతసభ; రాధాపతి ప్రేమ; కిరీటి ప్రేమ.

తొమ్మిదవ అధ్యాయం : గణాచారి మళ్ళీ బయలుదేరి కోటలోకి వెళ్ళింది వచ్చింది. ఎవరూ పట్టించుకోలేదు. పెద్దరాణి రుక్మిణమ్మారావు, చిన రాణి సరోజినీ దేవి ఒకరి తరువాత ఒకరు మరణించడం, రంగారావు చాలా వరకు చెన్నపట్నంలోనే మకాం. సరోజినిని లెక్క చేయలేదు. రాణి మరణానంతరం రంగారావు ఇంగ్లండు వెళ్ళి సుసానీ అనే ఇంగ్లీషు దొరసానిని వివాహమాడడం; ఆవిడ శశినీ కావడం, సుబ్బన్నపేట రావడం, హరప్పనాయనికి ధర్మారావు చదువు చెప్పడం, ఈట్సన్‌దొర ట్యూటర్‌గా ఇంగ్లీషుచదువు చెప్పడం.

పదవ అధ్యాయం : గుండేరు వరద; శశిని పేట; రంగారావు శశిని కలయిక, వాగ్దానం, హరప్ప ధర్మారావు జీతంగురించి ఆలోచించడం, పసరిక జ్వరం, పన్నులనుగూర్చిన సభ, రాచరికానికి అనుకూలంగా ఉండుమనడం, చంద్రారెడ్డికి

ఇష్టం లేకపోవడం; హరప్పా ధర్మారావుల మతం గూర్చినచర్చ; ధర్మారావు పుష్కరాలకు బెజవాడవెళ్ళడం; సూర్యపతి పశుపతులతో కలయిక; పశుపతితోపాటు 'ఉండి'కి వెళ్ళడం; అక్కడ పరిచయం; బెజవాడ స్టేషన్‌లోని అగడాలు—హరప్పా ధర్మారావుల కలయిక—కాలేజీ స్థాపనకై దివాను నాగేశ్వరరావు ఆలోచన.

పదకొండవ అధ్యాయం : జాతీయ కళాశాలస్థాపన; జాతీయ క్రీడలు; వినోదాలు; కూచిపూడి నాటకాలు మొదలైనవి. ఉప్పెన, గుండేరు వరద, గాలివాన; జాతీయ కళాశాల కేశవరావు మరణంతో ప్రభతగ్గింది; జమీందారీ కాలేజి ప్రారంభమైంది; ధర్మారావు తెలుగు పండితుడుగా నియమితుడయ్యాడు; రాఘవరావు జాతీయోద్యమంలో చేరాడు; హరప్పనాయని వ్యక్తిత్వం.

పన్నెండవ అధ్యాయం : పురపాలక సౌధనిర్మాణం; చంద్రారెడ్డి సర్ప దర్శనం; గిరికను అవమానించబోయి రామేశ్వరం భయపడడం; ధర్మారావు నారాయణరావుతో ఘర్షణ; శశినీ వృత్తాంతం; ఆమెకు పల్లెజీవితంపై గల మమకారం; రామేశ్వరం తాలూకా అధ్యక్షుడుగా ఎన్నికకావడం; గణాచారి పసరికల సందర్శన; గణాచారి ధర్మారావుల సందర్శన.

పదమూడవ అధ్యాయం : జాతీయ కళాశాలకు క్రొత్త అధ్యక్షులు శివరావు; శివరావు కృష్ణావతారం అనుకోవడం, ఆవిషయం ధర్మారావుకు నివేదించడం; కిరీటి పశుపతులు సుబ్బన్నపేటకు వచ్చి కలుసుకోవడం; రామేశ్వరం తాలూకా బోర్డు ప్రెసిడెంటుగారు, సినిమావల్ల ధనం బాగా సంపాదించటం, రామేశ్వరం ప్రాపు కోసం జోస్యులనే ఉపాధ్యాయుడు ప్రాకులాడి, వానికి మర్యాదచేయబోయి భార్య మంగమ్మను అప్పగించడానికి తనకు తెలియకయే కారణంకావడం, విషయం తెలిసిన జోస్యుల మనస్సంఘర్షణ, రామేశ్వరం జోస్యుల భార్య మంగమ్మతోడి సంబంధం నలుగురికీ తెలియడం—

పదునాల్గవ అధ్యాయం : గిరికారుంధతి, రథంతరీ ధర్మారావులు వేణుగోపాలస్వామి ఆలయదర్శనం, అరుంధతీ ధర్మారావుల ప్రసంగంలో రామేశ్వరం మంగమ్మల ప్రసంగం; ఉదయమే ధర్మారావు గణాచారిని చూడటం, గిరికతో ధర్మారావు దైవదర్శనార్థం వెళ్ళడం, హరప్ప గిరికను చూడడం, ఎవరికీ రాజావారు నమస్కరించరాదని ధర్మారావు చెప్పడం, హరప్పకు పురాకథలు గుర్తుకురావడం—రంగారావు శశినీల గూర్చిన నియమం—వివరించబడ్డాయి.

పదునైదవ అధ్యాయం : కిరీటి ప్రణయం, విరహం, వివాహం, ధర్మారావు మైత్రి; మంగమ్మ బ్రతుకుతెరువుకై జోస్యులబోధ; జోస్యుల హత్య; దొంగనోట్ల ముద్రణలో రామేశ్వరాన్ని అరెస్టుచేయడం, ఏడేండ్లు జైలుశిక్ష, మంగమ్మ తన పేరఉన్న డబ్బుతో పరారిఅయి జైలులోఉన్న రామేశ్వరానికి తగినశిక్ష పడిందని కన్వించి రావడం; సహాయ నిరాకరణోద్యమంలో నిర్బంధితుడైన మిత్రుడు రాఘవ రావును చూడబోయి బందరు సబ్‌జైలులో రామేశ్వరాన్ని ధర్మారావు చూడడం.

16వ అధ్యాయం : గిరిక, అరుంధతి, రథంతరి, శశిరేఖల కలయిక మైత్రి; గిరికాభక్తి—ధర్మారావు మాటల్లో, ఆమె అభినయంలో, శశిరేఖకి కనిపించినతీరులో; కిరీటి ధర్మారావులు సుబ్రహ్మణ్యేశ్వరస్వామిని దర్శించడం; భక్తి తత్పరతని కిరీటి ప్రకటించడం, వీరిద్దరు హరప్పను చూడడం; పూర్వ పూర్వవైభవాన్ని నిలుపుతానని భావించడం; పురావైభవ వివరణ; శశిరేఖా కిరీటులభక్తి, ప్రయాణం, ధర్మారావు కిరీటుల మైత్రిబంధం; అరుంధతి ప్రసవం, మగసంతానం; ధర్మారావు హరప్పనుచూచి దేవాలయంవైపు వెళ్ళడం, గిరికను చూడడం వాకిలివద్దనే నిలచి ఉండడం, హరప్ప దేవాలయంవైపు వెళ్ళడం—అతని మనోభావం; ధర్మారావు పసరికలు కలసి, చేలమీద పడిపోవడం, వర్షంలో తిరగడం, పసరిక పాములను పట్టడం, ఆడడం, ధర్మారావుకే ఆశ్చర్యం.

17వ అధ్యాయం : రాఘవరావు సహాయ నిరాకరణోద్యమం, అరెస్టు, మంగమ్మ రాధాపతులు సుబ్బన్నపేటలోనే నివాసం, పంకజమ్మ ఇంటిలో వీరందరూ సమావేశం, ధర్మారావు ఉపన్యాసాలు, శ్యామలాకుమార స్వాముల వివాహవిషయం.

18 వ అధ్యాయం : ధర్మారావు కుటుంబ సమేతంగా పశుపతి ఊరు 'ఉండి'కి వెళ్ళడం, వారందరూ కలిసి పోవడం; బెజవాడ రావడం; అక్కడ సూర్యపతి ఇంటిలో గడపడం; కనకదుర్గ దర్శనం-తిరిగి సుబ్బన్న పేటకు రావడం.

19 వ అధ్యాయం : సారంగధర నాటకం కుమారస్వామితో పాటు ధర్మా రావు చూడడం. ధర్మారావు కల: పంకజమ్మ ఇంటిలో ధర్మారావుచే నాటక చర్చ.

20 వ అధ్యాయం : సోమన్న ఇల్లు అగ్నికి ఆహుతి కావడం; పురపాలక సంఘ సమావేశం, విద్యుద్దీపాలు, కొళాయిలు స్థాపించడం కోసం నిర్ణయాలుచేసు

కోవడం, రామచంద్రరాజు కబీరు మాట ఎవరూ వినలేదు; సంఘం వారు రెంటినీ సాధించారు. సుబ్బన్న పేటకు విద్యుద్దీపాలు, కొళాయిలు వచ్చాయి.

21 వ అధ్యాయం : గణాచారి మహిమ; రంగమ్మలో మార్పు: సుబ్బన్న పేటలో మార్పు; స్త్రీ సంఘం స్థాపించడం; అధ్యక్షురాలు రంగమ్మ; తద్వారా స్త్రీల వికాసం; స్త్రీ స్వాతంత్ర్యం, బాల్య వివాహాలు; విధవా వివాహాలు చర్చ.

22 వ అధ్యాయం : రంగారావు మరొక ఫ్రెంచి స్త్రీ 'బియాట్రిస్'ను వివాహమాడి భరణమిచ్చి పంపడం. సుసానీ డబ్బంతా 20 లక్షలు హరించి వెళ్ళు తుండగా దివాను సగం అపహరించడం; హరప్పతల్లి, నాయనమ్మల నగలు మాత్రం అడిగి గ్రహించడం, రంగారావు వ్యాధి ముదరటం; హరప్ప ధర్మారావు సాయంతో రాజశేఖర శాస్త్రిచేత మందిప్పించడం; హరప్ప జమీందారీనంతా చూచు కోవడం; కళాశాలను అమ్మివేసి అప్పు తీర్చడం; దివాన్ నాగేశ్వరరావు రాజీనామా ఇవ్వడం, ధర్మారావు దివాను కావడం.

23 వ అధ్యాయం : కుమారస్వామికి పుత్రోదయం, ఉద్యోగం ఒకేసారి అయ్యాయి; కుమారునికి ధర్మారావు పేరు పెట్టాడు; రాఘవరావు ధర్మారావును బెజవాడకు తీసుకొని పోవడం; రాఘవరావు భార్య మరణం; శవ వాహకులు దొరకక ఎవరో బండి నివ్వగా ధర్మారావే బండితోలడం, సూర్యపతి ధర్మారావులు శవాన్ని ఖననం చేయడం; రాఘవరావు మరల అరెస్టు కావడం.

24 వ అధ్యాయం : కుమార స్వామి ఉపన్యాసమూ, ఆవేశం, ఉద్యోగం ఊడిపోవడం; కుమార స్వామికి లౌక్య మవసరం అని ధర్మారావు బోధించడం; విగ్రహారాధనని గూర్చి మంగమ్మ ఉపన్యాసం; పైగా ధర్మారావు శిష్యురాల నంటుండి.

25వ అధ్యాయం : గార్డినర్ పసరికను పట్ట ప్రయత్నించి విఫలుడై, ఆ వెనుక తనఇంటిలో రహస్యంగా ఉండడం, ఆ విషయంతెలిసి ధర్మారావు హరప్ప నాయుళ్లు గార్డినర్‌ని కోటలోకిరప్పించి, పసరికను విడిపించడం, భారతదేశంలోని శిల్పకళాఖండాలు, బౌద్ధకళాఖండాలు ఇంగ్లాండుచేరిన వైనం, పూర్వం హిందూ దేశంలో గోవునకున్న పూజ్యభావం, ధర్మారావుద్వారా తెలియడం మొదలైన విశేషాలు.

26వ అధ్యాయం : అరుంధతి రోగగ్రస్థకావడం, రాజశేఖరశాస్త్రిని మందివ్వ నియమించడం, శాస్త్రి ధర్మారావుల స్వభావాలు, హరప్ప తల్లికి, నాయనమ్మలకు కర్మలుచేసి, దేవదాసి ధర్మారావులతో వేణుగోపాలస్వామి దర్శనంచేసుకొని హర్షాంబుధిలో మునిగిపోవడం. ఆరేండ్ల రామేశ్వరశాస్త్రి అల్లరిగా తిరుగుతూ కోటలో ప్రవేశించడం రంగారావుకి కలరావడం, ఆవెనుక భగవంతుడున్నాడని నమ్మడం.

27వ అధ్యాయం : వేణుగోపాలస్వామి కల్యాణోత్సవాల ఆరంభం, మిత్రులు, బంధువులు అందరూ విచ్చేసి ధర్మారావు ఇల్లంతా సందడి, ఆనందం, ఉత్సాహం, కానీ అరుంధతి అనారోగ్యం అధికంకావటం, చిన్న అరుంధతితో అవ్యాజానురాగం, ఉత్సవాల సందర్భంలో కూచిపూడి నాటకాలు, తోలుబొమ్మ లాటలు, పగటివేషాలు, గారడీలు, పొట్టేళ్ళఆటలు, బందరులోని జంగం బసవయ్యని గూర్చిన విషయం, వారాంగనా నృత్యాలు మొదలైనవి.

28వ అధ్యాయం : రత్నగిరి మేళానికి తగిన ఏర్పాట్లుచేయించడం, కల్యాణోత్సవానికి తగినఏర్పాట్లు చేయించడం; మంగమ్మ ఇంట భక్తితోఉండడం, రంగారావువద్దకు రామేశ్వరశాస్త్రి వెళ్ళి మాటలాడడం.

29వ అధ్యాయం : వేణుగోపాలస్వామి ఉత్సవాలు, బంధుమిత్రులతో ధర్మారావు ఇల్లు కిటకిటలాడిపోయినది. దేవదాసి భక్తి: హరప్పా ధర్మారావుల వ్యక్తిత్వాలు, తక్కిన మిత్రులందరి వ్యక్తిత్వాలు, అరుంధతీ ధర్మారావుల మనస్తత్వాలు చిన్న అరుంధతి ధర్మారావుకు దగ్గరకావడం, అరుంధతి వ్యాధి ముదరడం, భోగప్ప శాస్త్రి గాయత్రిపఠనం, మంగమ్మా కుమారస్వాముల భక్తితత్వం, లక్ష్మణస్వామి పట్టపేనుగు కథ, ఉత్సవాల సమయంలో గిరిక వేణుగోపాలునిపై దృష్టినిలిపి అభినయించి అభినయించి స్వామిలో ఐక్యంచెందడం; ఇందులో ధర్మారావు అభినయ చాతుర్యం, గిరికాభినయం.

30వ అధ్యాయం : చాలకాలం తరువాత గోపన్న సుబ్బన్నపేటకు రావడం, మరణించడం, మురారి ప్రేతాల్నిపిలవడం, కుమారస్వామి ఆ అభిప్రాయాన్ని ఖండించడం, అరుంధతి అనారోగ్యం ముదిరింది. రామేశ్వరశాస్త్రి తల్లివద్దనే ఉండడం ఆరంభించాడు. ధర్మారావు అనుమానించాడు అరుంధతిని; కుమారస్వామి పత్రికాఫీసులో ఉద్యోగం; అక్కడ సంపాదకుడైన వామనరావు కుహనా సంస్కారాన్ని మోసాన్ని క్షమించలేక రాజీనామా ఇవ్వడం జరిగింది.

31వ అధ్యాయం : మంగమ్మ వీలునామా వ్రాయడం, రంగావధాని ఉత్తరం వల్ల రాధాపతి మరణవార్త మంగమ్మ కుమారస్వాములకు తెలియడం; చెంగల్రాయుని దౌష్ట్యం, మంగమ్మను హత్యచేసి కారాగారం చేరడం.

32వ అధ్యాయం : మంగమ్మ మరణం మంచిదన్నారు అందరు; అరుంధతి వ్యాధిముదిరి పౌర్ణమినాడు మరణించింది. ధర్మారావు దుఃఖం, బంధువులందరూ కలుసుకోవడం;

33వ అధ్యాయం : రంగారావు ఆరోగ్యవంతుడయ్యాడు. హరప్పా ధర్మారావులకు, రంగారావు రామేశ్వరశాస్త్రులకు సన్నిహితత్వం, మాఘస్నానాలు హరప్పా ధర్మారావులు ఆరంభించారు. హరప్ప యోగమరణం చెందాడు. గణాచారికి కల వచ్చింది.

34వ అధ్యాయం : పసరికను వెదకి ధర్మారావు కుమారస్వాములు తెస్తారు మంగకి అప్పగిస్తారు. చంద్రారెడ్డి కుమారుడు గోపాలకృష్ణారెడ్డి ఆగడాలు; పసరికతో స్నేహం; ఆ స్నేహంమూలంగా ఎంతోమార్పు; పాశ్చాత్య వ్యామోహం; పాము కుండవలసిన సహజత్వం కోల్పోతాడు.

35వ అధ్యాయం : గణాచారి జుత్తు, జడలుకట్టడం. పాక తగలబడడం; నిద్దురలోనే మరణించడం, శాస్త్రి తెలివిగలవాడుగా నిరూపించుకోవడం; గుండేరు మరల ముంచెత్తడం

36 వ అధ్యాయం : ధర్మారావు పశుపతి ఊరు వెళ్ళడం; పురుషుడు భార్య మరణానంతరం వివాహం చేసుకోవడం; బాల్య వివాహాలకు పశుపతి వ్యతిరేకి; ఈ విషయం ధర్మారావు పశుపతుల సంభాషణ మూలంగా తెలుస్తుంది. చిన్న అరుంధతి ధర్మారావునే వివాహ మాడుతానని పట్టుపడుతుంది. వివాహమాడ నంటాడు ధర్మారావు. కుమారస్వామి చిన్న హరప్పకు గురువయ్యాడు. రామేశ్వర శాస్త్రికి విద్య నేర్పుతున్నాడు. వీరిద్దరిని తీసుకొని తెలంగాణంలోని చిన్న హరప్ప వాళ్ళ ఊరు వెళ్లుతాడు. దారిలో అరణ్యాలు; పులుల వేట మొదలైనవి, దీపావళి, టపాకాయల మూలంగా రామేశ్వరశాస్త్రి ఒళ్లు కాలి మళ్ళీ నయమవుతుంది. ధర్మారావు జబ్బుగా ఉన్న చిన్న అరుంధతిని చూడబోవడం; బాల్య వివాహాలగూర్చిన చర్చ. ధర్మారావు పశుపతుల మధ్య, అరుంధతి ధర్మారావు లేకంకావడం. ధర్మారావుకి ధర్మపత్ని అరుంధతియే, చిన్న అరుంధతిగా కనిపించింది; ఔనని తెలిపింది.

37 వ అధ్యాయం ; చిన్న అరుంధతీ ధర్మారావుల వివాహానంతర కార్యం; ధర్మారావు 'అహా' ఇంక నేమి మిగిలినది ? ఇంకనేమి మిగిలినది ? ఇంకనేమి మిగిలినది ?

"చిన్న యరుంధతి ద్వారమువద్ద నిలుచుండెను. ధర్మారావు చూచెను. ఆ నిలుచుండుట కూడ తన వంకకు నడచుచున్నట్లే యుండెను. ధర్మారాయని హృదయములో సముద్ర మథనవేళ క్షీర సాగర గర్భ గత తరంగములనుండి చంద్రుడావిర్భవించినట్లు ఒక మహానందరేఖ పొడసూపెను.

".... అరుంధతి యతని కన్నులలో గన్నులుంచి 'నేను మిగిలితిని' అనెను.

"ధర్మారావు; అప్పను నీవు మిగిలితివి. ఇది నా జాతి శక్తి. నా యదృష్టము. నీవు మిగిలితివి"[13]

ఆశావహంగా ఇలా ముగిస్తుంది వేయిపడగలతో పరివ్యాప్తమైన విశ్వనాథ వారి 'వేయి పడగలు' నవల.

విశ్వనాథవారి విశిష్టత అంటే తప్పులేదు. అంతమాత్రం చేత అంతా ఆమోద యోగ్యమే అని చెప్పడమూ కుదరక పోవచ్చు. కానీ ఇంత మహత్తరమైన నవల సృష్టి చేయడంలో మహా మేధావిత్వం, ప్రతిభా వ్యుత్పన్నతలు స్పష్టపడతాయి.

3.3 ఇతివృత్తం ప్రముఖ స్థానాన్ని వహిస్తుందన్న విషయం ద్వితీయ ప్రకరణలో మనం గుర్తించాము. ఇంతేకాదు. ప్రాక్పశ్చిమ విపశ్చిద్వరులు సైతం ఈ విషయం నొక్కి చెప్పిన విషయం ఇక్కడ ప్రస్తావించడం అప్రస్తుతంకాదు. 'ఇతివృత్తంతు కావ్యస్య శరీరం పరికల్పితమ్"[14] అని భరతమహర్షి, "The plot, then, is the first principle, as it were the soul of tragedy character holds the second place"[15] అని అరిస్టాటిల్ పండితుడు poetics లోనూ ప్రవచించిఉండడం గమనించతగ్గ అంశాలు.

ఇతివృత్తం మహోన్నతం,దాన్ని వేయిపుటలకు మించి నిర్వహించడమన్నది రచయిత ప్రజ్ఞాప్రాభవాలకు నిదర్శనం. "వేయిపడగలు కాల్పనికోద్యమ కాలంలో

వెలువడిన ఆత్మాశ్రయ కవిత్వ (Subjective poetry) శాఖలో ఒక అపురూప మైన కావ్యం దానిపై శిష్ట్యం అది వేయిపుటల నవలగా రూపొందటమే. తెలుగు దేశంలో శిథిలమై అదృశ్యమౌతున్న పూర్వనాగరికత చివరి వెలుగుల్ని చూచిన విశ్వనాథ హృదయం సంక్షోభించి వెలువడిన సుదీర్ఘ నిశ్వాసమే "వేయి పడగలు."[16] అని వివరించిన శ్రీ ఆర్ ఎస్. సుదర్శనంగారి మాటలు ప్రత్యక్షరసత్యం. కారణ మేమంటే 'వేయిపడగలు'కు కేంద్రబిందువు ధర్మారావు ధర్మారావు ఆత్మకథ వేయిపడగలు విశ్వనాథ సత్యనారాయణగారే ధర్మారావు. అంటే ధర్మారావుపేర విశ్వనాథవారు ఆత్మకథను వివరించారు. ఇది సుదర్శనంగారి మాటలకు వ్యాఖ్యానం దీనికి తగినట్లే నవల అంతటా మనం చూడగలం. అరుంధతి, చిన్న అరుంధతి రెండు వివాహాలు—విశ్వనాథవారి సతీమణులు వరలక్ష్మి, తరువాత వివాహమాడిన ఆవిడపేరేమిటోగాని, వరలక్ష్మియే. వారు తమ తండ్రితోపాటు పొలాలువెంబడి వెళ్ళిచూచిన సర్వవిషయాలు తిరిగిన అరణ్యాలు, వేటలు మొదలైనవన్నీ వర్ణిం చారు. పొలాల్లోని పాములు, తేళ్ళు, ఎండ్రకాయలు, వాటిజీవిత విశేషాలు అన్నీ ఇందులో వర్ణించాడు. అదేరీతిని కిన్నెరసాని పాటలు, తెలుగు ఋతువులు, మొద లైన వాటిలోను చూడగలం. వారికి ఆముక్తమాల్యదపై, రాయలపై గల అభినివే శమూ, ఆసక్తి వారివర్ణనలో స్పష్టమవుతుంది. తమ సనాతన ధర్మమార్గం పురా వైభవ పునరుజ్జీవన ఆకాంక్ష అడుగడుగునా కనిపిస్తాయి. ధర్మారావు ఇంగ్లీషు చదివినా ఆ ఇంగ్లీషు మనకనుచితమనడం రచయితమాటలే! ఎందుకంటే విశ్వనాథ వారెంతగానో ఆంగ్లసాహిత్యాధ్యయనం చేసి సారం గ్రహించినవారు అయినా భారతీయతపై మక్కువ కలవారు.

రామేశ్వరశాస్త్రిగారు మహదౌదార్యవంతులై ఉన్నఆస్తిని నాస్తిచేసుకొన్నట్లే వీరితండ్రి శోభనాద్రిగారు సైతం చివరిదశలో ఔదార్యంవల్ల ఆస్తిని పోగొట్టు కొని పేదరికంతో బాధలనుభవించినవారే. ఇంత ఎందుకు? సుబ్బన్నపేట నిర్మాణం కాశీనుంచి శివలింగం తీసుకొనిరావడం, విశ్వనాథవారి పూర్వీకులు చేసినవే నవల లోకి ఎక్కాయి. మొదట విశ్వనాథవారు, విశ్వనాథపల్లె అనీ, ఆవెనుక ఆ వంశీ కుల్లో వెంకట నరుసుగారు కాశీనుంచి శివలింగంతెచ్చి శివాలయం నందమూరులో నెలకొల్పడం దానితోపాటు శ్రీ వేణుగోపాలస్వామిని వెలయించడం ఇవన్నీ విశ్వ నాథ వంశీకుల చరిత్రని అభివ్యక్తీకరించే అంశాలే. అలాగే మిత్రులలో రాఘవ

రావు ఒక సహాయ నిరాకరణోద్యమంలో చేరి దేశ స్వాతంత్ర్యం కోసం కారాగారాల్లో పడి క్రుగ్గి అశువు లర్పించిన మిత్రులే. కవి కిరీటీ శశిరేఖల ప్రణయం నాయని సుబ్బారావు 'సౌభద్రుని ప్రణయ యాత్రయే'. సరే అడవి బాపిరాజు, నండూరి సుబ్బారావు సొంత నామాలతోనే నవలలో సాక్షాత్కరించారు.

పసరిక పాత్ర తనకు తెలిసిన మిత్రుల ఇంట పాము జన్మించడాన్ని గ్రహించి సృజించినదే.

ఇంకా ఆనాటి అనేకానేకాంశాలు – జాతీయ కళాశాల – క్రైస్తవుల కాలేజీలు, కేషబ్జీ మతం, దివ్యజ్ఞాన సమాజం మొదలైనవన్నీ తనకు తెలిసినవి ఆ నాటి పరిస్థితుల నన్నింటిని నవలా రూపంలో ఏకరువు పెట్టడం గమనించవచ్చు. మరి నవల జీవిత వ్యాఖ్యానం గదా : సాహిత్యం సమాజ ప్రతిబింబం గదా : అలాగే మారుతున్న విలువలు, ఆర్థిక సామాజిక ధార్మికాది స్థితిగతులు అన్నీ చోటు చేసుకొన్నాయి అందు వల్లనే ఇది గొప్ప నవల అయింది. ఇతి వృత్తానికి తగినట్లు దాన్ని నిర్వహించడంలో మహా శిల్పి లక్షణాలు స్పష్టం ఈ విషయాన్ని తరువాతి ప్రకరణాలలో విశ్లేషించ ప్రయత్నిస్తాను. ఇతివృత్తంతోపాటు పాత్రోన్మీలన పాత్రోన్మీలనకు తోడు ఔత్సుక్య స్ఫోరకమైన రచనా శిల్పం, శైలి, భాష సమస్త విషయాలలో విశ్వనాథవారు అగ్రగణ్యు లనడానికి ఏవిధమైన సందేహమూ ఉండనక్కరలేదు. ఇది స్తవం కాదు వాస్తవమని తదితర ప్రకరణాల్లో స్పష్టమవుతుంది :

## సూచికలు

1. విశ్వనాథ సత్యనారాయణగారు; నేనూ – నా సాహిత్య రచనలు – మహతి–ప్రతిభ : పు – 21.

2. మొదలి నాగభూషణశర్మ; తెలుగు నవలా వికాసము–పుట – 296.

3. యండమూరి సత్యనారాయణ; నవల వాఙ్మయము
విజ్ఞాన సర్వస్వము – సం. 4. పు. 879, 880.

4. తాడికొండ వెంకట కృష్ణయ్య; ముదివేడు ప్రభాకరరావు;
బ్రాహ్మీమయ మూర్తి, పు. 153.

5. డా॥ బి. వి. కుటుంబరావు; ఆంధ్ర నవలా పరిణామము, పు 373
6. డా॥ జి. వి. కృష్ణారావు; కావ్య జగత్తు – పు – 76, 77
7. ఆర్. యస్. సుదర్శనం; నవ్యాంధ్ర సాహిత్యంలో దృక్పథాలు –2
వేయి పడగలు ; భారతి సెప్టెం. 1964
8. డా॥ తుమ్మపూడి కోటేశ్వరరావు; భూమిక – బ్రాహ్మీమయ మూర్తి
పు. XV, XVI
9. Oscor Wilde
10. పై 2 వ సూచిక లోనిదే పు. 294, 295
11. వేయి పడగలు – పు. 9.
12. పై దే. పు – 13
13. పై దే. పు – 1025, 1026.
14. The Natya Sasthra – Vol I 6.19 శ్లో 1.
[Ed. Manomohan Ghosh]
15. Aristotle's theory and Fine Art with a critical Text and translation of poetics – S. H. Butcher పు. 26, 27.
16. పై 7 వ సూచికలోనిదే.



# 4.0 వేయి పడగలు - పాత్రచిత్రణ

## 4.1 పాత్రచిత్రణ :

నవలలో ఇతివృత్త నిర్వహణంతోపాటు పాత్రచిత్రణ సైతం ప్రాముఖ్యం వహిస్తుంది. పైపెచ్చు నవలలో ఉండదగిన షడంగాలలో రెండవదైన పాత్ర చిత్రణా చాతుర్యం నవలకు అనివార్యమూ, అపరిహార్యమూ అయిన లక్షణమనీ, తద్వారా నవల ఔన్నత్యం స్పష్టమవుతుందనీ మనం రెండో ప్రకరణంలో తెలుసుకొన్నాము. నవలలోని పాత్రలు కేవలం కళావిహీనమై తేజోరహితమై, చైతన్యం లేని గడ్డిబొమ్మలు, బుట్టబొమ్మలూ కాదు. జీవకళ ఉట్టిపడుతూ రక్తమాంసలాలతో ఒప్పారుతూ మనలో ఒకరుగా ఉండే పాత్రలే. నిజజీవితానికి దగ్గరగాఉండి ఆనందాతిశయాన్ని కలిగిస్తాయి. ఆ నవలాలోకంలో అవి నడయాడుతున్న వ్యక్తులా అన్నట్లు మనకంటికి కనిపించవలసిన అవసరముంది. ఒకనవల చదవడం పూర్తిచేశాక కూడ ఇతివృత్తాన్ని గురించి పట్టించుకోకపోయినా ఆ పాత్రలు మన మనస్సులలో, హృదయాలలో చెరగని ముద్రవేయాలి. అంటే కన్నులముందు కదలాడుతున్నట్లు, హృదయఫలకంపై చెక్కినట్లు ఆ పాత్రలు నిలిచిపోవాలి. అప్పుడే ఒక నవలాకర్త పాత్రపోషణలో కృతకృత్యుడైనట్లు మనం భావించవచ్చు. ఈ విషయాన్నే ఎంతో సముచితరీతిని హడ్సన్ పండితుడు వివరించాడు. దాన్ని ఇక్కడ యధాతథంగా ఉల్లేఖించడం ఎంతైనా సమంజసం.

"Does the novelist succeed in making his men and women real to our imagination ?.... They lay hold of us by virtue of their substantial quality of life; we know and believe in them as thoroughly, we sympathise with them as deeply, we love and hate them as cordially as though they belonged to the world of flesh and blood. And the first thing that we require of any novelist in his handling of character is that, whether he keeps close to common experience or boldly experiments with the fantastic and the abnormal, his men

and women shall move through his pages like living beings and remain in our memory after his book is laid aside and its details perhaps forgotten."[1] ఇంతేకాదు నవలలోని పాత్రల్ని తాను నడిపించడం కాదు; ఆ పాత్రలే తన్ను నడిపిస్తాయని Thackeray మహాశయుని మాటల్ని సైతం హడ్సన్ పండితుడు ఉల్లేఖించాడు.

"Thus Thackeray spoke of his power as 'Occult' — as a power which seemed at times to take the pen from his fingers and move inspite of himself. 'I don't control my characters; he once protested, I am in their hands and they take me where they please........they spoke and acted on their own impulse, and so unexpected and surprising were occasionally the results........"[2] అంటే నవలలోని పాత్రలు ప్రతిభావంతుడైన రచయిత చేతిలో తీర్చిదిద్దబడతాయనడం కంటే తమకు తామే రచయిత లేఖినినుంచి తమ తమ భావాలకు ఆవేశాలకు సర్వత్ర నడచి వెళ్ళతాయనడం స్పష్టమవుతుంది.

ఇంతకు నవలలో ఇతివృత్తం వేరుగాను, పాత్రలు వేరుగాను మనం ఆలోచించినా వాటికి నవలలో అవినాభావ సంబంధముంది. అంటే ఇతివృత్తం లేక పాత్రలు లేవు; పాత్రల రహితమైన ఇతివృత్తమూ లేదు. కాకపోతే ఒకవిషయం మనం గమనించవచ్చు. కొన్ని నవలల్లో ఇతివృత్తం ప్రాధాన్యం వహించి పాత్రలు అప్రధానం కావచ్చు. కొన్నింటిలో పాత్రల ప్రాముఖ్యం హెచ్చి కథావస్తువు అప్రధానం కావచ్చు. ఏది ఏమైనా ఈ రెంటికీ మాత్రం విడదీయరాని బంధం ఉందన్న విషయం మనం గుర్తుంచుకోవాలి.

నవలాకారుడు నవలలోని స్త్రీ పురుష పాత్రలతో తానొకడై చరిస్తూ ఆ పాత్రలకు సంబంధించిన విషయాలను విమర్శించ వచ్చు. ఇలాగా పాత్ర చిత్రణ విషయంలో నాటక కర్త కంటె నవలా రచయితకు సౌలభ్యం ఎక్కువ. ఉత్తమ నవలలోని కథ పాత్ర చిత్రణ పైనే ఆధారపడి ఉంటుంది; నానావిధ సన్నివేశాలలో, వివిధ విధాలైన భావ సంకీర్ణతతో కూడిన ఆయా పాత్రలు పరస్పర ప్రభావితాలవుతూ, సంఘర్షితాలై సుస్పష్ట రేఖలతో సువ్యక్తం కావలసిఉంది. తన్మూలంగా

కథా నిర్మాణంలోని సన్నివేశాలతో ఆయా పాత్రల శీలస్వభావాలు, అభిప్రాయాలు, మనోభావాలు, ఇతివృత్త క్రమ వికాసంలో అభివ్యక్తమవుతాయి.

నవలలోని పాత్ర చిత్రణ ముఖ్యంగా ఆయా పాత్రల మనః ప్రవృత్తుల స్పష్టీకరణకు నవలా నిర్మాణం రెండు విధాలు; మొదటిది ప్రత్యక్షమూ లేదా విశ్లేషణాత్మకం; రెండవది పరోక్షమూ లేదా నాటకీయమూ నని. మొదటి పద్ధతిలో నవలా రచయిత ఆయా పాత్రల ఆకాంక్షల్ని, లక్ష్యాల్ని, ఆలోచనల్ని, భావాల్ని సూక్ష్మరీతిని స్పష్టీకరించి వివరిస్తాడు మంచి చెడులను గూర్చి చర్చిస్తాడు చివరికి న్యాయాధి కారిలా అధికారికంగా తీర్పు నిస్తాడు. రెండో పద్ధతిలో పాత్రలకు నవలా కారుడు దూరంగా - నాటకంలో లాగా - ఉంటాడు. ఆయా పాత్రలే సంద ర్భోచితంగా తమ చేతలవల్ల మాటలవల్ల శీలస్వభావాల్ని స్పష్టంచేసేట్టు నిర్వ హిస్తాడు. కథలలోని ఇతరపాత్రల నిర్ణయంవల్ల, తీర్పులవల్ల ఆయా పాత్రల మనః ప్రవృత్తులు స్పష్టమయ్యేలా చేస్తాడు కాబట్టి నవలా నిర్మాణంలోని పాత్రల చిత్రణలో ఈ రెండురీతులూ ఉండడానికి వీలుంది. వీటన్నిటినీమించి లోక వృత్త పరిశీలనా దక్షత, అవగాహన, పాత్రల మనోవృత్తులను స్పష్టంగా గ్రహించి, వాటిని వివరించడానికి తగిన ప్రతిభా సముత్పన్నతలు నవలారచయితకు అవసరం. "But a broad and intimate knowledge of human nature at large, a keen insight into the workings of its common motives and passions, creative power and dramatic sympathy will together often suffice to give substantial reality and unmistakable touch of truth to characters for which scarcely a single suggestion can have been taken directly from life"[3].

4.2 వేయి పడగలు - పాత్రచిత్రణ :

పై గుణాలన్నీ విశ్వనాథవారి నవలా నిర్మాణంతోపాటు పాత్రల వైఖరు లలో స్పష్టమవుతాయి. 'వేయిపడగలు' నవలలో ఎలా విశ్వనాథవారు పాత్రపోషణ చేశారో పరిశీలిద్దాం. ఈ నవల బహుపాత్రకమూ. వివిధభావ సంకీర్ణమూ, సంక్లి ష్టమూ నన్నవిషయం సర్వజన విదితమే :

వీరు పాత్ర పోషణ చేయడంలో 'వేయి పడగలు' నవలలో మనకు కని పించే తీరులు : పాత్రలు కథా గమనంలో తమ చేతలవల్ల వాటి శీల స్వభావాలు

స్పష్టం కావడం; ప్రముఖాది పాత్రలు ఇతర పాత్రలతో సంభాషణ కొనసాగిస్తున్న సందర్భంలో ఆయా పాత్రల మనః ప్రవృత్తులు అభివ్యక్తం కావడం; ఏదేని కార్య వశాత్తు కొన్ని పాత్రలు మాటాడుకున్నపుడు తదితర పాత్రల గుణగణాలు అవగతం కావడం; ఆయా పాత్రల స్వగతాల మూలంగా ఆయా పాత్రల తత్వాలు గోచరించడం ముఖ్యమైనవి. ఇంతేగాక ఉత్తమ నవలా కారుడు సమానాంతరత్వం (Parallelism) మూలంగాను, ప్రతియోగం (Contrast) వల్ల సైతం ఈ పాత్ర చిత్రణ ప్రతిభాభి యోగ్యంగా చేయగలడు,

ఈ పై లక్షణాలన్నీ విశ్వనాథవారు 'వేయి పడగలు' నవలలో స్వీకరించి ఉండడం గమనించగలం. సమానాంతరత్వ ప్రతియోగాల మూలంగా ఎలా పాత్ర చిత్రణ చేయడం సాధ్యమైందో తన్మూలంగా ఆయా వ్యక్తిత్వాలు ఎలా సుస్పష్ట రేఖలతో జీవకళ ఉట్టిపడే పాత్రలుగా నిరూపితా లయ్యాయో పరిశీలించే ముందు తదితర లక్షణాలను ఏ విధంగా విశ్వనాథవారు ఉపయోగించుకొన్నారో పరిశీలించడం అవసరం. వీటన్నిటినీ కలిపే ఆయా పాత్రల పోషణలో విశ్వనాథవారు చేసిన ప్రయత్నం మనం గమనించ గలం.

## 4.3 ధర్మారావు పాత్రచిత్రణ :

విశ్వనాథవారి 'వేయిపడగలు' నవలలో సేవకుడు మొదలుకొని మహారాజు వరకు, నిరుపేద మొదలు సంపన్నులవరకు, చెలికత్తె మొదలు మహారాణివరకు, పామరుడు మొదలు పండితునివరకు, నాస్తికుడు మొదలు ఆస్తికునివరకు దొంగలు మొదలు దొరలవరకు గల సమస్తవ్యక్తుల గుణశీల స్వభావాల్ని సూక్ష్మాతిసూక్ష్మ రేఖలతో సుస్పష్టంచేయడం గమనించగలం. ఇంతేగాక పాములు, తేళ్లు, ఎండ్ర కాయలు మొదలైన క్రిమికీటకాదులు, ఏనుగులు, పులులు, ఆవులు, గేదెలు మొదలైన ప్రాణులను గురించికూడా విశ్వనాథవారు వివరించారు. వాస్తవానికి 'వేయి పడగలు' ఒక ప్రత్యేకజగత్తు. అది ఊహాలోకమేమీ కాదు. సమకాలిక సాంఘిక జీవితమే.

విశ్వనాథవారి పాత్రలను కొన్నికొన్ని రీతులుగా వర్గీకరించవచ్చు. ఉత్తమ పాత్రలు, నీచపాత్రలు, రాజులు, సామాన్యులు, ధనవంతులు, పేదలు. ఉత్తమ పాత్రలైనా కాలానుగుణంగా నీచపాత్రలై ఆ వెనుక గుర్తించి ఆత్మవికాసం

పొందిన పాత్రలు, ఉత్తమపాత్రలుగా కనిపించినా అంతర్నిహితంగా దుష్టపాత్రలుగా నిరూపించుకొన్నవారు. పాత్రలు నీచపాత్రలైనా గుణౌన్నత్యం కలిగినవారు, ఉత్తములైనా నీచభావ గర్భితులై తదుచితంగా ఘోరనరకం అనుభవించినవారు. ఎటూగాకుండా తటస్థంగా ఉండిపోయినవారు. స్వభావతః పరోపకార పారీణులైనవారు, అన్నీ ఉన్నా ఇతరులకు ఏమీచేయడం ఇష్టంలేని పాత్రలు వీటన్నిటినీ మించి స్త్రీ పాత్రలు, పురుషపాత్రలు, ప్రధాన పాత్రలు, అప్రధాన పాత్రలు, అప్రధానపాత్రల్లో కథలో అంతో ఇంతో ప్రాధాన్యం కలిగినవారు; ఏదో సందర్భోచితంగా తెరమరుగైన పాత్రలు. మానవాతీత శక్తులు (Supernatural elements) గా పాములను, గణాచారిని ఇందులో ప్రవేశపెట్టడం ఈ మొదలైనవన్నీ ఇందులో మనం చూడగలం.

సుబ్బన్నపేట 'వేయి పడగలు' నవలకు కేంద్రస్థానం ధర్మారావు ఈ నవలకంతటికీ కేంద్రబిందువు. ఈ పాత్రననుసరించే సమస్తకథా, పాత్రలు అల్లుకొని వినిర్మితమై ఉన్నాయి. ఈ ధర్మారావుపాత్ర ప్రాముఖ్యాన్ని వేయిపడగలలో విస్తరించిన దాన్ని వివరించేముందు ఇతివృత్తం అన్న మూడో ప్రకరణంలో చెప్పుకొన్న మాటలు ఇక్కడ పునశ్చరణచేయడం దోషంకాదు, అవసరం.

"వీరన్న నాయని వంశం వారు స్వామికి ప్రతినిధులు. బ్రాహ్మణ వంశం వారు ప్రచారకులు. కాపు వంశపుటాడ పడుచులు స్వామి వ్యాఖ్యాతలు. ఈ రీతిగ ధామావ్యకాశాల మధ్య, స్వర్గ మర్త్య లోకముల మధ్య, ప్రత్యక్షాప్రత్యక్షముల మధ్య నొక స్థిరమైన సంబంధ మేర్పడెను.

"పైని భగవంతుడు, క్రింద రాజును, బ్రాహ్మణుడును. ఈ రెండు మహా సంస్థలకు మధ్య గణాచారి త్రెంచరాని లంకె.

"ఇది నాల్గు స్తంభముల ధర్మ మంటపము. స్వామి, జమీందారు, బ్రాహ్మణుడు, గణాచారి – వీరు నల్గురు స్తంభములు"[4]. ఇందులోని బ్రాహ్మణులలో ధర్మారావు ప్రధాన పాత్ర.

"వేయి పడగల" యందు జరిగిన వ్యవసాయ మంతయును నమవ్యాహారణము; సనాతన సంప్రదాయములలోని యంతరార్థ పరామర్శము. తదనుధ్యానము చేయుటవలన మనసు కలుగు నమవ్యవసాయ మపూర్వమైనది. ఈ కృషియందు

రచయిత్రు ప్రతిభావ్యుత్పత్తులమేయములు. సూత్రయప్రాయముగ నున్నయాచార నిష్ఠమైన వ్యవహారములు క్రిందద్యతన తార్కికదృష్టితో వివరణ చేయబడెను".

"వేయి పడగలయందు ప్రధానపాత్రయు, నాయకుఁడును ధర్మారావు. ఈయన రామేశ్వరశాస్త్రిగారి పుణ్యముల పంట; సావిత్రమ్మ నోముల ఫలము; అరుంధతిపాలిటి వసిష్ఠమహర్షి; హరప్పకు బృహస్పతి; గిరికాదేవి స్వర్గమునకు నిచ్చెన; ఊహాజగత్తుల లక్షాధికారుల బిడ్డడు; భగవంతునకు బావమఱది; మహా మేధావి; స్థిరభాషి; గుణగరిష్ఠుడు; ఇంగితావగాహి; గుణదోషాభిజ్ఞుడు; శృంగార లీలావిదుడు; నయకోవిదుడు; ధీమడు.

"ఇతడు రెండు లోకములవాడు; ఒక లోకములో మూకీభావము; వేఱొక లోకములో నియత వాగ్వ్యాపారము; ఒక జగత్తుదివ్యము; మఱియొకటి భౌమము; ఒకటి పునీతము; ఇంకొకటి ఇంద్రియాభిభూతము; సెలవులు వచ్చినచో గణాచారి, దేవదాసి, పసరిక, యరుంధతివంటి వారితో నీతనిజగత్తు; అవిరానిచోఁ గిరీటి, శివరావు, కిశాశాల, మున్నైనవానితో సాగిపోవు నీతని పని

"శ్రీ సత్యనారాయణగారి వలెనే కాలమున కెదురీదు దిట్ట ధర్మారావు; ప్రతి విషయమునను ప్రతిఘటనమే; ప్రతిపతరణమే; హూణ భాషాపండితుడయ్యు సనాతన ధర్మబద్ధబుద్ధి; అద్యతన నాగరికతార్థము నాకళించుకొని నశించిపోవుచున్న మన సనాతన పద్ధతులకై ప్రాకులాడినవాడు. నదీ మాతృకములు, విద్యుద్దీపములు, మరబియ్యము, చలనచిత్రముల వంటివెన్నియో యీతని నిశితపరిశీలనమునకు గురియైనవి.

"ధర్మారావే కథకు సూత్రధారుడు. ఈతని నీడపారని యంశముగాని, భావ ముద్రపడని పాత్రగాని నవలలో లేదు సూర్యపతికితడొక శంఖము. కిరీటి కిత డొక సారథి, సచివుడు, సర్వమును; రాఘవరావునకుఁ గవిత్వ విషయములలోఁ గవితా పితామహుడు; హరప్ప, కృష్ణమనాయని గారల కైహికాముష్మికములయందు ప్రదష్ట; మార్గదర్శియు; గోపన్న కిలవేలుపు; పోఁగా స్త్రీలవిషయమున రుక్మిణి మ్మారావు గారికిఁ ప్రత్యక్షముగను, సరోజినీదేవికి పరోక్షముగను జ్ఞానదాత; రంగారమ్మగారికి పెద్దబిడ్డడు; అరుంధతీ రథంతరీ ప్రభృతులకు వేదరాశి; కళా తపస్విని గిరిక విషయములో వేఱుగ చెప్పవలసినదే లేదు; ఆమె కళాతపః పరి

భాగ్యవతి యీమె. తుదకు తనకు తెలియకయే శిష్య సంతతిలోనుండి నిష్కృతి నొందఁ మంగమ్మయు ప్రయత్నించినది. ఈమె ధర్మారావునకుఁ బ్రశిష్యురాలు".[5]

ఇంత చెప్పినా ధర్మారావు గురించి చెప్పవలసిందే ఎక్కువగా ఉంది. ధర్మారావు గురించి పూర్తిగా చెప్పనుంటే 'వేయి పడగలు' నవల నంతటినీ తిరిగి రాయడమే అవుతుంది అయితే స్థూలంగా నైన మరికొన్ని ధర్మారావు గుణగణాల్ని వివరించినప్పుడే ఆ పాత్రకు న్యాయం చేకూర్చి నట్లవుతుంది

'వేయి పడగలు' నవలలో రెండో అధ్యాయం ఆరంభంలో ప్రప్రథమంగా ధర్మారావు మనకు కనిపిస్తాడు.

"ఆ వచ్చుచున్న మహాపురుషుడు దబ్బ పండువంటి దేహచ్ఛాయవాడు. కోలయు గుండ్రము కాని ముఖము. ఆజాను బాహువులు. నల్లని కనులు, విశాలమైన ఫాల భాగము, వయసిరువది యేండ్లుండును. అతని పేరు ధర్మారావు.

"ధర్మారావు రామేశ్వర శాస్త్రి కుమారుడు. రామేశ్వర శాస్త్రి నాగేశ్వరశాస్త్రి కైదవ తరము వాడు"[6]

ధర్మమే ధర్మారావు. సనాతనధర్మ నిర్వహణ పరినిష్ఠితుడు. తండ్రి రామేశ్వర శాస్త్రికి తగిన పుత్రుడు. తండ్రి కొంత కర్మిష్ఠి. అందుచేత తాను సైతం ధర్మాచరణంలో లోటు రానీయని వాడు. అయినా మానవతా వాది. రామేశ్వర శాస్త్రిలాగా చాతుర్వర్ణ్యం పాటించి వివాహాలు చేసుకోవడం గాని, భోగాంగనా రక్తుడుగాని కాడు. ఇతనిలో ఉత్తమ గుణాలన్నీ నిండి నిబిడీకృతమై ఉన్నాయి. ఈ విషయాన్ని డా॥ బి. వి. కుటుంబరావుగారి మాటల్లో మనం గ్రహించాము. ఇంతే గాకుండా స్ఫురద్రూపి మాత్రమే గాక, తెలివి తేటలుగల వ్యక్తిగా కృష్ణమ నాయుడు గ్రహించి ధర్మారావును పై చదువులకు పంపడం, ఆయన మరణంతో ఇతని చదువు అర్ధాంతరంగా ఆగిపోవడం, ఆ వెనుక పెద్దరాణి రుక్మిణమ్మారావుగారు ఈ విషయం గ్రహించి ఆగి పోయిన ధర్మారావును మరలా చదివించడం. రాజు, రాణి, ఇతడు 'పద్మ నయనమ్ములవాడు' మొదలైన భాగవత పద్యాలు చదువుతూంటే ఎంతో తన్మయత్వం చెంది భక్తి తత్పరులు కావడం, ధర్మారావులోని విశేషం. తరువాత రంగారావు తత్వాన్ని వదలి పెద్ద రాణి లాగానే

సరోజినీదేవిగారు సైతం భక్తి తత్పరురాలు కావడం ఏకైక పుత్రుడు హరప్పకు ధర్మారావును గురువుగా నియమించడం గమనించ దగ్గవి. తండ్రి మరణంతో కష్టాలు రావడం, పేదరికం అంటే ఏమిటో తెలియని ధర్మారావుకు తెలిసి వచ్చాయి కృష్ణమ నాయని దాతృత్వం వల్ల తండ్రి కర్మలు మాసికాలు పూర్తిచేయడం గమనించ గలం. ఈ విషయంలో నౌకరు గోపన్న సాయం ప్రశంసించ తగ్గది. కృష్ణమ నాయుడు గోపన్న మాటల మూలంగా ధర్మారావుకు సాయం చేసి నాయుడు తన గొప్పదనాన్ని నిరూపించుకొన్నాడు. గోపన్న నాయుడుతో ధర్మారావునుగూర్చి చెప్పిన మాటలు "అందమేమిటి బాబుగారు! ఆయన మొగము చూచినచో నిత్యం మల్లెలు వెకసించినట్లుండును. నాకు మాత్రము సుబ్రహ్మణ్యేశ్వరస్వామి యీయనగా నవతరించెననిపించును ఆ బక్క పలుచని మనిసి, నిగనిగలాడు శరీరము, కోమలమైన కన్నులు, తెలివి కొట్టవచ్చినట్లుండు మొగము నందమునగా నాయనదే యందము ఏమైన నేమి? సముద్రాలెండిపోయి చెలమలయినట్లు నేటికిం బరిస్థితి ఇట్లు వచ్చినది ఒకరికి పెట్టిన వారే కాని లేదన్న వారే కాదు." 7 అలాగా ధర్మారావు పాత్ర క్రమ వికాసం చెందటం గమనించ వచ్చు.

పేదరికమంటే ఏమిటో తండ్రి మరణానంతరమూ, రాణి రుక్మిణమ్మారావు మరణానంతరమూ ధర్మారావు అనుభవించాడు. దారిద్ర్య దేవతా ఘోరదంష్ట్రిలలో ఎలా నలిగిందీ విశ్వనాథవారు విస్పష్టీకరించారు.

ధర్మారావు సంప్రదాయవాది. విజయవాడలో మిత్రులతోపాటు నాటకం చూస్తున్న సందర్భంలోని అతనిమాటలు—"ఇప్పటి నాడు నాటకములు మన సంప్రదాయముతోం గూడినవికదా! మన నాటకములాయెను. సరస్వతీ దేవిదో, లక్ష్మి దేవిదో వేయరాదా! కట్టించిన వారికీ వ్యామోహమెందుకు! గ్రీసుదేశపు విద్యాధి దేవతలు మన నాటకములను, చిత్రపటములను పాలింపవలయును గాబోలు! ఇంకనట్లే జరుగునులే!"8

ఇలాగే ఆయన ఆంగ్లవిద్య నభ్యసిస్తూన్నప్పటికి పాశ్చాత్య పద్ధతులకు విముఖుడు ఇది అతని జీవితంలో ఎన్నోసార్లు తటస్థించిన విషయం.

అరుంధతి ధర్మారావుల కార్యం రంగాజమ్మ ఔదార్యంవల్ల జరిగింది పుట్టిని అప్పు ఆమె మూలంగానే లభించింది తన్మూలంగా కార్యం జరిగింది. కానీ కార్యం సందర్భంలో ఒంటుపుచున్న కొన్ని గొడవలు. పైగా అరుంధతి వసి

హృదయంపై తల్లిదండ్రుల మాటల ముద్రలుండిపోయాయి. కార్యం తంతు సరిగా జరగలేదు రాజ్యలక్ష్మమ్మ చమత్కారంవల్ల అరుంధతీ ధర్మారావులు ఏకమయ్యారు. రంగాపురం నుంచి సుబ్బన్నపేటకు వచ్చాక వారి దాంపత్యజీవితం సుఖంగా, హాయిగా గడచింది. ఇంతలో ధర్మారావు రుక్మిణమ్మారావు వితరణవల్ల మరల చదవడానికి గుంటూరువెళ్ళడం జరిగింది. వేసవి సెలవులు వచ్చాయి. సుబ్బన్నపేట పోయి, అక్కడనుంచి రంగాపురంవెళ్ళి ధర్మారావు అరుంధతితో పొద్దుగూకువేళ తన యింటికి వచ్చేశాడు. అరుంధతి తల్లి నాగమ్మ చూస్తూ ఉండిపోయిందిగాని వారిని ఆపలేకపోయింది. వస్తూ దారిలో వారేకమయ్యారు. వారిలోని పొరపొచ్చములు పోయి హాయిగా దాంపత్యజీవితం గడచింది. అరుంధతి రామేశ్వరశాస్త్రికి తల్లి అయింది. చివరికి రోగగ్రస్తఅయి మరణించింది. ఆ వెనుక ధర్మారావు చిన్న అరుంధతిని అనసూయా పశుపతుల పుత్రికను వివాహమాడడంలో నవల ముగుస్తుంది.

మిత్రుడుగా ధర్మారావు వ్యక్తిత్వమే వేరు. సూర్యపతి, కిరీటి, రాఘవరావులతో కలిసి బందరులో చదవడం, గుంటూరులో రాఘవరావుతో కలిసి చదవడం, ఆయా సమయాల్లో వాళ్ళమైత్రి ప్రశంసనీయం. వారి కలుపుగోలుతనం చెప్ప నక్కరలేదు. వారుచేసిన అల్లరికి అంతులేదు. అలాగే రాఘవరావు సహాయ నిరాకరణోద్యమంలో చేరి విడుదలై బెజవాడలో కాపురం పెట్టినప్పుడు భార్య ప్రాణాల మీదికిరాగా ధర్మారావు సాయం కోరాడు. కలరావల్ల మరణించింది అతని భార్య. శవవాహకులు లభించలేదు బండిమాత్రం ఎలాగో సంపాదించి బండి ధర్మారావే తోలాడు సూర్యపతి సాయంతో. అక్కడ ఖననం చేయడంలో ధర్మారావే ఎంతో సహాకరించాడు. ఇదంతాచూస్తే అతని మైత్రి ఎంతగొప్పదో స్పష్టమవుతుంది.

భ్రాతగా ధర్మారావు వ్యక్తిత్వాన్ని నిలబెట్టుకొన్నాడు. రామచంద్రరాజుతో వ్యవహరించడంలోగాని, గిరికను భక్తురాలుగా ఉన్ముఖను చేయడంలోగాని, పసరిక పై ప్రత్యేకానురాగం, అనిర్వచనీయానురాగం, మమత మమకారం చెప్పనలవికాదు అలాగే రామచంద్రరాజుకు తమ్మునిపై నెంతో ప్రేమ. గిరికకు అన్న ధర్మారావంటే సాక్షాత్తు భగవంతుడే. వేణుగోపాల సాన్నిధ్యానికి చేర్చె గురువు; భ్రాతృప్రేమను ప్రసరించిన మహాయోగివంటివాడు. పసరిక తల్లితోతప్ప ఎవరితోను సరిగా మాటాడదు, చెట్టుపొలాల్లో నివసిస్తుంది. అయితే అన్న ధర్మారావంటే ప్రత్యేకాభిమానం.

ధర్మారావు పసరికపై ప్రత్యేకమైన ప్రేమతో మెలగుతాడు. ఆతనికెలాంటి ఆపద రాకుండా తల్లి మంగకు సహకరిస్తాడు. ఒకసారి పసరిక కనిపించకపోగా మంగ బెంగపెట్టుకొంటే రాత్రిసమయంలో కుమారస్వామి సాయంతో చేలల్లో, ముళ్ళ కంచెల్లో, పుట్టల్లో, పుట్టలలోని పాములమధ్య వర్షంకురుస్తూ ఉండగా పసరికను వెదకితెచ్చి మంగకు అప్పగించాడు. అలాగే ఒకసారి పసరికను వింతజంతువుగా భావించిన గార్డినర్‌దొర వేటాడి చంప యత్నించి విఫలుడై చివరికి తనగదిలో బంధించాడు. ఈ విషయం ధర్మారావు హరప్పకు తెలిపి, హరప్ప సాయంతో పసరికను విముక్తునిగావించి తల్లికి అప్పగించాడు. ఇంతటి భ్రాతృప్రేమా విలసితుడు ధర్మారావు.

గురువుగా లేదా అధ్యాపకుడుగా ధర్మారావుకు ఒక ప్రత్యేకతఉంది. వ్యక్తితః జాతీయవాది. ఆ కాలానుగుణంగా ఆంగ్లం చదువుకొన్నాడు. "ధర్మారావు జాతీయ కళాశాలలో ముప్పది రూపాయలమీద తెలుగు పండితుడుగా నేర్పాటయ్యెను. ధర్మారావున కింగ్లీషు పాఠశాలలోకన్న నిచట పనిచేయుటయే ఎక్కువ గౌరవముగ ఎంచెను. ఆతడింగ్లీషు చదివినను, చదువుచున్నప్పుడుకూడ దానిపై ద్వేషమే. బ్రతుకవలయునుగనుక నేటికాలమున బ్రతుకింగ్లీషు చదువువలనఁ దేలికకనుక నది చదివెను. హరప్పనాయని పుణ్యమాయని కోటలోనుండి సర్వసంభారములును ముంగిటికి వచ్చుచుండెను."[9] తనకు ఎంతగా జాతీయతా దృక్పథమున్న అక్కడి వ్యక్తులు వాతావరణమూ అన్నిరకరకాలుగా ఉండేవి. అక్కడే కుమారస్వామి గురువుగా స్వీకరించాడు ధర్మారావును. క్రమంగా ధర్మారావులో లేని వీరావేశం సైతం కుమారస్వామిలో వెలసింది. హరప్ప గురువయ్యాడు ధర్మారావు. పెద్దరాణి మరణానంతరం చిన్నరాణికి పాశ్చాత్య వ్యామోహం తగ్గిపోయి పెద్దరాణిలా భక్తురాలై పూర్వౌన్నత్యాన్ని నిలబెట్టయత్నించి తాను మరణిస్తూ కుమారుడు హరప్పను జమీందారుగాచూసి మరణించింది. ధర్మారావువద్ద చదువుకొమ్మని ఆదేశించింది. ధర్మారావు హరప్పను తీర్చిదిద్దడంలో పరుసవేదిలా పనిచేశాడు. హరప్పకు ఇంగ్లీషు చెప్పడానికి రంగారావు 1200 రూపాయలు జీతం ఇస్తుండేవాడు. తెలుగు చెప్పడానికి ధర్మారావుకేమీ జీతం లేదేఅని బాధపడ్డాడు హరప్ప. హరప్పను కృష్ణమనాయని తండ్రి హరప్పలా తయారుచేశాడు సర్వవిషయాల్లోను ధర్మారావు. జమీందారుకుండవలసిన లక్షణాలన్నింటినీ నేర్పించాడు. గురువు అంటే అదే ప్రధానం. అధ్యాపకుని వ్యక్తిత్వంద్వారా విద్యార్థులను ప్రభావితం చేయవలసిన అగత్యం

ఉంది. అది ధర్మారావుద్వారా హరప్పలో గమనించగలం. ధర్మారావు మూలంగానే హరప్ప తల్లికి, నాయనమ్మకు కర్మలుచేశాడు వేణుగోపాలస్వామికి కల్యాణోత్సవం చేయించాడు చివరికి హరప్పకు దివానుఅయ్యాడు గిరికకు భక్తి ప్రబోధకుడు. వేదాంత దేశికుడు; అభినయాచార్యుడు, గిరికాముక్తికి కారకుడు భాగవతం మొదలు భరత నాట్యశాస్త్రం వరకు క్షుణ్ణంగా గిరికకు బోధించాడు ఆయన గురువుగా మహావ్యక్తిగా మనకు గోచరిస్తాడు.

దేశభక్తుడుగా, సంఘసంస్కర్తగా ధర్మారావుది ఒక ప్రత్యేకవ్యక్తిత్వం. సంప్రదాయవాది. జాతీయవాది అయితే సంప్రదాయవాది కనుక జాతీయకళలు విద్యలపట్ల ప్రేమ, ఉన్నప్పటికీ గాంధీజీ పిలుపునందుకొని తనమిత్రుడు రాఘవ రావులాగా సహాయ నిరాకరణోద్యమంలో చేరి, కారాగార శిక్షలనుభవించలేదు. ఖద్దరు ధారణవరకే తన స్వాతంత్ర్యోద్యమంలోని పాత్ర. కాకపోతే తన మిత్రుడు రాఘురావురు రాజకీయ బాధితుడని అతనికెంతో సాయంచేయడం గమనించవచ్చు. రాఘవరావుతో కలిసి మద్యపాన దోషాన్నిగురించి తద్బాధితులకు తెలియజెప్పడం లోను తిరిగినవాడు. ఆ విధంగా సంఘసంస్కర్తగా సైతం తనకు చేతనైనంతగా చేసినవాడు. తనయింటమాత్రం ఎల్లప్పుడూ రాట్నం తిరుగుతూనేఉండేది. తల్లి, భార్య, ఈ పనిచేస్తూ ఉండేవారు.

ధర్మారావు పద్యాలు ఎక్కడా నవలలో ఉదాహరించకపోయినా అతడొక కవి; మంచికవి. మిత్రులు మొదలు తదితరులందరూ అతని కవితను ప్రశంసించిన వారే. పద్యం చదివేతీరు జనాకర్షకంగా ఉండేది. కృష్ణమనాయుడు రుక్మిణమ్మా రావు హరప్ప, గిరిక, మిత్రులకీ, అందరికీ ఆమోదయోగ్యమే. అతడు కళావేత్త. సర్వజాతీయ కళలు నేర్చినవాడు. విద్యానైపుణ్యం కలవాడు. మహత్తరవ్యక్తి. ఇంతకంటే ఉత్తమ విమర్శకుడు. శ్రీనాథుడు సీసపద్యాన్ని చెడగొట్టాడని విమ ర్శించినవాడు; కళాపూర్ణోదయంకంటే ప్రభావతీ ప్రద్యుమ్నము గొప్పదని నిరూ పించినవాడు. ప్రబంధాలన్నిట ఆముక్తమాల్యద గొప్ప ప్రబంధమని రాయల నైపుణ్యమంతా, ప్రతిభ అంతా, ప్రకృతి పరిశీలనఅంతా ఆయన ఋతువర్ణనల్లో ఉందని గ్రహించిన వేత్త; ప్రశంసించిన విమర్శకుడు. ఈ విమర్శ సద్విమర్శ. ఈ విధంగా ధర్మారావు మహా సాహితీవేత్తగా నిరూపించుకొన్నాడు.

గణాచారితో కలిసినప్పుడు మహావేత్తగా త్రికాలవేదిగా కనిపించడం ఇత నిలో ఒకానొక విశేషం.

ధర్మారావుకు ధర్మారావే సాటి ఇతరులతో పోలికలేదు. అతని గొప్పదనం-అతనిది. జాతీయ భావాలతో పోల్చదగిన వారు కేశవరావు దివ్యజ్ఞాన సమాజమూ, శివరావు తనలోని మహిమ అని చెప్పినప్పుడు మూకీ భావం వహించడం అతని లోని ఒకానొక విశిష్టగుణ మనిపిస్తుంది. కాని నమ్మనప్పుడు తెగ జెప్పలేకపోవడం మరో అర్థం గాని విశేషం. అయినా అతని కతడే సాటి.

ధర్మారావు పాత్రను గురించి ఇంత గొప్పగా చెప్పినా విమర్శకులు కొన్ని సందేహాలు వెలిబుచ్చారు. ముఖ్యంగా శ్రీ ఆర్. ఎస్. సుదర్శనంగారు ఈ పాత్రకు సంబంధించిన చిత్రణలోని లోపాల్ని వివరించ యత్నించారు.

"వేయి పడగలు నవల చదవటం ఒక అపూర్వమైన అనుభవం; మరుపు రానిది. అందులో ఎంత సంతృప్తి ఉన్నదో అంత అంత అసంతృప్తి కూడ ఉన్నది....

"ధర్మానికి ప్రతినిధి ధర్మారావు. ఏ ధర్మానికి? వ్యక్తి ధర్మానికా? వ్యవస్థా ధర్మానికా? సనాతన ధర్మానికా? ధర్మారావు ఏకవీరవలె సాధకుడుగా కనిపించడు. అతనికి సందేహాలు, సంఘర్షణలు రావు. సనాతన ధర్మాన్ని (పూర్వ జన్మ సుకృతం వల్ల కాబోలు) దర్శించిన జ్ఞాని అని రచయిత అభిప్రాయం అతను వ్యవస్థా ధర్మానికి సాధికార వ్యాఖ్యాత. లోక వ్యవహారానికి సాక్షి భూతుడు అని రచయిత ఉద్దేశం అతనిది ఆజన్మ సిద్ధమైన జ్ఞానమార్గం. భక్తి మార్గంలో గిరికకూ, కర్మ మార్గంలో హరప్పకు ఎలా నెరవేరాయో పరీక్షిస్తే తెలు స్తుంది. లోక వ్యవహారానికి కేవలం సాక్షీభూతుడు అయ్యేందుకు నిర్లిప్తత ధర్మా రావు మనసులో లేదు. దాన్ని సాధించే పరిస్థితులూ అతని జీవితములో లేవు. అతనిలో వ్యక్తమయ్యేది లోక విమర్శ తప్ప ఆత్మ విమర్శ లేదు. పైగా స్వోత్కర్ష కావలసినంత. నవలలో చిత్రింపబడిన అతని ఇరవై ఏళ్ళ జీవిత చరిత్రలో వ్యక్తిగతంగా జ్ఞానమార్గంలో అతను పొందిన పరిణామం ఏమిటో అదేమి చెప్పలేదు హిందూ వ్యవస్థా ధర్మానికి వ్యాఖ్యాతా, సొంతదారూ అనుకో వడంతో దానితో తాదాత్మ్యత చెందిన అతని అహంకారము గోరంతలు కొండంత లుగా ప్రస్ఫుటమైంది.... .... .... .... .... .... .... ....

".... ధర్మారుపు కూడ 'బ్రాహ్మణత్వం' అన్న ఆదర్శానికి ఎటు వంటి సమర్థన? బ్రాహ్మణత్వం అంటే కేవలం ధర్మ ప్రచారమేనా"! ఈవిధంగా

తర్కిస్తే నవలలో వ్యవస్థా ధర్మ నిరూపణము అసంతృప్తినే కలిగిస్తుంది. అంటే ఆకృతి (form) కి తగిన పుష్టి (Substance) జరుగలేదనిపిస్తుంది.

"...... మారుతున్న పరిస్థితుల్లోకూడా హిందూధర్మం . సృజనాత్మకమైన శక్తిఅని నిరూపణచేసే ఉద్దేశమే నవలకు ఉన్నట్లయితే ధర్మారావు సృష్టి మరొక విధంగా జరిగిఉండును. అతను పాతకొత్తలకు మేలుకలయికగా సంగమస్థానంగా ఉండే యుండును. [ఉదాహరణకు 'మాలపల్లి' నవలలో సంగదాసు లేక రామదాసు పాత్రలను చూడవచ్చును]. ధర్మారావు కర్మయోగికాడు. జ్ఞానయోగి అంతేనూ ధర్మారావులో కొత్తపద్ధతులమీద, కొత్త విధానాలమీద అంత ద్వేషభావం దేనికి? అది జిజ్ఞాసువులక్షణంకాదు, ధర్మారావు సిద్ధాంతరీత్యా ప్రతిపాదించిన కొత్తమార్గంలో సమన్వయపథం ఏమీలేదు అతనికి కొత్త ఒకరోత, పాత ఒకనీతి.

"నవలలో తెలుగుదేశమంటే సుబ్బన్నపేట. సుబ్బన్నపేట అంటే ధర్మారావు. ఇది కావ్యశరీరం. ధర్మారావు పాత్ర సమర్థించినది క్రమంగా అదృశ్యమౌతున్న గ్రామీణమైన తెలుగుదనాన్ని, ఆంగ్లభాషా, పాశ్చాత్య నాగరికత సోకని తెలుగుదనం నిలబడలేదనే అతని ఆవేదన. అందులో లోటుపాట్లు అతనికి కనిపించవు. అదంతా హిందూ ధర్మ స్వరూపమేనన్న భ్రమా, దాని సమర్థనంకోసం తను అహంభావం పెంచుకున్నా పరవాలేదనుకోవటం తరచు భావానికంటే అహంభావమే. అతనిలో ముందుకువచ్చే పరిస్థితుల్ని కల్పిస్తోంది.

"...... ధర్మారావు శారదావట్టానికీ, వితంతువివాహాలకీ, హరిజనుల ఆలయప్రవేశానికీకూడ వ్యతిరేకి. ఆంగ్లసారస్వతం చదువుకున్నా, దానిపై అతనికి ద్వేషమేనట...... "

"......ధర్మారావు జమీందారీ వ్యవస్థపై మమకారం వదిలించుకోలేనివ్యక్తి. ఇది సహజమే అతని పరిస్థితులిబట్టి. కాని అతని మనోవైఖరి ఎటువంటిదోచూడండి. జమీందారు కృష్ణమనాయుడు ధర్మారావు తండ్రికర్మకు డబ్బుయిచ్చినా, మాసికం విషయం మాట్లాడడు. ఎదురుచూచి చివరకు ధర్మారావు కోటలోనికివెళ్ళాడు అతణ్ణి చూచి నాయుడు 'పని ఏమిటి?' అని అడిగెను. ధర్మారావు 'రేపు నాయనగారి మాసికము' అనెను. నాయుడు డబ్బిప్పించెను....దీనినిగూర్చి ధర్మారావు తర్వాత ఊహించునది. 'అయనయే ఇచ్చెను. నేను యాచించలేదు మాసికమునకు యాచించితినా? లేదు పోయి యూరకేచెప్పితిని. ఆయనయే యిచ్చెను' భంగపడినా అహం

భావానికి సమర్థన చెప్పుకోచూస్తాడు ధర్మారావు. అతనిలో స్వాభిమానం మెండు. దానికి బాధాకరమైన సత్యాన్ని దర్శించేచొరవ, సాహసం అతనిలోలేవు. ఆ పరిస్థితిలో యుక్తులతో, ఆలోచనలతో సత్యస్వరూపాన్ని భిన్నంగా తనకు అనుకూలంగా దర్శించే ప్రయత్నం చేస్తాడు. అందువల్లే అతని ప్రవర్తనకూడా సమయానుకూలంగా ఉంటుంది. కార్యమునాడు నవరసు భార్యకొంగున కట్టలేదు. అత్తవారి బంధువులు ప్రశ్నించగా 'నిజమే కట్టితి'నని బుకాయిస్తాడు. అతడబద్ధమాడడని అందరికీ నమ్మకమట. ఆ నమ్మకాన్ని అలా ఉపయోగించుకొంటాడు. ధర్మము, భగవంతుడు, ధర్మారావు నాశ్రయించినవారేకాని ధర్మారావు వాని నాశ్రయించినట్లు తోచదు.... ....

"ధర్మారావు ఇంగ్లీషును ద్వేషించినా దాన్ని నేర్చుకోవటం, బి. ఏ. చదవటం మానలేదు. అతను చదివే కళాశాలలో రెండు సందర్భాలలో సమ్మె జరుగుతుంది. మొదటిసారి ఉపాధ్యాయుడు తిట్టినందుకు. ఇక్కడ ఉపాధ్యాయునికి ప్రిన్సిపాలు మద్దతు లేదు. ధర్మారావు సమ్మెలో చేరతాడు. విద్యార్థులు గెలుస్తారు. రెండోసారి హిందూ మతాన్ని అవమానిస్తూ క్రైస్తవ విద్యార్థులు ప్రవర్తించినందుకు, హిందువులైన విద్యార్థులు సమ్మె చేస్తారు. ప్రిన్సిపాలు జరిమానా వేస్తాడు. సమ్మె కొనసాగించాలా? వద్దా? అనే ప్రశ్న వస్తుంది. ధర్మారావు సమ్మెలో చేరడు. జరిమానా లిచ్చి కళాశాలకు నడువుడు.... ఎదిరించి నీవేమైనా చేయగలవా? అంటూ కర్తవ్యం ఉపదేశిస్తాడు. ఇక్కడ ధర్మ రక్షణ కంటె ఆత్మరక్షణ ప్రధానమైనది! ధర్మారావునకు హిందూధర్మములో తాదాత్మ్యము. అది తనకుపయోగపడునంతవరకే. దానికి తను ఉపయోగపడవలసి వచ్చినప్పుడు వాగ్వాదము, వ్యాఖ్యానము కావలసినంత. ఇక్కడ అసలువిషయం, జమీలేకపోయినా ధర్మారావు జమీందారుబిడ్డ. కష్టముల నెదుర్కొనటం కంటె వాటిని తప్పించుకోవటమే అతని స్వభావం,

"ధర్మారావు కవి, భావుకుడు: అతని పద్యమేమీ ఉదాహరింపబడకపోయినా అతని భావనాశక్తి ఆలోచనాశక్తి వ్యాఖ్యానములో, సమర్థనలో వ్యక్తమవుతూనే ఉంటుంది. ఆ భావనాశక్తివల్లే అతనికి తను జ్ఞానయోగిననే భ్రమ; ధర్మావతారమెత్తిన భగవచ్ఛక్తిననే గర్వము. అతను గిరికతో 'నిజానికి యోగమార్గంలో ఏదారి కష్టందానిదే. వ్యక్తి స్వభావాన్నిబట్టి దారి' అంటాడు ధర్మారావుకు తను

కష్టపడి సాధించ దగిన దేమీ మిగిలినట్లే తోచదు ! ధర్మార్థ కామమోక్షము లను పురుషార్థాలలో ధర్మారావు ఇటు అర్థం కోసం కాని అటు మోక్షం కోసం కాని ప్రయత్నం చెయ్యడు తను ధర్మావతారము. పెళ్ళి చిన్నతనంలోనే జరగటం వల్ల కామానికి ఇబ్బంది లేదు. ఇక సాధించ వలసిన దేమి ? లోకానికి గురువు కావటం. అందువల్లే నవలలో చాలభాగం ధర్మారావు సుబ్బన్నపేట వీధిలో నడుస్తూ, వెంట హరప్ప, గిరిక, గణాచారి, కుమారస్వామి, కిరీటి – ఎవరితోనో ఒకరితో కనిపిస్తూ దేవాలయానికి వెళ్ళి వస్తూ ఉంటాడు. స్వామికి ఉత్సవాలు జరి పించడం తప్ప అతను చేసిందేమీలేదు కుమార స్వామికి వివాహం కావడానికి చేసిన సాహాయ్యము అది సగము ప్రత్యర్థులపై నసురోత్సాహమే. పోతే ధనిక రాలైన 'పతిత' 'మంగమ్మ'ను గూర్చి కుతూహలం కూడ కారణం.

"ధర్మారావు చరిత్రలో అర్థంకాని విషయం భార్య ఆరోగ్యం పట్ల, చూపిన అశ్రద్ధ. పదేళ్ళ ముందుగా ఈ 'జ్ఞానికి' గణాచారి హెచ్చరిక ఇచ్చినా ఆ విష యమై ధర్మారావు పట్టించుకోడు ఇది నవలలో కర్మ సిద్ధాంతానికి వ్యాఖ్యానము కాదుగదా ! ధర్మారావు దారిద్ర్యము అతని అశ్రద్ధకు కారణం అనుకోవచ్చు. కాని కొన్ని సందర్భాల్లో ధర్మారావు చూపిన నిర్లక్ష్యము సమర్థనీయంగా తోచదు. భార్యకు స్వస్థత చెడిన కాలంలోనే ధర్మారావు ఇంటికి ఆలస్యంగా రావడం జరు గుతూ ఉంటుంది ధర్మారావు మంగమ్మతో నలుగురి ఎదుట మాట్లాడడు. కాని మంగమ్మ చివరకు కుమారస్వామితో 'రహస్యము' చెబుతుంది. 'ప్రతిదిన మర్ధ రాత్రమున నేను ధర్మారావుగారి శిష్యురాలను. మూడవ కంటికి తెలియదు'. ధర్మా రావు ప్రవర్తనలో ఈ భాగము ఎలా అర్థం చేసుకోవాలి ?"[10]

ఎందరినో సముద్ధరించినవాడు, ఉపకరించినవాడు ధర్మారావు భార్యారోగాన్ని గూర్చి పట్టించుకోనట్లే తనపుత్రుడు రామేశ్వరశాస్త్రిని 'ఆగమ్మకాకి అయిపోతున్నా' దని అరుంధతి చెప్పినా పట్టించుకోడు తనంతట తానే వ్యక్తిత్వవికాసం పొందా లన్నది ఉద్దేశం ఆపెనుక కుమారస్వామి శిష్యుడు అయ్యాడనుకోండి.

ఇంతగా విమర్శకు గురిఅయినప్పటికీ ధర్మారావు పాత్ర సజీవమైనది; రక్త మాంసలాలతో ఒప్పారుతున్న వ్యక్తి అని సువర్ణనంగారే వివరించారు.

"వేయి పడగలు గొప్పదనం అది ఏకపాత్ర చిత్రణ కావటం. ఆ చిత్రణం వేయిపుటలదాకా విస్తరించినా, వేయిపుటలు తప్పక చదివిస్తాయి. అందులో ధర్మారావు వ్యక్తిత్వం స్పృశించని, వ్యాఖ్యానించని అంశంలేదు. ధర్మారావు గురుత్వం వహించని సలహా యివ్వని అతనితో సంబంధంలేని పాత్రలేదు. ఏ విధంగానైనా ధర్మారావుకు సమఉజ్జీయో, అధికుడో అయ్యే పాత్ర కనిపిస్తే అతనికీ నవలలో ఉనికే లేదు. ఉదాహరణ : రామచంద్రరాజు, కేశవరావు, శివరావు పాత్రలు. ధర్మారావు వాదంతో ఓడించని ప్రతి ద్వంద్వి లేనేలేడు. [తన గొప్పదనం గుర్తించని వారిమీద ఇద్దరు రౌడీలను పురికొల్పించుటకైనా వెనుదీయలేదు]. తెలుగుల జీవితాన్ని కూలంకషంగా స్పృశిస్తూ, దాన్ని ఒక ప్రత్యేక దృక్పథం నుంచీ అతని తాదాత్మ్యం ఆదర్శంతో కాదు, వర్తమానంలో కాదు, భూతకాలంతో దాని ప్రభావం అస్తమిత సూర్యబింబంలా అతనిలో కోపారుణ కాంతుల్ని విరజిమ్ముతూ, చివరకు దుఃఖంలో, చీకట్లో అంతరిస్తుంది. వెంటనే చంద్రోదయం, చంద్రుణ్ణి దర్శించగటంతో కథ ముగుస్తుంది. వ్యక్తిగా ధర్మారావును మనం ప్రేమించలేక పోవచ్చు. అతని అభిప్రాయాలను అంగీకరించక పోవచ్చు. అతని అహంభావం మనకు ఎబ్బెట్టుగా ఉండవచ్చు – అతని యుక్తులు సమయానుకూల ప్రవర్తనా దాపరికాలూ ఆదర్శ ప్రాయం కాక పోవచ్చు. కాని ధర్మారావు రాగద్వేషాలు, రక్త మాంసాలూ, కష్ట సుఖాలూ కలిగిన మనిషి అచ్చమైన తెలుగు వాడు. వ్యవస్థా ధర్మానికి, యోగమార్గానికి ప్రతినిధిగా తృప్తి కలిగించక పోయినా తెలుగుదనం ముద్దకట్టిన మూర్తి ధర్మారావు. అతని మనసు ద్వారా మారుతూ వచ్చిన తెలుగు దేశాన్ని గతించిన వ్యవస్థనూ దర్శించే అవకాశం 'వేయి పడగలు' కల్పిస్తోంది.

"పై వరామర్శ ధర్మారావు వ్యక్తిత్వం యొక్క స్వరూపం ఏమిటో స్పష్టంగా ప్రవర్తనను బట్టి తెలుపుతోంది. ధర్మారావు ఆదర్శ మానవుడు – కాక పోవచ్చు. కాని అతని వ్యక్తిత్వమూ, అస్తిత్వమూ సిద్ధాంతాలను, అభిప్రాయాలను అధిగమించిన సత్యం అని నవలలో ఋజువవుతున్నది. ధర్మారావు ధర్మదృష్టికి స్పష్టత లేకపోతేనేం ? అతని మూర్తి మన కన్నుల యెదుట స్పష్టంగానే ఉంది. కావ్యానికిది చాలు."

"రెండు గుండెలు పరిచయూ విభజన బిందువులుగా ఆదిమధ్యాంతలు విస్పష్టముగుచున్న కథలో పెద్దఅరుంధతి కార్యము, అంతములో చిన్న అరుంధతి కార్యము. కాలము మొదటూ చివా అలా ధర్మారావులో సమీకరించినవి. ధర్మారావు ఆది

మధ్యాంతాలలో మార్పులేని పురుషుడు. అరుంధతి 'ప్రకృతి'. మార్పు ప్రకృతి లక్షణము. పెద్ద అరుంధతి పునరావృత్తి చిన్న అరుంధతి. ఇది 'వేయిపడగలు'గా వెలువడ్డ విశ్వనాథవారి హృదయోద్వేగ తరంగరేఖ। ఇది కావ్యస్వరూపం!"[11]

## 4.4. ఇతర పాత్రలు–పురుషులు :

విశ్వనాథవారు 'వేయి పడగలు'లో ఇతర పాత్రలను చిత్రించిన తీరును ప్రస్తుతం మనం పరిశీలించవలసిఉంది. వాస్తవానికి నవలంతా విరాట్స్వరూపంతో వెలసిపోతూఉన్న ధర్మారావు పాత్రచిత్రణతో అన్ని పాత్రలగూర్చి అంతోఇంతో తెలుసుకోవడం జరిగింది. అయినా స్థూలంగా తక్కిన పాత్రల శీలవృత్తుల్ని గమనిస్తేనే విశ్వనాథవారి పాత్రల వైవిధ్యం పరిపూర్ణత్వం చెందుతుంది.

"రామేశ్వరశాస్త్రి, కృష్ణమనాయుడు, రంగాజమ్మ, రుక్మిణమ్మారావు, సరోజినీదేవి పూర్వయుగమువారు వారి మృతితర్వాత గుండేరు వరద. దేవదాసి, గోపన్న, అరుంధతి, హరప్ప, పసరిక, గణాచారి కొత్తయుగపు చివరి మెరుపులు. వారిమృతి తరువాత గుండేరు వరద–మిగిలినది ధర్మారావు, చిన్న అరుంధతి. మొదటి వరద నాటికే రంగారావు పాశ్చాత్యయువతి భార్యగా తెచ్చుటతో వచ్చిన కొత్తపోకడలు క్రమంగా ప్రబలమై రెండవ వరదనాటికి క్షీణించి తగ్గుముఖం పట్టినవి."[12]

"ఈ నవలలో భారతీయ సంస్కృతిని ఒకవంక పాశ్చాత్య వ్యామోహాన్ని వేరొకవంక ప్రతిబింబింపవానికి రెండువర్గాల పాత్రలు సృష్టించబడ్డాయి. అరుంధతి శశిరేఖ, గిరిక, ధర్మారావు, కిరీటి, పసరిక, రాఘవరావు వంటివారు ప్రాచీన సంస్కృతి లోని ఒక్కొక్క మహోత్కృష్టమైన గుణాన్ని నిరూపించడానికి మూర్తిదాల్చిన ప్రతీకలు. రంగారావు, రామేశ్వరము, మంగమ్మ, రాధాపతి, వంటివారు పాశ్చాత్య నాగరికతలోని దుర్మార్గులను ప్రతిబింబించినవారు."[13]

పూర్వయుగంలోని పురుషపాత్రల్లో చెప్పుకోదగ్గవారు మహాపురుషులు ఇద్దరు. ఒకరు రామేశ్వరశాస్త్రి, రెండోవారు కృష్ణమనాయుడు. వీరిద్దరికి తెగని అనుబంధం. జమీందారు కృష్ణమనాయుడు ఆయన దివాను రామేశ్వరశాస్త్రి. వారిద్దరి మైత్రి వ్యక్తిత్వాలు విశిష్టమైనవి అంత మైత్రిఉన్నా పట్టుదలగలవారు శాస్త్రి. దయార్ద్ర హృదయుడు. అతడు విచిత్రవ్యక్తి. చతుర్వర్ణాలు బ్రహ్మ క్షత్రియ వైశ్య శూద్ర కన్యలు. సావిత్రమ్మ, రంగాజమ్మ, హైమవతి, మంగలను వరుసగా వివాహమాడ

డమేగాక భోగాంగన రత్నగిరి నుంచుకొన్నాడు. వారి అందరియందు సంతానం కలిగింది. ఆయన కర్ణుడు. ఈ పరోపకార బుద్ధిచేత చివరికి నిరుపేదఅయ్యాడు. నాగేశ్వరస్వామి ఆలయానికి, వేణుగోపాలస్వామి దేవాలయానికి ఆయన ఎంతో వెచ్చించి ఎన్నో రకాలుగా పునర్నిర్మాణాలు, అలంకారాలు, నిర్మాణాలు చేశారు. విలువిద్యలో గొప్పవాడు దేశాటన చేసినవాడు అతిథ్యభ్యాగతులకు అయింట మితిలేదు. అంతఉన్నా చివరిరోజుల్లో వారంట్లువరకు వచ్చింది ఆయన ఉప్పుతిననివాడులేడు. కానీ చివరికి నాగన్నసెట్టి, శ్రీరాములు అప్పులజలగల్లా పీడించారు. నాగేశ్వరస్వామి ఆలయంలోనే శివైక్యం పొందాడు. "ధర్మారామన కొకసారిగా తన తండ్రిమూర్తి గోచరించెను. ఆయన వర్ణాశ్రమ ధర్మాలన్నియు మద్దకట్టిన మూర్తి. ఆయన భారతదేశముయొక్క యాత్మ. ఆయనత్రయీ విద్యకొక వ్యాఖ్యానము."[14] "అను మాటలకు సమర్థన ఎటువంటిది? రామేశ్వరశాస్త్రి అందగాడు, రసికుడు. దేశము నాలుగుమూలలా తిరిగివచ్చినవాడు. నాలుగు వర్ణాల ఆడపడుచుల్ని పెండ్లాడి, ఒక భోగాంగనను చేరదీసిన ఆయన భోగికాని, యోగికాదు. ఆయన వితరణబుద్ధి హద్దులేనిది. ఆయన జమీందారు తరువాత జమీందారు. ఆయన పాటించిన నాలుగు ఆశ్రమధర్మాలు ఏమిటి! గృహస్థుగానే మరణించాడే? ఏ విధంగా చూచిన రామేశ్వరశాస్త్రి ఒక విశిష్టవ్యక్తియేకాని "బ్రాహ్మణుడు" అన్న ఆదర్శానికి పూర్తి నిరూపణకాదు. ఆయన చేసుకున్న వర్ణాంతరవివాహాలు వర్ణధర్మాన్ని సమర్థించేవి కావు. అందుకు భిన్నమే! వర్ణాంతరవివాహాలు నేటి వర్ణ విభేద సమస్యకు పరిష్కారం సూచిస్తున్నాయంటారా మను ధర్మశాస్త్రం ఆధారంగా? ఆ పరిష్కారం ఎంతమందికి నచ్చుతుంది? దానియొక్క యథార్థ స్వరూపమెటువంటిది? అని ప్రశ్నించడమే కాదు. వ్యవస్థ నిరూపణ 'ఆదర్శం'నుంచి 'యాథార్థ్యం' లోకి దిగివస్తుంది."[15]

కృష్ణమనాయుడు పూర్వ సంప్రదాయానికిచెందిన జమీందారు. ఔదార్యం, దయాదాతృత్వాలు, కళోపాసన, శౌర్యపరాక్రమాలు, భక్తితత్పరత, దైవచింతన మొదలైన ఉత్తమగుణాలతో దివాను రామేశ్వరశాస్త్రిపై విశ్వాసమూ అన్నివిధాల ఆయనలో మూర్తీభవించిన వ్యక్తి.

కృష్ణమనాయని కుమారుడు రంగారావు. పాశ్చాత్య నాగరికతా వ్యామోహితుడు. పేరుకు జమీందారేకాని, వాస్తవానికి తనబంధువులు రామేశ్వరం, రాధాకృష్ణుడు, సర్వారాయుడు, దివాను నాగేశ్వరరావు చేతులలో కీలుబొమ్మ. సుబ్బన్న

పేటలోకంటే, చెన్నపట్నమే ఇతని నివాసం. లక్ష్మణస్వామిఅనే ఏనుగు నంబారీ నెక్కక మోటారులోనే ప్రయాణంచేశాడు. సరోజినీదేవికి రాణిగా ఇవ్వవలసిన స్థానమీలేదు. ఆమె నుకాదని మరణశయ్యలో ఉన్నా లెక్కచేయక పోవడమూ, ఆమె మరణానంతరం వరుసగా సుసానీ, బియాట్రిసులను వివాహమాడడం, చివరికి వ్యాధిగ్రస్తుడు కావడం, హరప్ప ధర్మారావుల సాయంతో రాజశేఖరశాస్త్రి ఆయుర్వేదవైద్యం మూలంగా కోలుకోవడమూ, అప్పుడప్పుడే తనకు జ్ఞానోదయమవుతూండగా చిన్నరామేశ్వరశాస్త్రిని ప్రేమగా చూడడం, అదేసమయంలో హరప్ప మరణం, దానితో పంచికుర్రవాణ్ణి దత్తత తెచ్చుకొని చిన్న హరప్పఅని నామకరణం చేసి పెంచుకోవడంతో కథ ముగుస్తుంది. ఇది రంగారావు పాత్ర. జమీందారుగా అవ్యవహితంగా కొనసాగుతున్న పూర్వసంప్రదాయాల్ని కాదని పట్టాభిషేకం చేసుకోవడం, పాశ్చాత్య నాగరికతారీతిలో అన్నిహంగులు గూర్చడం, దుష్టచతుష్టయం చేతిలో కీలుబొమ్మకావడం ఆయన పతనానికీ, హరప్పా ధర్మారావుల ధార్మిక సంప్రదాయాలవల్ల మళ్ళీ మనిషికావడం గుర్తించవచ్చు.

సూర్యపతి ధనవంతుడైనా బాల్యమైత్రి, వితరణ కలవాడు; రాఘవరావు ఆవేశపరుడు సహాయ నిరాకరణోద్యమంలో చేరి కారాగారాలు అనుభవించి భార్యను పోగొట్టుకొన్న దేశ స్వాతంత్ర్యం కోసం పాటుపడ్డ మహాత్యాగి. కిరీటి శశిరేఖా పరిణయం కోసం ఈ నవలలో చిత్రించబడ్డాడా అనిపిస్తుంది. అంతకంటె అతడు చేసిన ఘనకార్యం లేదు. కేశవరావు జాతీయవాది, గొప్ప చదువరి. అందుకే జాతీయ కళాశాల స్థాపించి, గొప్ప సేవచేసిన మహనీయుడు. రాజ్యలక్ష్మమ్మకు తగిన పుత్రుడు. శివరావు తత్వమే సేరు దానవతార పురుషణ్ణని నమ్మినవాడు. పశుపతి ధర్మారావుకు మిత్రుడు ఆ వెనుక మామ. సంస్కారి. బాల్య వివాహాల్ని అంగీకరించని వాడు సంపన్నుడు అయినా మంచితనం ఉన్నవాడు. రాధాపతి విచిత్ర వ్యక్తి పాశ్చాత్య నాగరికతా వ్యామోహితుడు. 'విడి ప్రేమ సమాజ స్థాపకుడు'. అన్ని పూలమీద వాలే తేనెటీగ. బిజిలీ వ్యామోహితుడు. మంగమ్మ నాకర్షించినవాడు. పద్మాపతి కస్తూరిలతో ప్రేమ నెరపి చివరికి ఆత్మహత్య చేసుకొన్న దుర్బలుడు. చెంగల్రాయని మంగమ్మను హత్య చేయుమని ప్రేరేపించినవాడు. రంగావధాని రాధాపతి మిత్రుడైనా ఉత్తముడు. భోగప్పశాస్త్రి మహా భక్తుడు గాయత్రీ మంత్ర పఠనల వల్లనే ముక్తి పొందిన వాడు.

హరప్ప కర్మయోగి. తండ్రి నియమించిన ఈట్సన్ దొరను కాదని తల్లిని మించిన గురుప్ప ధర్మారావును స్వీకరించి, సమస్త ధర్మాలు, జమీందారు స్థితిగతులు తెలుసుకొని సర్వమూ తన చేతబట్టి నడిపించి, స్వాతంత్ర్యం రాగానే తల్లికి నాయనమ్మకు కర్మలు చేసి దైవ దర్శనం చేసుకొని మాఘ స్నానాలతో యోగం వల్లనే ప్రాణ త్యాగం చేసిన మహావ్యక్తి. భక్తిపరురాలైన దేవదాసిపై గౌరవం, పెద్దల యెడ గౌరవం. పసరికను పరిరక్షించడంలో తోడ్పడిన పరోపకారి.

రామేశ్వరుడు నవలలో ఒక దుష్టపాత్ర. ధర్మారావంటే గిట్టనివాడు. దేవదాసిపై కన్నువేసి ధర్మారావువల్ల భయపడ్డవాడు తాలూకా బోర్డు ప్రెసిడెంటు అయి మంగమ్మను వశపరచుకొని, దొంగనోట్ల కేసులో పట్టుబడి కారాగార శిక్షకు గురియైనవాడు దుష్టుడై ఎంత సంపాదించాడో అంత మంగమ్మకే దక్కింది. వాడికి కారాగారం దక్కింది. జీవితంలోనే ఈ ఘోర నరకబాధ లనుభవించాడు తాను చేసిన పాపాలకు.

జోస్యులు పై అధికారి ప్రాపకంకోసం పోయి భార్య మంగమ్మనే రామేశ్వరంకి అప్పగించవలసి వచ్చి తెలుసుకొని దుఃఖించిన అమాయకుడు; అవివేకి. చివరికి మనోవేదనకు తాళలేక నిరాశోపహతుడై తిరుగుతూ ఉండగా రామేశ్వరం అనుయాయులచేతిలో హత్యకు గురిఅయి మరణించినవాడు. అయితే మోసాన్ని మోసంతో జయించుమని డబ్బంతా తనపేరవచ్చేట్టు చూసుకొమ్మని, రామేశ్వరంకు మోసం చేయవలసిందని మంగమ్మకు బోధించినవాడు. అతని అవమానాలు అంతులేనివి.

కుమారస్వామి ఆవేశపరుడు; ధర్మారావు శిష్యుడు, ధర్మారావుకున్నంతకంటే మరింత ఎక్కువ ఆవేశం కలవాడు కాబట్టి కళాశాలలో, ఆవెనుక పత్రికాఫీసులో ఉద్యోగం కుదిరినా అక్కడ ఎంతోకాలం నిర్వర్తించలేకపోయాడు. ధర్మారావు మూలంగా శ్యామలను పంకజమ్మకు ఇష్టంలేకపోయినా వివాహం చేసుకొన్నాడు. పుత్రునకు చిన్న ధర్మారావని పేరుపెట్టుకొన్నాడు. మంగమ్మదగ్గర తగని చనువు. ఆమె పుత్రునిలా చూసుకొంది. చివరికి మంగమ్మ అధికమైన ఆస్తికి వారసుడయ్యాడు చిన్న హరప్పకు, చిన రామేశ్వరశాస్త్రికి గురువయ్యాడు.

ఈట్సన్ గార్డినర్ వాళ్ళ ప్రకృతులకు అనుగుణంగానే దొరల్లా నడుచుకొన్నారు.

రామచంద్రరాజు ధర్మారావు అన్న, రంగాజమ్మ రామేశ్వరశాస్త్రుల పుత్రుడు; రథంతరి భర్త. తల్లికర్మలు చేయడానికే పుట్టాడనిపించిందే కాని నవలలో ప్రత్యేక ప్రతిపత్తి ఏమీలేదు. కాకపోతే తమ్మునిపై అత్యంతప్రేమ. పోనీ ధర్మారావు కష్టాల్లోఉంటే ఆదుకొన్నవాడు కాడు. తల్లి రంగాజమ్మఅయినా ధర్మారావు కుటుంబానికి సహకరించిందికానీ ఇతడేమీ అలాంటివి చేయలేకపోయాడు.

చంద్రారెడ్డి గొప్పవాడైనా ప్రత్యేకతను నిలబెట్టుకొన్నవాడు కాడు.

చంద్రారెడ్డి కుమారుడు గోపాలకృష్ణారెడ్డి చేతినిండా డబ్బు. చదువుసందెలు లేకపోయినా దొరలా చెన్నపట్నం రాకపోకలు రిస్టువాచి, దొరటోపి, దొరలదుస్తులు ధరించి పొలాల్లో తిరుగుతాడు. పసరిక అంటే తగనిప్రేమ. పసరికకు ఇతడంటే ఇష్టం.

నవలలో పసరికపాత్ర ఒక ప్రత్యేకసృష్టి. పాములా పుట్టి, మనిషిగామారి పాముగా మరణించినతీరు అద్భుతావహం వాస్తవానికిలా మనుషులకు పాముపుట్టడం జరిగినట్లు మాన్యులు శ్రీ సూర్యనారాయణమూర్తి(శ్రీ)గారు చెప్పారు. రిటైర్డ్ విద్యాశాఖాధికారిగారైన మాధవపెద్ది నాగేశ్వరరావు ఇంట ఇలాగే పాముపుట్టడం, దాని మరణంతో వారింట అనేకానర్థాలు జరగడం సంభవించినట్లు డాక్టరు మాధవపెద్ది కోటేశ్వరరావుగారు చెప్పగా వీరు విన్నట్లు తెలిపారు. అయినా కావచ్చు. అలాంటి సన్నివేశాలనే విశ్వనాథవారు తమ నవలలో అనేకం పొందుపరచినట్లు ఇతఃపూర్వమే మనం తెలుసుకొన్నాము. పసరిక మంగకు రామేశ్వరశాస్త్రికి కలిగిన బిడ్డ. "తరువాత నాలుగైదేండ్లకు మంగకడుపున నొక కాయకాచెను. ఆకాయ మగశిశువు. ఈనకట్టు పుల్లకన్న సన్నము. ఆకుపచ్చనిరంగు, జుత్తు బూడిదరంగు అందరునేమొ పాముపిల్ల పుట్టెననుకొన్నారు. కాని రెండుకాళ్ళు, రెండుచేతులు, మొగము, కన్నులు, నాలుక ఇన్నియునుండగా బామనుకొనుట యెట్లు ?.... శిశువు కదలాడెను. పాము మెలికలు తిరిగినట్లుండెను. మంగ పొత్తిళ్ళనదిమి పట్టుకొనెను. శిశువేడ్చెను. పాము బుసకొట్టినట్లున్నది. మంగ సుబ్రహ్మణ్యేశ్వరస్వామిని దలచి పాపకాముదము పెట్టెను.... శాస్త్రి... 'మంగా ! నీవదృష్టవంతురాలవు. సుబ్రహ్మణ్యేశ్వరస్వామికి నీయందు చాల దయ పచ్చినది. నీయందు ధర్మమింకను జెడిపోలేదు. ఈధర్మమును రక్షించుకొనుము."[16] అనెను. ఈ పసరిక మెట్టచేలలోపడి పాములతో. పిట్టలతో ఆడుకొంటూ ఉండేవాడు. అన్న ధర్మారావంటే ప్రేమా, గౌరవమూను. మెట్టపొలాలుపోయి మాగాణమై

పోతూ ఉండగా నవనాగరికత ప్రబలగా, గోపాలకృష్ణారెడ్డి స్నేహంలోపడి ధర్మారావునే లెక్కచేయని స్థితికి వచ్చాడు. ఆ మార్పును సహించని పాములు, పిట్టలు పసరికను దగ్గరకు రానీయలేదు. చివరికి పాముచేత పాములా మరణిస్తాడు. ధర్మారావు కుమారస్వామితో వెళ్ళి పుట్టలు, గట్టులు, వెదకి పసరికను మంగకు అప్పగించడం, గార్డినర్‌నుంచి హరప్పసాయంతో ధర్మారావు పసరికను రక్షించి అప్పగించడమూ, మనకు తెలిసిందే. అది అతనికి పసరికమీదగల ప్రేమ

"పైరు పచ్చలు వాడుగా బుట్టెను. వానికిఁ బైరునకు సంబంధము. వాడే పైరు; పైరే వాడు.

"పైరనగా దేవమాతృకములని. కావుననే సుబ్బన్నపేట పరిసరములలో సర్వాధునాతన నాగరకతకుఁ దోడుగ నదేవ మాతృకములు ప్రబలినవి. తుద కంతయు జలమయమై పసరిక తిరుగుటకుఁ జోటులేక పోఁగా మంగకు, ధర్మారావు నకు నలజడి కలిగెను.

"ఆస్తిక్య బుద్ధి దేవ మాతృకములపై నాధారపడి యుండుననియు నది సర్వ సమృద్ధ కారణమనియు శ్రీ విశ్వనాథ వారు విశ్వసింతురు. దీనికి వేదము ప్రామాణ్యము."[17]

"నవలలో పసరిక విచిత్రమైన సృష్టి. అతడు భారతీయ వ్యవసాయక నిష్ఠకు ప్రతికృతి. దేవమాతృకల ప్రతినిధి. వృక్షాల్ని ఛేదించి అన్ని పొలాలను మాగాణం చేస్తున్నప్పుడు నిలవడానికి తావులేక మరణించిన వాడు పసరిక. పాముగా పుట్టి, మనిషై, పాముగానే మరణించినవాడు పసరిక. ఒత్తుకొని వచ్చిన దేవ మాతృకల ముందు వాడు నిలువలేక చనిపోయినాడు."[18]

ఇలా పసరిక పాత్ర చిత్రణ వింత గొల్పుతుంది. ఇది షేక్స్పియర్ టెంపెస్ట్ నాటకంలోని కాలిబన్ పాత్రను గుర్తుకు తెస్తుంది.

### 4.5 అప్రధాన పాత్రలు :

అప్రధాన పాత్రలలో అంతో ఇంతో ప్రాధాన్యమున్న పాత్రలు, ఊరికే కనిపించి తెరమరుగైన పాత్రలు అని రెండు రకాలుగా విభజించవచ్చు. గోపన్న సేవా తత్పరత, కృతజ్ఞత, తాను పుట్టి పెరిగిన గడ్డపై ప్రీతిగల మంచి మనిషిగా

కనిపిస్తాడు, రత్నగిరి తమ్ముడు కబీరు. అప్రధాన పాత్ర అయినా రత్నగిరికి దేవదాసికి చివరికీ ధర్మారావుకు రామచంద్రరాజుకు అండగా నిలచిన వ్యక్తి నాయరు పాత్రలో విశేషం లేకపోయినా ఆతనిలోని పరోపకార పారీణత మెచ్చదగింది. లోకంలో ఇలాంటి వాళ్లు ఉంటారనడాని కీ పాత్ర ఉపకరిస్తుంది అసిరి దొంగలకు ప్రతినిధి. దివాను నాగేశ్వరరావు రంగారావుకు అండగాఉండి జమీందారి డబ్బు ఎలా కాజేయాలో నిరూపించుకొన్నవాడు. పత్రికాధిపతుల మోసాల్ని స్పష్టంచేసే వ్యక్తి పత్రికాధిపతి వామనరావు. ధర్మారావు మామ సూర్యనారాయణ సోమయాజి. తెలుగు వైద్య నిపుణుడు రాజశేఖరశాస్త్రి. ఇక తక్కిన పాత్రలు రాధా కృష్ణుడు, సర్వారాయుడు, గణాచారి అన్న రంగయ్య, కాలేజీలోని అధ్యాపకులు, మురారి, ధర్మారావు బావలు యథాలాపంగా కనిపిస్తూ ఆనాటి పరిస్థితులను ఏదోవిధంగా తెలుపడానికే తప్ప పెద్దగా నవలలో ప్రాధాన్యం వహించలేదని చెప్పవచ్చు.

4.6 స్త్రీ పాత్రలు :

ఉత్తమ పతివ్రతగా అరుంధతి, చిన్న అరుంధతి, ఆ మాటకు వస్తే ప్రవృతిగా, ఉత్తమ పతివ్రతగా రంగాజమ్మ అలాగే శశిరేఖా, మూర్తీభవించిన భక్తిగా గిరిక, కళోపాసినిగా రత్నగిరి, సాంసారిక జీవితంలో ఉత్తమ కుటుంబినిగా సావిత్రమ్మ, తెలివి తేటలుగల సాధ్విగా రాజ్యలక్ష్మమ్మ, భర్తృనురాగిణులుగా హైమవతి, మంగలు, సోమిదమ్మగా నాగమ్మ, జామీందారిణిగా రుక్మిణమ్మారావు, మొదట పాశ్చాత్య వ్యామోహంలో పడినా పెద్దరాణిగారి మరణంతో దైవ చింతన గల వ్యక్తిగా మారి, జమీందారుగా తన పుత్రుడు కావడానికి తగిన ఏర్పాట్లుచేసి వెళ్ళిపోయిన జమీందారిణి సరోజినీదేవి. పాశ్చాత్య వ్యామోహంగలదిగా రంగమ్మ, పాశ్చాత్య స్త్రీలైన సుసానీ, బియాట్రిస్సులు, నాగరక యువతిగా శ్యామల, శ్యామల తల్లిగా పంకజమ్మ, అసూయా రహిత అయిన అనసూయ, కేవలం ఛాయలా ఉండే సూర్యపతి భార్య ఛాయ, కథా సందర్భంలో కనిపించిన ధర్మారావు అక్కగారు, అరుంధతీ గిరికలతో కలిసి ఉండడం తప్ప ఏమీ ప్రాధా

న్యంలేని రచయితలు ఇలా ఎంతో మంది స్త్రీ పాత్రల చిత్రణను ఎంతో మెళకువతో ఇంత పెద్ద నవలలో విశ్వనాథవారు చేయడం గమనించగలం.

ఇక మిగిలిన స్త్రీ పాత్రలు ఇద్దరు గణాచారి, మంగమ్మ. వీరిద్దరికీ సంబంధంలేదు. వేర్వేరు వ్యక్తులు.

గణాచారి నవలలో ప్రధానపాత్రగానే మనం స్వీకరించవలసి ఉంది. ఆమె త్రికాల వేది. పూనాడు కర్ణాటలోని 'బసివి' సంప్రదాయానికి చెందింది. దేవదాసి వైష్ణవాలయాలలో దైవాంకితం కాగా 'బసివి' అంటే గణాచారి శివాలయాలలో శివాంకిత అయింది. కానీ కాలంలో వచ్చిన మార్పులలో ఒకటిగా దేవదాసీ, బసివి సంప్రదాయాలు నిందలకు, విమర్శలకు గురి అయి, ఆ వ్యవస్థే నశించి పోయింది. క్రమంగా ఈ నవలలో గిరికా, గణాచారి పాత్రల మూలంగా విశ్వనాథవారు పూర్వ సంప్రదాయాన్ని విస్పష్టీకరించారు. కాశ్య పంశం అడవయ్యులు స్వామి వ్యాఖ్యాతలని ముందే తెలుసుకొన్నాము. "పైని భగవంతుడు, క్రింద రాజును, బ్రాహ్మణుడును ఈ రెండు మహా సంస్థలకు మధ్య గణాచారి త్రెంచరాని లంకె.

"ఇది నాలుగు స్తంభముల ధర్మ మంటపము. స్వామి, జమీందారు, బ్రాహ్మణుడు. గణాచారి – వీరు నల్గురు స్తంభములు"[19]

"దివ్య వాతావరణమునందు గణాచారి ప్రాధాన్యము రెండవది. ఆమె యేదియో విశేషముండిననేగాని యిలు వెడలదు; ఎప్పుడు జపము చేసుకొనుచుండును. స్వప్నములు గనుచుండును. ఆ స్వప్నములలో నామెకు రాబోవు సంగతులు తెలియగలవు. ఆ మఱునాడే ఆమె మంత్రములు పాటించినపిదప నూరిలోనికి బయలుదేరును. పూర్వము చెప్పబడినట్లామె స్వర్గమర్త్యములకు లంకె వేయగలది.... ఏకావు సుబ్బన్న పేట నిర్మాణ కారణభూతమైన సన్నివేశము కాధారమో యా కావుకొతురే గణాచారి. చివరకు వాంఛయుండిన పాక తగులబడుటలో నాగ్రామ వినాశమునకామె హేతువుగూడ నైనది."[20]

గణాచారి "గ్రామమునకంతకుఁ దగిలివచ్చు వార్తయైనచో వేపమండ పుచ్చుకొని తల విరియబోసుకొని తిరుగును. ఒక వ్యక్తికి సంబంధించినదైనచో జుట్టు

ముడివేసుకొని రావిమండ పుచ్చుకొని బయలుదేరును. అశుభమైనదోఁ తెల్లనిచీరనే తాల్చును."[21]

కాలం మార్పుతో నాగరికతా వ్యామోహంతో సంప్రదాయంమీద విశ్వాసం నశించిపోతూ ఉండగా గణాచారిలోను మార్పులు రాసాగాయి. తలనెరవడంగాని, ఒడలు వదలిపోవడంగాని పూర్వం గణాచారిలో కనిపించేవికాదు. పిదప కాలంతో ఈ గణాచారిలో వృద్ధాప్యం కనిపించనారంభించింది. కురులు తెల్లబడడం, లేనిజడలు కట్టడం, చివరికి తల గొరిగించుకోవడం, అన్న ఇల్లువదలిపెట్టి పాకలో నివసించడం, పాకలో వసుండగా పాక తగులబడి మరణించడం జరిగింది. అంతటితో ప్రకృతిలో ఎంతో మార్పువచ్చింది. పూర్వధర్మం మారిపోయి అధునాతన ధర్మం వచ్చింది. ఇది ఈ పాత్రలోని విశేషం.

మంగమ్మ మగనాలు. భర్త జోస్యులు అనాకారి. ధనాశతో రామేశ్వరానికి లొంగిపోయి భర్తృహత్యకు పరోక్షంగా కారణమవుతుంది. భర్త మాటలతో రామేశ్వరం ధనమంతా చేజిక్కించుకొని రాధాపతితో చెంగల్రాయనితో ఉంటూ కుమారస్వామితో తద్వారా ధర్మారావు మూలంగా ఆత్మవికాసం పొందుతుంది. భర్త ఛాయాచిత్రాన్ని బల్లపై ఉంచుకొంటుంది. కుమారస్వామిని పుత్రునిగాను, ధర్మారావును గురువుగాను స్వీకరించి కుమారస్వామికి అధికంగా తనఆస్తిలో వాటా వచ్చేట్లు వీలునామారాస్తుంది. చెంగల్రాయనికి ఇల్లుమాత్రం రాసిందన్న కసితో రాధాపతి ప్రేరణతో తృతీయ ప్రకృతిఅయిన చెంగల్రాయడు మంగమ్మను హత్య చేసి కారాగారం చేరుతాడు. ఇలా పతితఅయినా మంగమ్మ చివరకి ఆత్మవికాసం పొందిన మంచివ్యక్తిగా నిరూపితం.

### 4.7 సమానాంతరత్వం, ప్రతియోగం—మూలంగా పాత్రచిత్రణ :

మరోరీతి పాత్రచిత్రణ సైతం విశ్వదాథవారి వేయిపడగల్లో చూడగలము.

పూర్వోక్తమైనట్లు పాత్రచిత్రణలో సమానాంతరత్వం, (Parallelism) వల్ల, ప్రతియోగం (Contrast) వల్ల పాత్రల పరస్పర సాదృశ్యభేదాల్ని వివరించడం సైతం మనం గమనించగలం. హరప్పా ధర్మారావులు, రంగారావు చిన్న రామేశ్వరశాస్త్రి సన్నిహితులు కావడంలో సమానాంతరత్వం కనిపిస్తుంది.

కృష్ణమనాయుడు హరప్పలలో, ధర్మారావు కుమారస్వాములలో, అరుంధతీ చిన్న అరుంధతులలో, పెద్దరాణి, చిన్నరాణి చివరిదశలోని స్థితిలో సమానాంతరత్వం ద్యోతకమవుతుంది ధర్మారావు రామేశ్వరంలలో, ధర్మారావు రంగారావులలో, రంగారావు హరప్పలలో, కృష్ణమనాయుడు రంగారావులలో, ధర్మారావు ఈట్సన్ దొరలలో ప్రతియోగం ప్రస్ఫుటమవుతుంది. వీటిమూలంగా ఉత్తమగుణాలలో ఆయాపాత్రల జంటలలో వరుసగా అభివ్యక్తమవుతాయి. ఇది అచ్చంగా పాత్రల చిత్రణలో పాశ్చాత్య పద్ధతి నవలలో తప్పనిసరిఅయిన గుణం.

ఇలాగా అనేక పాత్రల అనేకానేక ప్రవృత్తులను మహానవలలో సృజించి చిత్రించడం మహా రచయితకు మాత్రమే సాధ్యం. కాని ఇతరులకు అసాధ్యం అనడం స్వభావోక్తి! ఇది విశ్వనాథ ప్రతిభ. మేధాసంపత్తి!

## సూచికలు


1. W. H. Hudson : An Introduction to the study, of English Literature–the study, of Prose Fiction. P. 145
2. పై. దే.
3. పై. దే. P. 151
4. వేయి పడగలు పు. 9.
5. డా॥ బి. వి. కుటుంబరావు : ఆంధ్ర నవలా పరిణామము. పు. 378, 379.
6. వేయి పడగలు. పు. 12.
7. పై. దే. పు. 32.
8. పై. దే. పు. 151.
9. పై. దే. పు. 130.
10. ఆర్. ఎస్. సుదర్శనం : నవ్యాంధ్ర సాహిత్యంలో దృక్పథాలు–2 భారతి, సెప్టెంబరు 1964

11. పై. దే.

12 పై. దే.

13. మొదలి నాగభూషణశర్మ : తెలుగు నవలా వికాసము - పు. 298.

14 వేయి పడగలు — పు. 51.

15. పై 10 వ సూచికలోనిదే.

16. వేయి పడగలు - పు. 48

17. పై 5 వ సూచికలోనిదే - పు. 383

18. పై 13 సూచికలోనిదే - పు. 300

19. వేయి పడగలు — పు. 9

20. పై 5 వ సూచికలోనిదే — పు. 382

21. వేయి పడగలు - పు. 236

# 5.0 వేయిపడగలు - సమకాలిక పరిస్థితులు

'నిజానికి శిల్పముకాని, సాహిత్యముకాని జాతీయమై యుండవలయును. విజాతీయమై యుండరాదు. వ్రాసినవానికి ముక్తి, చదివినవానికి రక్తి, ముక్తి— ఎంత సముద్రముమీద ఎగిరినను, పక్షి రాత్రికి గూటికిచేరును. ఇది జాతీయత ఇది సంప్రదాయము."[1]

"నేను పూర్వాచార పరాయణుడను; ఆధునికుడనుకాను; ప్రవాహమున కెదురీదుదును—ఈమాటలు నన్నుగూర్చి అజ్ఞులైనవారు చెప్పుదురు. ఆచెప్పుట ఇందాక చెప్పిన వంచనాశిల్పములోని భాగము. ఆ విద్యలోవారు అందెవేసిన చేతులు"[2] ఇవి విశ్వనాథ సత్యనారాయణగారి మాటలు.

5.1 ఆనాటి పరిస్థితులు :

విశ్వనాథవారు 'వేయిపడగలు' నవలలో సమకాలిక జీవితాన్ని ఎలా ప్రతిబింబించారో ఈ ప్రకరణంలో పరిశీలించడం ప్రస్తుతాంశం. ఇంతకుముందు ఇతివృత్త పాత్రచిత్రణలగూర్చి తెలుసుకొన్నాము. నవలలో ఉండవలసిన షడంగాలలో మూడోది సంవాదం లేదా రచనారీతి. కానీ ఇక్కడ నాల్గోఅంశమైన నవలలోని వాతావరణం అంటే సమకాలిక పరిస్థితుల్ని పరిశీలించి ఆవెనుక తదితరాంశాల్ని సమాలోచిద్దాం. ఎందుకంటే అలాచేసినప్పుడే నవలాకారుడు ఎంతవరకు కృతకృత్యుడయ్యాడో స్పష్టం అవుతుందని నా భావన.

డా॥ బి వి. కుటుంబరావుగారు వాస్తవికత, విభిన్న నాగరికతలగూర్చి తెలిపిన విషయాలు దీనికి చక్కగా నప్పుతున్నాయి గనుక వాటినే పరిశీలిద్దాం మొదట.

"వేయి పడగలు"లోని వ్యంగ్యము నటుంచి విచారించినచో ధనవంతుల దౌష్ట్యము, నిరుపేదల యిడుములు, అనధికారులధికారులగుట మన పురావిభవ విగళన క్రమము, గ్రామజీవిత శాంతిశోభలు, ప్రకృతి సౌందర్య వరప్రసాదము మొదలగు బెక్కు విషయములు మిక్కిలి వాస్తవికముగ వర్ణింపపడినవి.

"ఈ నవలలో నాంధ్ర గ్రామీణ జీవితము, నాంధ్ర సంస్కృతియు నంతట సున్నది యున్నట్లుగఁ బ్రతి ఫలించుచున్నది. దీని నెవ్వరు గాదనలేరు. 'వేయి పడగల'లో జెబ్బున్న పేటకుఁ గేంద్రస్థితి ఇది. తెలుగు సీమలోని గ్రామములకుఁ బ్రతిబింబము, ప్రతినిధియు. ఆ యూరిలోని గోవెల; కొలను; స్వామి వారికి కళ్యాణోత్సవములు; నూరేగింపులు; నలంకారములు; హరికథలు, కృష్ణ లీలా తరంగ కీర్తనములు; దేవదాసి నృత్య నాట్యములు; కూచిపూడి వారి నాటకములును; ఆంధ్ర దేశ జన పదములలో, బూర్వము వెల్లి విరిసిన సాంస్కృతిక జీవిత మంతయు నిందు మనోహరముగ వర్ణితము.

"కృష్ణమ నాయని ధర్మ ప్రభుత్వము, రంగారావు పాశ్చాత్య నాగరికతా ప్రలోభము, వారిరువురి తరముల నడుమ గల యాంతరము, నీ నవలలో, జక్కఁగ చిత్రింప బడినవి. ఆనాడాంధ్రావనిలో, గలిగిన కొన్ని యవాంఛనీయ పరిణామములు గూడ నిందు సుస్పష్టములై సహృదయుల హృదయములకు హత్తుకొని పోవును. అప్పటి కప్పుడే యస్తమించుచు నప్పటి కస్తమించిన కొన్ని తెలుగు కళల తుది మెఱపులీ నవలలో మనకు గోచరించుచున్నవి.

"దేవదాసీ సంస్థయందలి యౌన్నత్య మెల్ల విరిసి రూపొందిన గిరిక వృత్తాంతమంతయు నొక స్వాప్నిక కథ; సురపురాని మధురస్మృతి. ఏ కవిగాని తనకు పూర్వమందున్న యొక వందయేండ్ల సాంఘికచరిత్ర నింతకంటె వాస్తవి కముగను, సజీవముగను, రమణీయముగను జిత్రించిచూపిన కావ్యమును జూడఁ బోము.

"మన నాగరకత కాధారభూతమైనది యాముష్మిక విషయసంపత్తి; ఐహికము పాశ్చాత్యము. ప్రాచ్యనాగరకతయందు మృత్యు ప్రభావచింత, భగవత్స్వరూప నిర్ణయము, భూగోళముపై ఖగోళ ప్రభావము, నైహికాముష్మికముల సమ్మేళనము మొదలైనవన్నియు నిమిడియుండుటవలన జీవితమొక నిరంతర సాధనగఁ బరిగణింప బడును వ్యష్టి జీవితమున కాశ్రమముల యాధార మెట్లో, సమష్టి జీవితమునకు వర్ణాశ్రమములట్లు ఇట్టి వర్ణవ్యవస్థలో నేడు తాఱుమాఱు. ఆశ్రమ మందుమా పుట్టినది మొదలు గిట్టువఱకొక్కటే యాశ్రమము.

"పరమార్థ విచారణ సన్నగిల్లుటతో నైహికచింత బలిసిపోయినది. మన యాచార వ్యవహారములు వ్యత్యస్తములైనవి. ఉత్తమగతుల విచారముపదేశ వేదిక

లకే యొప్పగించి యనుష్ఠానము నందై హికమునకు దాస్యము చేయునట్టి యాధునిక తాత్త్వికులతోడివే తంటాలు."[3]

"వేయి పడగల్లో ప్రజల ధార్మిక, నైతిక జీవితాన్ని ఒక వైపు చిత్రిస్తూ రాను రాను మానవుడి స్వార్థం, అహంకారం, వ్యాపారలక్షణాలే (Commercial nature) ప్రజా జీవనం ఎంత దుర్భరమై పోతున్నదో నిరూపించారు. అంతేకాని పూర్వ రాజరికాన్ని జమీందారీ వ్యవస్థను తిరిగి స్థాపించాలనే ఉద్దేశ్యంతో ఆ నవల వ్రాయబడలేదు. సుఖప్రదమైన జీవనం ఏ వ్యవస్థచే స్థాపింప బడినా మహాకవికి సంతోషమే.

"అలాగే మత విశ్వాసాల్లోను మూఢ విశ్వాసాలను ప్రచారం చేసే పుట్ట కొక్కుల్లాంటి మతాలను వేయి పడగల్లో .... ఖండించారు. భారతీయ నాగరికతను ఆయన అన్ని నవలల్లో అంతా నొక్కి చెప్పటానికి హేతువు ప్రజలలో మత నైతిక స్థానములను పునర్నిర్మించడానికే. ఒక వైపు స్వదేశ స్వజాతి స్వభాషా రక్తిని, దేశభక్తిని ప్రేరేపిస్తూ లోలోతులలో విశ్వమానవ కల్యాణ సంగీతాన్ని ప్రతి ధ్వనించేలా వినిర్మింప బడినవి విశ్వనాథ నవలలు"[4]

సమకాలిక జీవితం "వేయి-పడగల"లో విశ్వనాథవారు వివరించారని డా॥ మొదలి నాగభూషణ శర్మగారు ఇలా పేర్కొన్నారు.

"ఇది [వేయి పడగలు] ఒకరకంగా చారిత్రక నవల. ఇరవయ్యో శతాబ్దం ప్రారంభంనుంచి మూడుదశాబ్దాలపాటు తెలుగుదేశంలో జరిగినకథ ఇందులో చూప బడ్డది. ఒకవిధంగాచూస్తే 1900–1930 మధ్యకాలంలో తెలుగుదేశంలో వచ్చిన ఆర్థిక, సాంఘిక, రాజకీయాల పరిణామచరిత్ర 'వేయి పడగలు' అని చెప్పవచ్చు. విశ్వనాథవారికి మన పూర్వ ఆచారాలన్నా నాడు మనపెద్దలు నియమించిన సంఘ వ్యవస్థఅన్నా ఎంతో మక్కువ. కొన్నివేల సంవత్సరాలనుంచి భారతీయ సంస్కృతికి సంఘవ్యవస్థకు వివాహవ్యవస్థ కేంద్రమై ఉన్నది పాశ్చాత్యవ్యామోహంతో పైపైమెరుగులతో వివాహవ్యవస్థ ఉన్నా, పూర్వ ఆచారాలన్నా, దైవభక్తిఅన్నా, ప్రజలలో కనిపిస్తున్న నిరాదరణ ఆయనను ప్రతిక్షణం బాధపెట్టింది. ఈ వేదనకు 'వేయి పడగలు' రచన. ఈరచనలో ప్రతిక్షణము మనకు విశ్వనాథ వ్యక్తిత్వము, ఆయన భావనాబలము ద్యోతకం అవుతూనేఉంటాయి. విదేశపాలనయెడ కలిగిన వైముఖ్యం మనలో జాతీయోద్యమభావాన్ని ఎంతగా మేల్కొల్పిందో, పాశ్చాత్య

నాగరికతా ప్రభావం వారి మత నైతిక భావాల ప్రభావం మనలో అంతటి వైము ఖ్యత కలిగించలేము. విశ్వనాథ భావనలో రాజకీయమైన జాతీయత కూడ అంత ముఖ్యమైనదే.

"వేయి పడగలు ముప్పై ఏళ్ళ తెలుగుజాతి జీవితానికి ప్రతిబింబం. విదేశ పాలన, దాని మంచి చెడ్డలు, జమీందారీలు, వాని వ్యవస్థ, సహాయ నిరాకరణో ద్యమం, దాని ప్రభావం – ఇవి అన్నీ కలిసి ఒక జాతిని ఏ విధంగా నడిపించాయో తెలియ జేస్తుంది ఈ నవల."[5]

ఆనాటి జాతీయోద్యమ ప్రధానం 'వేయి పడగలు'లో ఎలా విశ్వనాథవారు చిత్రించారో తెలిపారు శర్మగారు.

"విశ్వనాథవారి 'వేయి పడగలు' సర్వోత్కృష్టమైన రచన ఈ శతాబ్దంలోని మొదటి రెండు, మూడు దశాబ్దాలలో తెలుగువారి జీవనగతుల్లో వచ్చినమార్పును విశ్వనాథవారు ఇందులో చిత్రించారు. ఈ రెండు మూడు దశాబ్దులకాలాన్ని చిత్రించ దలచుకొన్న వారెవ్వరూ జాతీయోద్యమ భావాన్ని, ఆ ఉద్యమ స్థితిగతులను పేర్కొనకుండా ఉండడానికి వీలులేదు.

"వేయి పడగలులో కనీసం ముగ్గురుపాత్రలు జాతీయోద్యమంలో మునిగి తేల్చినవారు సుబ్బన్నపేటతో జాతీయ కళాశాలను స్థాపించిన కేశవరావు, ధర్మారావు స్నేహితుడు రాఘవరావు ఆ ఉద్యమంవల్ల ప్రత్యక్షంగా ప్రభావితులైనవారు. ఇక ధర్మారావు ఆ ఉద్యమంఅంటే అభినివేశంఉండి ఆర్థికమైన కారణాలవల్ల దానిలో పాల్గొనలేక దాని సిద్ధాంతాలను ఆమోదించినవాడు.

"కేశవరావుగారు జాతీయ భావాలకు ఆలవాలమై ఉండే కళాశాల స్థాపనకు పడిన మధన, దానిని నిర్వహించడానికి పడినపాట్లు ఆనాటి విద్యావిధానాన్ని తెలియ జెబుతాయి ఇక రాఘవరావు మద్యపానం నిషేధంవంటి దురాచారాలను మాన్పడానికి పడిన శ్రమ, ఆ జాతీయోద్యమ కార్య కర్తలకు తగినదే ; చివరకు రాఘవరావు తన సర్వస్వాన్నీ, చివరకు తన దేహ దార్ఢ్యాన్ని కూడా ఈ జాతీయోద్యమానికే ధారవోయడం చూస్తే నిస్వార్థ కాములై ఆనాడు ధన మాన ప్రాణాలను కూడా లెక్కించక జాతీయోద్యమం లోకి దూకిన ఎందరో యోధులు జ్ఞాపకం వస్తారు

"వీనికన్న ఎక్కువగా, విశ్వనాథ ఆనాడు గాంధీజీ యెడ వెలుబరించిన భావాలు ఎంతో సత్యాలు"[6]

"అప్పటికి మహాత్ముడైన గాంధి సహాయ నిరాకరణోద్యమ మారంభించి రెండేండ్లయినది. జనులు గాంధి దేవుడై యవతరించె నన్నారు. ఆయనే కృష్ణుడు. రాట్నమే వేణువు. తన్మధురధ్వని వంశీనాదము. భారతదేశము బృందావనము. ప్రజలు గోపికలై యాయన చెప్పినట్లే కోట్లకుకోట్లుజనులు గుమిగూడి యనులంబించ జొచ్చిరి. దేశమునందింగ్లీషు చదువన్నను, పాశ్చాత్య సంప్రదాయానుసరణమన్నను నిరాదరణ కలిగెను."[7]

## 5.2 సమకాలిక సామాజిక వ్యవస్థ–వచ్చిన మార్పులు :

ఇలాగా ఆనాటి సామాజిక, రాజకీయాది పరిస్థితులు వివిధ విమర్శకులు వివరించారు. కాని వీటినన్నిటిని ఇతర ధార్మిక ఆర్థికాది పరిస్థితులను విశ్వనాథవారు ఎలా తమ నవలలో చిత్రించారో క్రమంగా పరిశీలిద్దాం.

రామేశ్వరశాస్త్రి ధర్మవంతుడు; దాత; శ్రుతిస్మృతులు పఠించినవాడు; కొంత కర్మిష్ఠి యజ్ఞయాగాదులు చేయకపోయినా నిత్యాగ్నిహోత్రి. ఆయన చేతికి దానవిషయంలో ఎముకలేదు. దేవాలయాల పునర్నిర్మాణంలో, ఇతర నిర్మాణాలలో ఎంతో ఖర్చుపెట్టిన భగవద్భక్తుడు. నాలుగు వర్ణాలవారిని పెళ్ళిచేసుకున్నాడు ఒక వారాంగనను ఉంచుకొన్నవాడు జమీందారు కృష్ణమనాయనికన్న దివానైన రామేశ్వరశాస్త్రి కీర్తి దశదిశల వ్యాపించింది. నిరతాన్నదాత. ఏమైతేనేమి ? అప్పులు చేయవలసి వచ్చింది చివరికి. అప్పులవాళ్ళ బాధలు యముని బాధలకన్నా ఎక్కువయ్యాయి.

"ఇంతకు నది ప్రాత దినములు పోవుచుఁ గ్రొత్త దినములు వచ్చుచున్న సంధి వేళ. ప్రాత మర్యాదలు పోవుచుండెను. ఇంగ్లీషు చదువు సబ్బన్నపేట లోనికిఁగూడ వచ్చెను. దానితో స్వాతంత్ర్యము వ్యక్తిగౌరవము కనంబడుచుండెను. మరియాదలలో పూర్వపు పద్ధతులు పట్టవు. శాస్త్రిగారచ్చముగాఁ బూర్వయుగమువారు"[8] ఊళ్ళోనివాళ్ళను శాస్త్రి పురుషులను 'ఏమిరా' అని, స్త్రీలను 'ఏమే' అనీ, అనేవాడు. జమీందారు కుమారుడు రంగారావును సైతం 'ఏమిరా నాయనా' అనేవాడు. అది పూర్వ స్థితి. శాస్త్రి లేమిలో అతన్ని అసహ్యించుకోని వారేలేరు చివరికి తన పల్లనే వాగు వడ్డ, దాప మరది 'గంగాధర సోమయాజి' సైతం పలుచించు

కొన్నా డంటే శాస్త్రి ఎలాంటి వాడో గమనించవచ్చు. చివరికి లేమిలోనే మరణిం చాడు. "బ్రతికి యున్నప్పుడు చేవెలితి పడియున్నప్పుడు వాకిలిఁ దొంగి చూడని వారందఱు నేడు బంధువులై కాకులట్లు గుమిగూడిరి తెల్లవాఱు వరకుఁ గొంప యంతయుఁ జుట్టములన్నవారితోఁ గిటగిటలాడిపోయెను."9 అపరకర్మ కృష్ణమ నాయని ధర్మమాఅని సర్వసమృద్ధిగా జరిగింది. గోదానం, వృషోత్సర్జనం, షోడశ దానాలు, బ్రాహ్మణ సంతర్పణలు, సంభావనలు అన్నీ లోపంలేకుండా జరిగాయి. ఆ వెనుక కృష్ణాపుష్కరాలలో సైతం ధర్మారావు కర్మలుచేసి వచ్చాడు. రంగాజమ్మ మరణానంతరం సైతం రామచంద్రరాజు, అరుంధతీ మరణానంతరం ధర్మారావు కర్మలుచేయడం జరిగింది. ఇదేరీతిగ హరప్ప స్వతంత్రుడై తల్లికి, నాయనమ్మకు కర్మలు చేశాడు భగవద్భక్తి హెచ్చింది. ధర్మారావుతోకలిసి మాఘస్నానాలు చేశాడు యోగసాధనలో ప్రాణత్యాగం చేశాడు. హరప్ప జమీందారీ పురావైభవాన్ని వెలిగించి పోయాడు. దీనికి కారకుడు, ప్రేరకుడు ధర్మారావు. ధర్మారావు మాటల్లో పూర్వ సంప్రదాయాలు స్పష్టమౌతాయి. "రంగాజమ్మగారిని జూడుము : ఆమె పూర్వపు భావోన్మాదము, పాతివ్రత్యము పత్నీస్వచ్ఛతలకు నిదర్శనలకు చిహ్నమైన మూర్తి. అవియన్నియు నామెతో నంతరించినవి. కృష్ణమనాయుడుగారు పూర్వ రాజ చిహ్నము. ఆయనతో నదిపోయినది. దేవదాసితో దేవదాసీత్వము నశించి పోవును మీతో రాజ్ఞీత్వమే నశించును. తెనుఁగు సంప్రదాయమెఱిగిన రాణి మీతోనే యాఖరు. నేను మీయందఱను నశించిపోవుచుండగాఁ జూచుటకుమాత్రము పుట్టిన మూర్తిని. నేనును నీకాలమునకు తగిన వాడనుగాను. ఇవియన్నియుఁ జచ్చిపోవు చున్న యొక జాతి చివరి మెఱవులు."10

కూచిపూడి వేషాలు, కూచిపూడి ప్రహ్లాదనాటకం, కూచిపూడి సంప్రదాయం పురాణాల గొప్పదనం, గోప్రాధాన్యం మన పూర్వ హస్తకళలు మొదలైనవన్నీ నశించి పోయాయంటాడు ధర్మారావు. వీటికి సంబంధించిన సర్వవిషయాలు సూక్ష్మాతిసూక్ష్మంగా విశ్వనాథవారు చిత్రించారు.

చివరికి మడి ప్రాధాన్యాన్నిగూర్చి ధర్మారావు పశుపతితో ప్రసంగించిన తీరు "మడికట్టుకొనుమనుము. పరిశుభ్రముగా నుండవలయునుగాని మడిలో నేమున్న దనును. పరిశుభ్రముగా నుండుటలో మాత్రమేమున్నది ? అసహ్యముగానున్నచో నన్నము సహింపదు.... నేను నాగరికుడను. నాకుఁ బరిశుభ్రముగా నుండవలయునను.

పరిశుభ్రముగా నుంచుట నాగరకతయైనచో భోజనము చేయువేళ మడిబట్టయని, దానితో నింకెవనిం దాంకనన్ను నియమముగానుంచుట మఱియు నాగరకతయేమో! మురికియుంచుట లేకపోవుట లోని తారతమ్యము ప్రత్యక్షము. దేవుడున్నాడందు వేని యది యప్రత్యక్ష విషయము. లప్రత్యక్షమై బుద్ధినుంతునిచేత నూహింపబడు నదియే మతము అదియే దివ్యము."[11] అని మడి నుంచి మతంవరకు సాగింది. ఇది పూర్వ సంప్రదాయంలోని భాగమే.

ఇక నవలలో వర్ణితమైన ధార్మిక స్థితిగతులు తెలుసుకొందాము. సుబ్బన్న పేట కేంద్రస్థానం. అది తెలుగుగడ్డకే కేంద్రబిందువు.

"వీరన్న నాయని వంశమువారు స్వామికిం బ్రతినిధులు బ్రాహ్మణ వంశము వారు ప్రచారకులు. కాపు వంశపు టాడపడుచులు స్వామి వ్యాఖ్యాతలు. ఈ రీతిగా భూమ్యాకాశముల మధ్య స్వర్గ మర్త్య లోకముల మధ్యం బ్రత్యక్షా ప్రత్యక్షముల మధ్య నొక స్థిరమయిన సంబంధ మేర్పడెను.

"పైని భగవంతుడు, క్రింద రాజును, బ్రాహ్మణుడును. ఈ రెండు మహా సంస్థలకు మధ్య గణాచారి త్రెంచరాని లంకె.

"ఇది నాల్గు స్తంభముల ధర్మ మంటపము. స్వామి, జమీందారు, బ్రాహ్మణుడు గణాచారి వీరు నల్గురు స్తంభములు."[11]

"ధర్మారావున కొక్కసారిగం దన తండ్రి మూర్తి గోచరించెను. ఆయన వర్ణాశ్రమ ధర్మము లన్నియు ముద్ద కట్టిన మూర్తి. ఆయన భారత దేశముయొక్క యాత్మ, ఆయన త్రయీ విద్య యొక్క వ్యాఖ్యానము"[13] ఇది గిరిక తనని 'అన్నా'! అని పిలిచి నంతనే ధర్మారావుకు గోచరించిన తీరు.

"తరువాత (కృష్ణమ నాయుడు, ధర్మారావు) సుబ్రహ్మణ్యేశ్వర స్వామివారి యాలయమునకుం బోయిరి. రాజునకు స్వామి రాత్రి కలలో గన్పించినట్లుగానే తోంచెను. ఒక ధర్మము మీద వేయి సంస్థలు వెలసినట్లు స్వామి ఏక శరీరముపై సహస్ర శిరస్సులు ప్రకాశించెను.

"ధర్మము, తదాచరణ ప్రచారములు మూడును నొకటిగానై యభేద తాదాత్మ్యము పొందునటుల స్వామియు, ప్రభువును ధర్మారావును నేకదేశ గతులై ప్రకాశించిరి. అది యేమో తరములకు త్రెంచరాని సంబంధము. ముగ్వురును

మనసా యనుభవించిరి. ఆనాటితో వారి యా సంబంధము క్రొత్త ముడి వేసు కొన్నట్లయినది"[14]

"ధర్మారావు నిలచి గణాచారి కనులలో జూచెను. గణాచారి నిలబడి 'ఏమట్లు చూచెదవు ? రాజు చెడి పోయినాడు. వేయి శిరస్సుల నాగరాజు గలలో స్ఫురించి నది" అనెను,

"ధర్మారావు మాటాడకుండ నాలయాభిముఖుడై చనెను. గణాచారి అతని ననుసరించెను.... గణాచారి 'సరిపోయినదా ? ఒక కోడూడినది నీవును, నేనును మిగిలియున్నాము' అనెను. ధర్మారావునకు గృష్ణమనాయుడు కనులలో నాడెను. నాయడమృతమూర్తి యగుటచేత ధర్మారాయని కన్నులు నీళ్ళతో నిండెను."[14] ఇది ధార్మికస్థితి. ఈ స్థితికి ప్రధానవ్యక్తుల్ని రచయిత వివరించారు. గణాచారి పాత్ర నవలలో ప్రముఖమైందే. గణాచారి త్రికాలవేది రాబోయే సంగతులు తెలుసు కొంటుంది కలలో. తదుచితరీతిని నడచుకొంటుంది. ఈవిషయాలన్నీ పూర్వోక్తమే. నమ్మినవారికివన్నీ తెలుస్తాయి. కానీ నమ్మనివారికి ఇవన్నీ పిచ్చి చేష్టలనిపిస్తుంది. క్రమంగా పాశ్చాత్య నాగరకతా వ్యామోహంలో పడిన ప్రజలలో మన సంప్ర దాయాలమీద, ఆచారాలమీద నమ్మకం సడిలిపోతూ వచ్చింది. తదనుగుణంగానే గణాచారి మహత్తులోనూ మార్పు కనిపించనారంభించింది అంటే అది మనదృష్టి దోషమేనన్నది రచయిత అభిప్రాయం. గణాచారి మహిమనుగూర్చి మనమింతకు ముందే కొంత తెలుసుకున్నాము. ఆమె త్రికాలవేది మాత్రమే కాదు. ఆమె తలచి నచో ఏమైనా ఉపద్రవాలు సంభవించవచ్చు.

"....ఆధునిక నాగరికతా చిహ్నములైన వస్తువు లెచటనున్నను నాగమ్మ [గణాచారి] దూరదూరముగాం బోవును. రంగమ్మ [రంగయ్యభార్య, గణాచారి వదిన] కోపగించుకొనును.

"ఒకనాడు రంగమ్మకుం బాఠము చెప్పుటకు వచ్చిన క్రైస్తవ స్త్రీ తాను వచ్చినంతనే నాగమ్మ దొడ్డిలోనికిం బోవునేమని యడిగెను. రంగమ్మ 'యామె గణాచారి' యన్నది క్రైస్తవి నవ్వెను. రంగమ్మయు నవ్వెను. తరువాత గణారి నిద్దఱును గలిసి యేమనుకొనిరోగాని, రంగమ్మ రెండవకొడుకు వాకిటనున్న వేపచెట్టు వంగలలోనెక్కి క్రిందపడెను. వానికి గాలు విరిగినది. కాలు నెమ్మదించువఱకును రంగమ్మకు చదువు సాగలేదు. మఱియొకనాడు క్రైస్తవి నాగమ్మను బిలిచెను.

నాగమ్మ కన్నులెఱ్ఱజేసి జూచెను. క్రైస్తవి భయకంపితయై యానాడుపోయి జ్వర పడెను. ఆ జ్వరము మశూచికములోనికి దించెను. అప్పటినుండియు నామె రంగమ్మ యింటికి రాలేదు. మఱొక క్రైస్తవి వచ్చుచుండెను ఆ పూర్వవృద్ధ్రీ యామెతో 'గణాచారితో మాట్లాడకు'మని మందలించి పంపించెను."[15] ఇలాగే పాశ్చాత్య వ్యామోహితఅయిన రంగమ్మ గణాచారిని లెక్కచేయక పోవడంవల్ల రంగమ్మకు సైతం అనేకానర్థాలు కలిగాయి. దొడ్డిలో పాము కనిపించడమూ, స్పృశించడమూ, దానివల్ల ఆమెపడ్డ వేదనా అన్నీ వర్ణితం. అయినా క్రమంగా గణాచారి మహిమ తగ్గిపోతూ వచ్చింది. పూర్వ గణాచారులందరికి వృద్ధాప్యం రాలేదు. కాని నాగమ్మకు వృద్ధాప్యం రావడమూ, తలకురులు నరవడమూ, జడలు కట్టడమూ, చివరికి తల గొరిగించుకోవడమూ, పాకలో యోగనిద్రలోనే పాక తగులబడగా మరణించడమూ జరిగాయి. సుబ్బన్నపేటలో అనేకానర్థాలు జరిగాయి ఆమెవెనుక. పాశ్చాత్య వ్యామోహితుడైన పసరిక పాముగాబుట్టి మనిషిగామారి చివరికి పాముగానే మరణించడం గమనించదగ్గ సంగతి

గిరిక భక్తి మార్గంలో ముక్తి పొందిన మహనీయ. గిరిక తపస్సునుగూర్చి ధర్మారావు మాటలు, "ఇదియు కళా తపస్సు. ఈ తపస్సు నాకు ధ్యానము – రాగము; జపము – తాళము, స్నానము – నృత్యము; ఇది నిత్యము సమాచరించ వలయును దేవదాసి మనల నందఱను పునీతులను జేయబోవుచున్నది"[16] గిరిక వేణుగోపాలస్వామికి అంకితం తన్ను తాను చేసుకొన్నది.

"ఇద్దఱి వలెనే కూడి యెవరున్నారో తెల్పరా
ఒద్దికతో మనవలె నున్నారా ! మువ్వ గోపాలా !
ఇద్దఱి వలెనే కూడి యెవరున్నారో తెల్పరా

అనే మువ్వగోపాల పదం పాడి, అభినయించడంలో ఆమె భక్తి పారవశ్యంలో వేణుగోపాలస్వామి దర్శనం ఆమె నిత్య కృత్యం. ఇదే విధంగా ఎన్నో క్షేత్రయ్య పదాలు అభినయించి, భక్తి తత్పరతని ప్రకటించిన మహా భక్తురాలు వారాంగన రత్నగిరికి జన్మించినా ఆమె భక్తి అమేయం ఈ విషయాన్ని విశ్వనాథవారు వేణుగోపాలస్వామి కల్యాణోత్సవాలు హరప్పచేత పురా వైభవం వెల్లివిరిసేలా చేయించిన సందర్భాలలో దశావతారాభినయం గిరిక చేసిన తీరులో ధర్మారావు, అభి నయజ్ఞాన వేతృత్వం అంటే విశ్వనాథవారి అభినయ వేతృత్వం స్పష్టం.

క్షేత్రయ్య మువ్వ గోపాల పదాలు, శ్రీకృష్ణ లీలా తరంగాలు ఎన్నో ఆడి పాడి అభినయించి వేణుగోపాలునిలో ఐక్యం చెందుతుంది గిరిక. ఇదొక స్వాప్నిక జగత్తు. మనం సైతం దశావతార వర్ణనల్లో గిరిక అభినయంలో ఆ యానందోత్సాహంలో సర్వస్వమూ విస్మరించి సునందరమూ గిరికలమే అయి తీరుతాము. పాఠకులు తాదాత్మ్యం చెందడం అంటే కవి కృషి సఫలమయిందని అర్థం. ఇది ముదావహ విషయం. గిరికతోపాటు, భోగప్పశాస్త్రి గాయత్రీ పఠనం వల్ల భక్తి భావన కలిగి ఉండటం – ఇవన్నీ మనోజ్ఞం.

ఇలాగా సంప్రదాయాల్లో, ఆచారాల్లో, ధార్మిక వ్యవస్థలో వచ్చిన మార్పుల మూలంగా అనేకానర్థాలు కలిగినట్లు విశ్వనాథవారు వివరించారు కాని వీటిలో కొన్నింటిని ప్రశ్నిస్తున్నారు శ్రీ ఆర్. ఎస్. సుదర్శనంగారు తన వ్యాసంలో.

"విశ్వనాథ మనోహరంగా చెప్ప బూనుకొన్నది హిందూ సంఘ మతాచారములు, తజ్జాతియొక్క ఆంతర జీవితము, తద్భావముల ఆచరణము అనేది నిర్వివాదాంశము ....

"నవలలో హిందూ వ్యవస్థా ధర్మమునకు ప్రతీక వేయి పడగల పాము, సుబ్రహ్మణ్యేశ్వరుడు; కాని వ్యవస్థా ధర్మమునకు అతీతమైనదీ, మౌలిక మైనదీ సనాతన ధర్మము. దానికి ప్రతీక శివలింగము.

"ధర్మానికి ప్రతినిధి ధర్మారావు. ఏ ధర్మానికి ? వ్యక్తిధర్మానికా ? వ్యవస్థా ధర్మానికా ? సనాతన ధర్మానికా ?.... సనాతన ధర్మాన్ని (పూర్వజన్మ సుకృతంవల్ల కాబోలు) దర్శించినజ్ఞాని అని రచయిత అభిప్రాయం. అతను వ్యవస్థాధర్మానికి సాధికార వ్యాఖ్యాత; లోకవ్యవహారానికి సాక్షీభూతుడు. అని రచయిత ఉద్దేశం. అతనిది ఆజన్మ సిద్ధమైన జ్ఞానమార్గం. భక్తిమార్గంలో గిరికటా, కర్మమార్గంలో హరప్పుడు నెరవేరాయేమో పరీక్షిస్తే తెలుస్తుంది లోకవ్యవహారానికి కేవలం సాక్షీభూతుడు అయేందుకు నిర్లిప్తత ధర్మారావు మన స్తత్వంలో లేదు. దాన్ని సాధించే పరిస్థితులూ అతని జీవితంలోలేవు.... హిందూ వ్యవస్థాధర్మానికి వ్యాఖ్యాతా సొంతదారూ అనుకోవడంతో దానితో తాదాత్మ్యత చెందిన అతని అహంకారము గోరంతలు కొండంతలుగా ప్రస్ఫుటమైంది.

"సనాతన ధర్మము, వ్యవస్థాధర్మము, వ్యక్తిధర్మము ఒకటికావు, వేర్వేరు. ఈ విభేదాన్ని స్పష్టంగా లక్షిస్తూ అమూడింటి మధ్యగల సంబంధాన్ని నిరూపించే

తాత్వికదృష్టిని వస్తువిన్యాసంలో రచయిత పాటింపక పోవడం వల్ల నవల కావ్యాత్మ సనాతన ధర్మ నిరూపణము కాదని తెలుస్తున్నది.

"ఇది నాల్గు స్తంభముల ధర్మ మంటపము. స్వామి, జమీందారు, బ్రాహ్మణుడు, గణాచారి వీరు నల్గురు స్తంభములు." ఒక ధర్మము మీద వేయి సంస్థలు వెలసినట్లు స్వామి ఏక శరీరంపై సహస్ర శిరస్సులు ప్రకాశించెను.

.... .... "రాజు ధర్మాచరణకు, బ్రాహ్మణుడు ధర్మ ప్రచారమునకూ ఉద్దేశింపబడినట్లు చెప్పుట గమనింప దగినది. ధర్మారావు తండ్రి రామేశ్వర శాస్త్రి".... వర్ణాశ్రమ ధర్మము లన్నియు ముద్ద కట్టిన మూర్తి. ఆయన భారతదేశము యొక్క యాత్మ. ఆయన త్రయీ విద్యకొక వ్యాఖ్యానము. ".... అను మాటలకు సమర్థన ఎటువంటిది ?.... ఆయన భోగికాని యోగికాడు.... ఆయన పాటించిన నాలుగు ఆశ్రమ ధర్మములు ఏమిటి ? గృహస్థుగానే మరణించాడే ! ఈ విధంగా చూచిన రామేశ్వర శాస్త్రి ఒక విశిష్టవ్యక్తియేకాని 'బ్రాహ్మణుడు' అన్న ఆదర్శానికి పూర్తి నిరూపణ కాదు. ఆయన చేసుకొన్న వర్ణాంతరవివాహాలు వర్ణధర్మాన్ని సమర్థించేవికావు. అందుకు భిన్నమే !.... పోతే ధర్మారావుకూడా 'బ్రాహ్మణత్వం' అంటే కేవలం ధర్మప్రచారమేనా ? ఈవిధంగా తర్కిస్తే నవలలో వ్యవస్థాధర్మ నిరూపణము అసంతృప్తినే కలిగిస్తోంది అంటే ఆకృతికి (form) తగిన పుష్టి (substance) జరగలేదనిపిస్తుంది".... వారిలోని మానవత్వానికి దాని విశిష్టతకూ, ప్రతినిధులేతప్ప సమాజంలో బ్రాహ్మణవర్గానికి వారు ఏవిధంగానూ ప్రతినిధులుకారు. అలాగే దేవదాసీ వ్యవస్థకూ ఆవర్గం మనుష్యులకు రత్నగిరీ, గిరికా ఏవిధంగానూ ప్రతినిధులు కావు. వారిలో ప్రకాశితమౌతున్నది వ్యక్తిగతమైన విశిష్టతే !"....

"ఏతావాతా తేలేదేమిటంటే, హిందూ వ్యవస్థయొక్క ఆదర్శాన్ని దాని పటుత్వాన్ని నిరూపించే ఉద్దేశమే 'వేయి పడగలు' కావ్యాత్మ అనడానికి, పాత్ర చిత్రణమూ, కథా గమనమూ దాని స్ఫూర్తి అందుకు భిన్నంగా ఉన్నాయి .... ధర్మారావు సిద్ధాంతం రీత్యా ప్రతిపాదించిన కొత్త మార్గంలో సమన్వయ పథం ఏమీలేదు, అతనికి కొత్త ఒకరోత, పాత ఒక నీతి !"[17] ఇది సుదర్శనం గారి విమర్శ. అయినా "(ధర్మారావు) అచ్చమైన తెలుగు వాడు వ్యవస్థా ధర్మానికీ, యోగమార్గానికీ ప్రతినిధిగా తృప్తి కలిగించక పోయినా తెలుగుదనం ముద్ద

కట్టిన మూర్తి ధర్మారావు. అతని మనస్సు ద్వారా మారుతూ వచ్చిన తెలు దేశాన్ని, గతించిన వ్యవస్థనూ దర్శించే అవకాశం 'వేయి పడగలు' కల్గి స్తోంది"[18] అని సంతృప్తి వ్యక్తపరచారు. ఇవన్నీ పూర్వోక్తం. పునరు అయినా, స్పష్టతకోసం ఉల్లేఖించ వలసి వచ్చింది.

5 3 పాశ్చాత్య నాగరికత – సామాజిక స్థితిగతులు – మార్పులు :

పాశ్చాత్య నాగరికత మూలంగా అనేక పరిణామాలు దేశమంతటా వచ్చాయి సుబ్బన్నపేటలోను కలిగినది. రంగారావు – పాశ్చాత్య నాగరికత, పాశ్చాత్య సంప్రదాయాలపై వ్యామోహం కలవాడు. చాలావరకు ఇంగ్లీషువారి మధ్యన చెన్న పట్నంలోను, ఇంగ్లండులోను నివసించేవాడు. కాఫీ సేవనమూ, సుసానీ, లియా ట్రిన్సులను వివాహ మాడటం, పూర్వ సంప్రదాయంగల రాణీ సరోజినీని పట్టించు కోక పోవడం, తల్లి, భార్యలు మరణించిన సందర్భంలో కర్మలు చేయక పోవడం, దుఃఖ సూచకంగా నల్లకోటు ధరించడమూ; కర్మ కాండంతా "బ్రాహ్మణ కుత్సిత వృత్తి" అని నిందించడమూ, ఇంకా అనేకం ఆయనలోని లక్షణాలు. రంగారావు పట్టాభిషేకం నాడు సంప్రదాయానుసారంగా ఏనుగంబారికి బదులు మోటారుతో ప్రయాణం చేయడం సహించని లక్ష్మణ స్వామి అనే పట్టపేనుగు మరణిస్తుంది. అనేక పరిణామాలు పట్టాభిషేక సమయంలో చేయబడ్డాయి. "పదివేల రూపాయలు పెట్టి పంపులు పెట్టించి పట్టాభిషేక నగరమంతయు కుళాయిలు నిర్మించిరి. పదివేలు పెట్టి ఎలక్ట్రిసిటీ ప్లాంటు తెప్పించి యుంచిరి. ఆహ్వానముల కాగితము లచ్చువేయు టకే రెండువేల రూపాయ లయ్యెను. జనము బెజవాడ నుండి సుబ్బన్న పేటకు రాను పోను సరిక్రొత్త బస్సులు కొనిరి. వెయ్యి షెల్ పెట్రోలు డబ్బాలు కొని సగము సుబ్బన్న పేటలోను సగము బెజవాడలోను నిలువ జేసిరి. గ్రాండ్ ఇండి యన్ సర్కసు వారిచే రెండు ప్రదర్శనము లేర్పాటు చేయబడెను"[19]. అలాగే గోత కూచిపూడి నాటకాలు మొదలైన జాతీయ కళలన్నీ మోటు అని వాటిని వదలి పెట్టారు.

ఈ కాలంలోనే నాగేశ్వరరావు దివానై అనేకమైన మార్పులు కోటలో కేశాడు..

రంగారావుకు జబ్బు పడ్డప్పుడు డాక్టరును పిలిపించారు. అతడు ధూమపానం చేస్తూఉండగా ఆవిడ సహించలేకపోయింది. ఆవిడ మాటలు అర్థవంతంగా - కని పెంచాయి ధర్మారావుకు. ధూమపాన వ్యామోహం ఎక్కువయింది[20]

రాణి సరోజినీదేవి భక్తురాలుగా మారిపోయి జబ్బుపడ్డా పాశ్చాత్య వ్యామోహితుడై రంగారావు రాణిని చివరిదినాలలోనైనా చూడలేదు.

పురపాలక సంఘం ఏర్పాటైంది సుబ్బన్నపేటలో. ప్రజలే అధికారులు. జమీందారుల అధికారం తగ్గిపోజొచ్చింది. చదువురానివారు సైతం అధికారులయ్యారు.[21] "పూర్వము గ్రామములోని ప్రతిచీమయు జమీందారునాశ్రయించి యుండెను. ఇప్పుడు ప్రతిచీమయు స్వతంత్రము. వ్యక్తివికాసము, జాతి వికాసమునకు హేతువనుట నిర్వివాదాంశముగదా!"[22] పురపాలక సౌధ నిర్మాణం జరిగింది. పురపాలకసంఘానికి ఎన్నికలు జరిగాయి. డబ్బు అధికంగా వెదజల్లారు ఓట్లకోసం. ఇది ఆనాడే ఆరంభమైంది. ఈనాడు కొత్తకాదు. చంద్రారెడ్డి ఎన్నికయ్యారు.[23]

సుబ్బన్నపేట విస్తరించింది. కొత్తఇండ్ల నిర్మాణం జరిగింది సినిమా కాఫీ హోటళ్ళు వెలిశాయి. వాటివల్ల ఉపయోగానికిబదులు చెడే ఎక్కువైంది. మర బియ్యం వచ్చాయి. వాటి అనర్థమెంతో తెలిసిపోయింది.[24]

రైలు వచ్చింది. ప్రయాణాలు సుకరమయ్యాయి చేలు. ప్రకృతివైభవం నశించింది.

గుంటూరులో కుగ్లర్ హాస్పిటల్ నిర్మాణమైంది. ఇస్త్రీమడతల గుడ్డలు ధరించనారంభించారు ప్రజలు.

రాఘవపతి మిత్రులతో సంఘం ఏర్పాటైంది. విద్యాప్రేమ సంఘం ఒకటి వచ్చింది. మంగమ్మ రాఘవపతులు కలిసివుంటూ వచ్చారు. నిర్బంధ విద్యావిధానం వచ్చింది కులవృత్తి ప్రాధాన్యంతగ్గి, విద్యావిధానంవల్ల ఆడపిల్లలు చెడిపోతారంటారు ధర్మారావు.[25]

సుబ్బన్నపేటలో విద్యుద్దీపాలు, కుళాయిలు వెలిశాయి. స్త్రీ సమాజం ఏర్పడింది. సామాజికౌన్నత్యం ఏర్పడింది మంగమ్మలో మార్పువచ్చింది. రంగయ్య భార్య ఇంగ్లీషు చదువు, పాశ్చాత్యవ్యామోహంలో పడిపోయింది.

కృష్ణ నీరు పల్నాటి సీమకు, రాయల సీమకు అవసరమని మంగమ్మ ఏనాడో వాదించింది.[26] ఇది ఈనాటిది కాదు. అప్పుడే నిజమైన అభివృద్ధి జరుగుతుందని అభిప్రాయం వివాహాల గూర్చి, బాల్య వివాహాల గూర్చి వివరించ బడింది. శారదా చట్టాన్ని సైతం ధర్మారావు అంగీకరించలేదు.

"అయినప్పటికి పాశ్చాత్య నాగరికతా ప్రభావం ముప్పైఏళ్ళలో ఏ విధంగా తెలుగువారి జీవన విధానంలో ఒడిదుడుకులకు, అవకతవకలకు, హేతువైందో విపులంగా విమర్శనా దృష్టితో పరిశీలింప బడటం, కావ్యాన్ని ఉపరూపమైనదిగా జేస్తుంది అలా చేస్తే 'వేయి పడగలు' ఒక చిన్న సైజు విజ్ఞాన 'సర్వస్వం' అనిపిస్తుంది. నాగరికతా చిహ్నాలు : రైలు మార్గం ఏర్పాటు కావడం, మునిసిపాలిటీ: జాతీయ కళాశాల, క్రైస్తవుల కాలేజీ, సినిమా, తాలూకాబోర్డు, నాటక సమాజాలు, నిర్బంధ ప్రాథమికవిద్య, కొళాయిలు, ఎలక్ట్రిసిటీ, మహిళాసమాజం, కృష్ణాంధ్ర పత్రికలు, క్రొత్తమతాలు : శేషభిమతం, దివ్యజ్ఞాన సమాజం, విధిప్రేమ; ఆర్థిక వ్యవస్థలో మార్పులు : మెరకపొలాలు మాగాణి కావటం, పొగాకు ఫ్యాక్టరీ ఏర్పడటం, డబ్బుచెలామణీ, వీటి అన్నింటిమీదా ధర్మారావు వ్యాఖ్యానం వినవచ్చు. అన్నింటికీ ధర్మారావు ప్రతికూలుడే దివ్యజ్ఞాన సమాజం అతణ్ణి ఆకర్షిస్తుంది. కాని దానికి పాశ్చాత్యులైన లెడ్‌బీటరు, బీసెంటు అధినేతలు కావడం, శివరావు తమ్ము కృష్ణావతారం అని చెప్పుకోవడం, ధర్మారావుకు నచ్చని విషయాలు ధర్మారావు శారదా చట్టానికికూడ వ్యతిరేకి. ఆంగ్లసారస్వతం చదువుకొన్నా దానిపై అతనికి ద్వేషమేనట "[28] అని ఆర్. ఎస్. సుదర్శనంగారి నిశిత పరిశీలన. ఇదిగూడా పూర్వోక్తమే.

ఈ విధంగా సామాజికమైన మార్పులు సుబ్బన్నపేటలో వచ్చాయి. అంటే తెలుగుదేశమంతటా వచ్చాయని భావం.

## 5.4 రాజకీయ పరిస్థితులు :

రాజకీయ పరిస్థితులు సైతం నవలలో చోటుచేసుకొన్నాయి. కొన్నింటిని ఇంతకుముందే ప్రస్తావించడం జరిగింది. మరికొంత వివరణ అవసరమని భావిస్తున్నాను. తత్పరిశీలనమే ప్రస్తుత ప్రసక్త విషయం.

"వేయి పడగలలో కనీసం ముగ్గురుపాత్రలు జాతీయోద్యమంలో చురునిగి

తెలిసినవారు ఓ.చిన్న పేటలో జాతీయ కళాశాలను స్థాపించిన కేశవరావు, ధర్మారావు స్నేహితుడు రాఘవరావు ఆ ఉద్యమంవల్ల ప్రత్యక్షంగా ప్రభావితులైనవారు. ఇక ధర్మారావు—ఆ ఉద్యమంఅంటే అభినివేశంఉండి ఆర్థికమైన కారణాలవల్ల దానిలో పాల్గొనలేక దాని సిద్ధాంతాలను ఆమోదించినవాడు."[29]

"అప్పటికి మహాత్ముడైన గాంధీ సహాయ నిరాకరణోద్యమము నారంభించి రెండేండ్లయినది జనులు గాంధీ దేవుడై యవతరించెనన్నారు. ఆయన కృష్ణుడు, రాట్నము వేణువు, తన్మధురధ్వని వంశీనినాదము. భారతదేశీయ నినాదము ప్రజలు గోపికలై యాయనచెప్పినట్లే కోట్లకుకోట్లు జనులు గుమిగూడి యుపలంభింప జొచ్చిరి. దేశమున యుద్ధముకాని యుద్ధమొకటి ప్రారంభమయ్యెను. ఈ మహా సంచలనముచూచి ఖండఖండాంతరవాసు లాశ్చర్యపోయిరి. దేశమున ఇంగ్లీషు చదువన్నను పాశ్చాత్య సంప్రదాయానుసరణమన్నను నిరాదరణ కలిగెను."[30] ఇది విశ్వనాథవారు జాతీయోద్యమాన్ని చిత్రించిన తీరు.

కేశవరావు జాతీయభావాల్ని, రాఘవరావు సహాయనిరాకరణోద్యమంలో చేరి పోరాడి కారాగారవాసం చేసిన అంశాన్ని ఇంతకుముందే తెలుసుకొన్నాము. మామగారు ఖద్దరుబట్టలు పెడితేతప్ప కార్యం సందర్భంలో పీటలమీద కూర్చోనన్నాడు రాఘవరావు. తనభార్యకు సైతం ఖద్దరుగుడ్డలేకొని వెళ్ళాడట. "దేశభక్తియన్నచో అట్లుండవలయును"[31] ఇది రాఘవరావు దేశభక్తి.

ధర్మారావుకు మంగమ్మ భక్తితో శుచిగా, జపంతో ఉంటున్నదని, ఆమెలో మార్పువచ్చిందని కుమారస్వామి చెబుతుండగా వారి సంభాషణ "ధర్మా:గూడెంలో గ్రతువు చేసినట్లున్నది. కుమా : మీరు గాంధీగారి యంతమోద్యమము నొప్పుకొనరేమి ? మీరు చాలా పూర్వాచారపరాయణులు. పంచములు సంగతి యొప్పుకొనక పోవుట బాగుగాలేదు. ధర్మా : నేనే మొప్పుకొనలేదు ? వాండ్రందఱును గూడెములలో గుడిసెలలో బ్రతుకుచుండగా దేశోద్ధారకులను వారికిండ్లు కట్టిపెట్ట వద్దంటినా ? ...... దేవాలయములలోనికి వారిని రానిత్తుమందురు. వ్యయములేని పనిగదా : ఊరిమీద ఊరుపడినను గరణముమీద గానుపడదు."[31] అని ఇలా సాగుతుంది వారి సంభాషణ. దీన్ని చూపే ధర్మారావు పాత్రనుగూర్చి సుదర్శనంగారు ఇతఃపూర్వం పేర్కొన్నట్లు నిశితంగా విమర్శించడం జరిగిందని స్పష్టంగా తెలిపాను.

రాఘవరావు సుబ్బన్నపేటకువచ్చి ధర్మారావుతో నివసిస్తుండగా అక్కడ మధ్యపాన దోషాన్ని ధర్మారావుతో కలిసి చాటిచెప్పాడు. ఇదికూడ స్వాతంత్ర్యోద్యమంలో భాగమే. ఇలాగా రాజకీయ పరిస్థితుల్ని విశ్వనాథవారు వివరించారు నవలలో.

6.5 ఆర్థిక పరిస్థితులు :

ఆనాడు దేశంలో వచ్చిన ఆర్థిక స్థితిగతుల్ని సైతం చక్కగా వివరించారు నవలలో విశ్వనాథవారు.

తండ్రి మరణానంతరం ధర్మారావు పెద్ద దారిద్ర్యం అనుభవించాడు. గుంటూరులో సంసారం పెట్టినప్పుడు పడ్డ ఆర్థికమైన ఇబ్బందులకు అంతులేదు. ఆ మారుతున్న రోజులలో కంట్రోలు విధించ బడింది. కిరసనాయిలు లభించడమే కష్టమయి పోయింది. దానికి తోడు కలరా వ్యాధి వ్యాపించింది.

సుబ్బన్న పేటలో వచ్చిన మార్పుల మూలంగా రైతులపై పన్నుల భారం అధికమైంది. మెట్టచేలన్నీ మాగాణం కావటంతో ఇది సంభవించింది. ఈ ఆర్థికమైన బాధలు జనాన్ని పీడించాయి. "సుబ్బన్న పేట పూర్వము వలె గాదు బస్తీకళ వచ్చి పడినంతనే ప్రతి వస్తువు ప్రియమై పోయెను. మునుపు పదునేను రూకలతో సాగవలసిన సంసారమున కిప్పుడు పాతిక రూపాయలు కావలసి వచ్చుచుండెను. బియ్యము బస్తా యిరువది రూపాయలమ్ముచుండెను"[31] పొగాకు వ్యాపారమూ, పొగాకు ఫ్యాక్టరీ, కూలీ, విదేశ మారకం, దాని వల్ల డబ్బు విలువ తగ్గిపోయి వస్తువులు ప్రియం కావడం చిత్రితం. కాపిటలిజము [పెట్టుబడిదారీ విధానం] గురించి ధర్మారావు ఉపన్యాసంలో ఆర్థిక స్థితులు చర్చించ బడ్డాయి.[33] దొంగనోట్ల వ్యాపారం కేసుతో రామేశ్వరం జైలుపాలు అవుతాడు దొంగ అసిర పరిస్థితులు వర్ణితం.

5.6. మత పరిస్థితులు :

నవలలో హైందవ మత సిద్ధాంతాలన్నీ ఆ వ్యవస్థా పరమైన-వాటిని సముద్ధరించడం కోసమే అన్నట్లు భారతదేశ పురావైభవ మంతా వర్ణించ బడింది. ధర్మారావు పాత్ర అందుకు సృష్టించ బడింది మిషనరీల మూలంగా హైందవ మతాని

కేర్పడిన ధర్మ చ్యుతిని వివరించారు. అందువల్లే వేయి పడగల పాము రాజును కలలో కాటంమకొంది. పాశ్చాత్య నాగరికతా వ్యామోహంతో జమీందార్లు మొదలు మామూలు వ్యక్తులు దాకా మారిపోయారు.

ఈ సమస్త విషయాలు అనాడు ఎలా మారుతూ వచ్చాయో విశ్వనాథవారు వేయి పడగలు నవలలో చిత్రీకరించారు.

## సూచికలు

1. విశ్వనాథ సత్యనారాయణ : నేనూ నా సాహిత్య రచనలు – ప్రతిభ : మహతి – పు. 21
2 పై దే. పు. 19
3. డా॥ బి. వి. కుటుంబరావు : ఆంధ్రనవలా పరిణామము, పు. 377, 378.
4. విద్వాన్ తాటికొండ వేంకటకృష్ణయ్య, ముదివేడు ప్రభాకరరావు } బ్రాహ్మ్మమయమూర్తి పు. 153, 154
6. పై దే. పు. 209, 210, 211
7. వేయి పడగలు పు. 291
8. పై దే. పు 17, 18
9. పై దే. పు. 23.
10. పై దే పు. 197
11. పై దే. పు 585, 586.
12. పై దే పు 9.
13. పై దే. పు. 51.
14. పై దే. పు. 36
14A. పై దే పు 42
15. పై దే. పు. 644, 645.

16. పై దే పు 493
17. ఆర్. ఎస్. సుదర్శనం : నవ్యాంధ్ర సాహిత్యంలో దృక్పథాలు : భారతి, సెప్టెంబరు 1964.
18. పై దే
19. వేయి పడగలు–63, 64
20. పై దే పు. 178, 179.
21. పై దే. పు. 262, 263.
22. పై దే. పు. 265
23. పై దే. పు 279, 280
24. పై దే. పు. 438, 439.
25. పై దే. పు. 585
26. పై దే పు. 657
27. పై దే అధ్యాయం–36.
28. పై 17వ సూచికలోనిదే.
29. పై 5వ సూచికలోనిదే పు. 210
30. వేయిపడగలు – పు. 291
31. పై దే – పు. 692
32. పై దే – పు. 283
33. పై దే. పు. 870.

# 6. 0. వేయిపడగలు – శిల్పం

ఇతః పూర్వ ప్రకరణాల్లో వేయి పడగల్లోని ఇతివృత్తం, పాత్ర చిత్రణ. సమకాలిక పరిస్థితులు మనం తెలుసుకొన్నాము. ఈ ప్రకరణంలో నవలలోని, శిల్పాన్ని గూర్చి తెలుసుకోవలసి ఉంది. ఇందులో హడ్సన్ పండితుడు చెప్పిన నవలలోని షడంగాలలోని రచన లేదా సంభాషణ, భాష, శైలి అన్నవాటిలో విశ్వనాథవారు శిల్పాన్ని ఎలా పరిరక్షించారో వ్యక్తం చేయడం ముఖ్యాంశం. దీనితో పాటు కథాకథనం పాత్రచిత్రణ, తదుస్మీలనం, ధ్వని, ప్రతీకలు మొదలైనవన్నీ ఇందులో గతార్థాలవుతాయి. అంటే ఇవన్నీ ఇమిడి ఉన్నప్పుడే దాన్ని శిల్పమంటాము శిల్పం లలిత కళల్లో ఒకటి. అదివేరు. ఇక్కడ ప్రస్తుతాంశం కావ్య శిల్పం. అంటే ప్రధానంగా 'వేయి పడగలు' నవలా శిల్పమని అర్థం. దీని వివరణకు ముందు ఈ శిల్పాన్ని గూర్చి తెలుసు కొందాము.

6.1 శిల్ప నిర్వచనం : "అనులోదాత్తమనీష నేనుభయ కావ్యప్రౌఢి - పాటించు శిల్పమునన్ పారగుడన్ కళావిదుఁడ...."[1] నవి తిక్కన తన కావ్యశిల్ప పారంగత్వాన్ని, కళా వైదుష్యాన్నీ ప్రకటించు కొన్నాడు ఈ విషయాన్నే విశ్వనాథవారు

"ఋషివంటి నన్నయ్య రెండవ వాల్మీకి
తిక్కన్న శిల్పపుఁ దెనుఁగుతోఁట.[2]

అని తిక్కన్న శిల్పవైదుష్యాన్ని పేర్కొన్నారు, "ఈ కావ్యలక్షణము కావ్యశిల్పముతో కూడినది. శిల్పశబ్దము సునిర్దిష్టార్థకము కాదు. శిల్పమన్నమాట సారస్వతములోనికి గౌణార్థముగా తెచ్చికొన్నదికాని, సారస్వతమునకు సహజమైనది కాదు. తన కావ్యము శిల్పమని తిక్కన్న చెప్పినాడు. అచ్చటనైన నింతే.... రస భంగములేకుండ, ఔచిత్య భంగములేకుండ చేసిన రచన శిల్పము కాదనుటకు వీలు లేదు. కాని ఈశిల్ప శబ్దార్థము తదితరములైన విశేష విషయములందు సమన్వయించుట అధిక సమంజసము. రసౌచిత్యాది శబ్దములున్నప్పుడు శిల్పశబ్దమెందులకు? దానినే శిల్పమన్నచో పూకభ్యంతరములేదు. కాని శిల్పశబ్దము తదితరములైన వాని యందుపయోగించుట న్యాయము.

"మఱియు శిల్పమని మనము చెప్పిన విషయము బహుధా ప్రపంచితమైన యలంకార శాస్త్రములలో నేదో యొక విషయము కావచ్చును. అప్పుడు దీనికి ప్రత్యేకముగా నీ శిల్ప మన్న పేరేమి ?

"దాని శిల్పమిది. మహాకవి తాను స్వీకరించిన వస్తువునకు పరమౌచితము లైన తత్తన్మహావిషయములందలి సామగ్రి సంపాదనము చేసి తన కావ్యము పరమ శిల్ప ఖండముగా చేయును. ఈ కావ్య సౌందర్య మధికముగా భాసించుట తత్తద్భిన్న విషయ సంగ్రహణము చేతనగును. అప్పుడది శిల్పమని చెప్పవచ్చునేమో ?". "శిల్ప మనగా నొక మాటలో చెప్పినచో బహ్వర్థము లేకత్ర సమావేశ పఱచి పఠితయొక్క మనస్సును భావనా మయముచేసి, ఉత్పథమునందు సంచరింప జేయుట. ఈ బహ్వర్థములు బహుమార్గముల సంధాన పఱచవచ్చును. అది కవి యొక్క నైపుణిమీద నాధారపడి యుండును."[3]

"విజానికి శిల్పముకాని, సాహిత్యముకాని జాతీయమై యుండవలయును. విజాతీయమై ఉండరాదు. వ్రాసినవానికి ముక్తి, చదివినవానకి రక్తి, ముక్తి. ఎంత సముద్రము మీద ఎగిరినను పక్షి రాత్రి గూటికి చేరును. ఇది జాతీయత. ఇది సంప్రదాయము."[4]

"ఏ రచన అయినా రచయిత అనుభవాల మేరకు పరిమితమై ఉంటుంది. ప్రతి రచయితా తాను వ్రాయ సమకట్టిన భావాలను మనస్సులో నిర్దిష్టంగా రూపొందించుకొని రచనకు ఉపక్రమిస్తాడు. రచయిత మనోభావనలో ఆకృతి ఏర్పరచుకొన్న అనుభవాలను 'వస్తువు' అనవచ్చు. ఆ అనుభవాలనే అక్షర రూపంలో కళాత్మకంగా ఒక పద్ధతిని అనుసరించి రూపొందించగా ఏర్పడేది కృతి – రచయిత మనస్సుకే పరిమితమై ఉన్న అనుభవాలకు, ఆ అనుభవాలు సమగ్రమైన రూపంలో మనకు కనిపించే కృతికి మధ్యఉండే అంతరమే శిల్పం. అంటే రచయిత – రచన అనే ఒక సౌధాన్ని నిర్మించ దలచుకొంటే దానికి కావలసిన ప్రాథమిక పరికరాలను 'వస్తువు' అనీ, ఆ పరికరాలను ఉపయోగించి దానిని సమగ్రమైన కళాకృతిగా తయారు చేయడానికి శిల్పి లేదా ఇంజనీరు చూపిన ప్రతిభ, చాకచక్యం, నేర్పరితనం – వీనిని శిల్పంగా మనం పేర్కొనవచ్చు. బాహ్యాంతర రూపాల సమ్యక్ స్థాపమూ, సవ్యతా, ప్రతిష్ఠతా – వీటిని శిల్పం ద్వారా రచయిత సాధిస్తాడు. ఇవి లేని

రచన అంటూ ఉండదు ఫలానా నవలలో శిల్పం అసమగ్రంగా ఉన్నదనే చెప్పవచ్చు కానీ అసలు లేనేలేదని చెప్పడానికి వీలులేదు. అందువల్లనే ఒక రచనలో వస్తువు ఎంతముఖ్యమో శిల్పం కూడా అంతే ముఖ్యం రచయిత చెప్పదలచుకొన్న భావాలను వ్యాఖ్యానించడానికి వాటికి రచయిత ఉద్దేశించిన ఒక దృష్టిలో కొన్ని కల్పించి, ఆకోణం నుంచే పాఠకునికి కథను అందించడానికి రచయితకు శిల్పమే ముఖ్యమైన సాధనము"[5]

ఇంతోగాదు. విశ్వనాథవారు తమ నవల 'వేయి పడగలు'లోనే ఈశిల్పాన్ని గూర్చి చెప్పిన మాటలు ఉల్లేఖించడం ఎంతైనా సముచితమూ, సమంజసమూనూ.

"ఒక మహారచనయందు ప్రధాన వస్తువుతోఁ దదంగ విషయములు చక్కఁగా నతుకుట శిల్పమే. అదే పనిపెట్టుకొని యంగ విషయములు స్వల్ప పరిణామము కలవిగాఁజేసి మహా విషయములతోఁ బొందు పరచుట యొక విలక్షణమైన సృష్టి కావచ్చును. కాని యదే సృష్టిగాదు. అందమైన వస్తువును విస్తరింపించి దాని యందును ప్రత్యేకానందము కలుగునట్లు సృష్టించుట యింకొక రీతిశిల్పము. మహా మేధావి యింతమాత్రముచేత ప్రధాన కథ నందుకో లేక పోడు. ఒకా నొకని మొగమునందు సునిశితమైన తేజోవంతములైన నేత్రము లుండును. అవి తమ దీధితి చేతనితరముఖావయవములను దిరస్కరించును. వాని సొగసు వానిది – వాని చేతనే మొగము కూడఁ బ్రజ్వలించును. 'అబ్బే ! ఇవి ప్రధానమైన ముఖమున కొదిగి లేవు' అని వాని నెవరు తిరస్కరింతురు. పైగా వాని మొగములో నున్న సొగసంతయు వాని కన్నులలో నున్నదిరా ! యని మెత్తురు."[6]

దీని వల్ల శిల్పమంటే ఏమిటో నవలలో శిల్పం ఎలా ఉండాలో తన్మూలంగా ఆ నవల ఎలా శ్రేష్ఠతరం కాగలదో ఆ నవలా కారుడెంత ఉత్తమోత్తమ నవలా కర్త కాగలడో స్పష్టమవుతుంది.

## 6.2 వేయి పడగలలోని శిల్పం :

పై అంశాలన్నింటినీ దృష్టిలో పెట్టుకొని వేయిపడగలలోని విశ్వనాథవారు పరిరక్షించిన పలువిధాలైన నవలా శిల్పాన్ని పరిశీలిద్దాం.

6.2.1 ఇతివృత్తం :

ఇంతః పూర్వమే ఇతివృత్త నిర్వహణమనే ప్రకరణంలో కథావస్తువును స్వీకరించి ఏ విధంగా మనోహరంగా చిత్రించారో తెలుసుకొన్నాము ఈ ఇతివృత్తంలోని సన్నివేశ కల్పనంలో ఔత్సుక్య స్ఫోరకమూ, చదువాళ్ళన్న ఉత్కంఠ, అందుకై కథలో వేసుకొన్న పథకం ఆ ప్రధాన కథతో ఇతర ప్రాసంగిక కథలా ఎలా సమ్మేళనంతో సుస్పష్ట రేఖలతో నిర్వహించారో మనకు విదితమైంది.

ఎక్కడో కథామధ్య భాగంలోని విషయంలో ఉత్కంఠావహమైన రీతిని నవల ఆరంభించబడింది.

"వేయిపడగల పాము విప్పారుకొనివచ్చి కాటందుకొన్నది కలలోన రాజును" అనే గణాచారి గేయంతో సుబ్బన్నపేట వీధులలో కనిపిస్తుంది ఇది ప్రారంభం. ఇది పాఠకుల ఔత్సుక్యానికి అవకాశమిచ్చే సన్నివేశం అదేవిధంగా చిన్న అరుంధతి ధర్మారావుతో నేను "మిగిలితిని" అంటుంది. ధర్మారావు "అప్పను నీవు మిగిలితివి. ఇది నా జాతిశక్తి. నాయదృష్టము. నీవు మిగిలితివి" అని అంటాడు దీనితో వేయిపుటలకు మించిన నవల పరిపూర్ణమౌతుంది ఇంతలో ఎన్నో ప్రాసంగికేతివృత్తాలున్నాయి. మంగమ్మ కథ, రంగారావు కథ, శశిరేఖా కిరీటుల ప్రణయం, రాఘవరావు స్వాతంత్ర్యోద్యమంలో ప్రవేశించడం, సూర్యపతి, పశుపతి, కుమారస్వామి, కేశవరావు, శివరావు మొదలైన వారికథలు, జాతీయత, మన కళలు పాశ్చాత్య నాగరకత, తన్మూలంగావచ్చిన ఆర్థిక సామాజికాది పరిస్థితులూ, కుటుంబజీవనం మొదలైన ఎన్నో అంశాల్ని పొదిగి నవలాశిల్పాన్ని పరిరక్షించారు విశ్వనాథవారు. సందర్భోచితమైన వర్ణనలు, వ్యాఖ్యానాలు ఎక్కువగా ఉన్నమాట వాస్తవమే. అవేవీ నవల కథాగతికి అడ్డురావు ఈ విషయాన్ని చక్కగా వివరించిన ఆర్. ఎస్. సుదర్శనంగారి మాటలు ఉల్లేఖించటం అసమంజసంకాదు.

"వేయిపడగలు కాల్పనికోద్యమ కాలంలో వెలువడిన ఆత్మాశ్రయ కవిత్వ [Subjective Poetry] శాఖలో ఒక అపురూపమైన కావ్యం. దాని వైశిష్ట్యం అది వేయిపుటల నవలగా రూపొందటమే. తెలుగుదేశంలో శిథిలమై అదృశ్యమౌతున్న పూర్వ నాగరకతా చివరిమెరుగుల్ని చూచిన విశ్వనాథహృదయం సంక్షోభించి వెలువడిన సుదీర్ఘ నిశ్వాసమే 'వేయిపడగలు'. అవిశ్వాసంలో తొక్కత్రొక్కిన త్రాచు కస్సుమనటమూ, ఆశవదులుకున్న ప్రేమికుడి నిర్వేదమూ, అనుభూతమవు

మన్నవి. కావ్యంలో ఎంత నిస్పృహఉన్నా కావ్యాంతంలో 'ఒక మహానందరేఖ' కాకుగాని ఒక ఆశారేఖ ఉండనేఉన్నది. కాని అది సమాజానికి సంబంధించినదికాదు. వైయక్తికమైనదన్న విషయం గుర్తించాలి. వేయిపడగలు నవలకు ఆలంబనము ఒక తాత్విక దృక్పథముకాదు. ఒక వైయక్తిక హృదయోద్వేగము. కాని ఎటువంటి హృదయోద్వేగము ? దాని లయ, సంగీతము మహాసముద్రానివి. రామేశ్వరశాస్త్రి కృష్ణమనాయడు, రంగాజమ్మ, రుక్మిణమ్మారావు, సరోజినీదేవి పూర్వయుగపువారు, వారిస్మృతి తర్వాత గుండేరువరద, దేవదాసి, గోపన్న, అరుంధతి, హరప్ప పసరిక, గణాచారి కొత్తయుగము చివరి మెరుపులు. వారిస్మృతి తర్వాత గుండేరువరద మిగిలి నది ధర్మారావు, చిన్న అరుంధతి. మొదటి వరదనాటి రంగారావు పాశ్చాత్యయువతిని భార్యగా తెచ్చుటలోవచ్చిన కొత్తపోకడలు క్రమంగా ప్రబలమై రెండవ వరదనాటికి క్షీణించి తగ్గుముఖం పట్టినవి. రెండు గుండేరువరదలూ విభజన బిందువులుగా ఆది మధ్యాంతాలూ విస్పష్టమౌతున్న కథలో ఆదిలో పెద్దఅరుంధతి కార్యము, అంత ములో చిన్నఅరుంధతి కార్యము. కాలము మొదలా తుదా అలా ధర్మారావులో సమీకరించినవి. ధర్మారావు ఆదిమధ్యాంతాలలో మార్పులేని పురుషుడు అరుంధతి ప్రకృతి : మార్పు ప్రకృతిలక్షణము. పెద్ద అరుంధతి పునరావృత్తి చిన్నఅరుంధతి. ఇది వేయిపడగలుగా వెలువడ్డ విశ్వనాథవారి హృదయోద్వేగతరంగరేఖ ఇదే కావ్యస్వరూపం "7 అతి మనోహరంగా, సముచితంగా విశ్వనాథవారి హృదయాన్ని ఆవిష్కరించారు.

ఇలాగా ఇతివృత్త నిర్వహణలో తమ మేధాసంపత్తిని ఎంతగానో, ప్రతిభ నెన్నిరీతులుగానో ప్రదర్శించగలిగారు విశ్వనాథవారు.

6.2.2 పాత్రచిత్రణ :

పాత్రచిత్రణ చాతుర్యాన్నంతటినీ స్వయంగా తాముచూచిన వ్యక్తులనే పాత్రలుగా తీసుకొని విపులీకరించారు. ఈ విషయాన్నంతటినీ వివరంగా పాత్ర చిత్రణ ప్రకరణంలో అనేక దృక్కోణాలనుంచి ప్రదర్శించడం జరిగింది. మళ్ళీ దీన్నిగురించి చెప్పడమంటే చర్వితచర్వణమే అవుతుంది.

6.2.3 సన్నివేశ కల్పనం :

ఇతివృత్తంలో పాత్రచిత్రణలో ప్రసక్తానుప్రసక్తంగా సన్నివేశ కల్పనలను స్పృశించియే ఉన్నాను సందర్భోచితమైన సన్నివేశాలు, సంఘటనలు లేనిపక్షంలో

ఆయా వ్యక్తుల తత్వాల్ని, శీలవృత్తులనూ, స్వభావాలను చూపడం కష్టం. ఉదాహరణకు చిన్న అరుంధతితోడి భవిష్యత్తులో ధర్మారావుతో వివాహం జరిగేదికాదు. పశుపతితో మొదటి పరిచయమూ, ఆవెనుక అరుంధతితోపాటు ఉండివెళ్ళటమూ, ఆ తరువాత వేణుగోపాలస్వామి కళ్యాణోత్సవాల సందర్భాలలో అనసూయా పశుపతితో చిన్నఅరుంధతి రావడమూ, ధర్మారావు ఆతిథ్యంతో అక్కడ ఉండడమూ, పెద్ద అరుంధతితో చిన్న అరుంధతికి తగని గారాబమూ, ఇంటిలో ఒకానొకరాత్రి చిన్న అరుంధతి కాలు ధర్మారావుకు తగలడమూ ఇవన్నీ చక్కటి సన్నివేశాలు. ఈ సన్నివేశాలు వారి కలయికకు చివర సహకరించాయనడంలో సందేహంలేదు.

ఇలాగే రామేశ్వరశాస్త్రి వితరణకి చిట్టచివరి దశఅంటే తిన తిండిలేక ఇల్లు గడవడమే కష్టమైన సందర్భంలో హరిజనునకు కట్టువస్త్రం ఇచ్చివేయడమే చాలు.

మంగమ్మ మొదట పతితఅయినా క్రమంగా ఆత్మవికాసం పొందడంలో ఆయా సన్నివేశాలు ఉపకరించాయి.

గణాచారి మహిమలు, పసరిక పాముగాపుట్టి, మనిషిగామారి పాముగా మరణించడానికి తోడ్పడిన సన్నివేశాలు, రామేశ్వరం దౌష్ట్యానికి తగినశిక్ష అనుభవించడంలో అతని జీవితంలోని సంఘటనలు, రాధాపతి వామనరావు కుహనా సంస్కారం, దివాను నాగేశ్వరరావు రామేశ్వరం గావించిన అక్రమధనార్జన, సంపన్నులైనరీతి ఆయా సన్నివేశాల మూలంగానే స్పష్టమవుతాయి. ఇలాగా ఎన్నైనా చెప్పవచ్చు. ఇదంతా విశ్వనాథవారి శిల్పనైపుణిలోకే వస్తుంది.

6 3 రచనా శిల్పం :

"రచనాశిల్పము మిక్కిలి గొప్పది. నన్నయ్యగారు ప్రసన్న కథాకలితార్థ యుక్తియని చెప్పుటలో నీ రచనాశిల్పమునుగూడా భావించినారు.

"రచనా శిల్పమిందులోని భాగముగానే నన్నయ్యగారు భావించియుందురు.

"నన్నయ్యగారి తర్వాత కొన్ని వందలయేండ్లకు వచ్చిన రసగంగాధరకర్త గాని యీ రచనాశిల్పమును ప్రపంచించలేదు. ఇది జగన్నాథపండితునిచేత ప్రపంచింపబడక పూర్వమే సర్వమహాకవులయందును భాసించుచున్నది

"ఈ రచనాశిల్ప మనంతవిధములుగా నుండవచ్చును."[8]

"లోకము మాటాడుకొను నపుడు తాము చెప్పు నర్థము సుప్యక్తమగుటకును తమ కోపాదులు భాసింప జేయుటకును కొన్ని శబ్దములు బిగ్గరగా నావేశముతో నొక్కి చెప్పుదురు. ఇట్టి చోట్ల కవి శబ్దమయమైన మార్గాంతరముచేత వానిని ప్రకాశింపఁ జేయవలయును.

"లోక మెప్పుడు కోపము కొలది కఠినములైన శబ్దములను ప్రయోగించును. కవి తన కావ్యమునందట్లే పెద్దలతో ప్రసంగించునపుడు సభ్యములైన శబ్దములనే వాడును.... తత్తద్భావాను కూలముగ శబ్దములను వాడుట, కొన్ని యధిక ప్రయోజనములను సాధింపవలసి వచ్చినపుడు సమాసము లుపయోగించుట, ఆ సమాసముల యొక్క హ్రస్వత్వము, దైర్ఘ్యము తత్త దావేశోచిత స్ఫోరకముగా ప్రయోగించుట కవితాశిల్పము. ఇది మహాకష్టల సుగ్గుడాలతో పెట్టిన విద్య"?

ఈ లక్ష్యాలన్నీ ఇతః పూర్వమే వివరించిన వాటన్నిట స్పష్టమైంది. ఇంతే గాక రచనలో, సంభాషణల్లో ఇవన్నీ స్పష్ట మవుతాయి. ఆయా పాత్రలు ఇతర పాత్రలతో ప్రవర్తించేప్పుడు ఈ లక్షణం విస్పష్టమవుతుంది. ఇది విశ్వనాథ వారు సాధించారు. అయితే సందర్భోచితమైన సమాస భూయస్త్వం, ఓజోగుణం, కాఠిన్యం, వర్ణనల్లో దైర్ఘ్యం ఉంటూనే ఉంటాయి. ఇవన్నిటినీ నవలలో మనం చూడగలం అవి శిల్ప దృష్టితో చేసినవే గాని ఇతరత్రా కాదు. అంటే శిల్ప విచ్ఛేదనార్థంకాదు. ఇలాగా రచనాశిల్పాన్ని వీరు పరిరక్షించారు. దీనివల్ల విశ్వనాథ వారు తమ నవలాశిల్పంలో కృతకృత్యులయ్యారని తెలుస్తుంది.

6 4 భాష, శైలి :

హడ్సన్ పండితుని నిర్వచనంలోని నవలా లక్షణాల్లోని షడంగాల్లోని చివరివి ఈరెండును. భాష, శైలి, అన్నవి చాలా ప్రముఖ్యాన్నే వహిస్తాయి. వాస్తవానికి భాషావైభవం మీదనే, శైలిమీదనే నవలారచనా వైశిష్ట్యం ఉంటుంది. కథ మనోహరమూ, ఔత్సుక్యస్ఫోరకమూ కావచ్చు. పాత్రచిత్రణా చణత్వం ప్రతిభా ! నిదర్శం కావచ్చు. సన్నివేశాలు, సందర్భాలు, విలువలు అన్నీ గొప్పగా ఉండవచ్చు. కానీ భాష, శైలీ అన్నవి రచయిత జీవనాడిని పట్టిచ్చేవిగా ఉంటాయనడంలో సందేహంలేదు.

"ఈమాట ఎందుకు వ్రాయుచుంటిననగా నేను ఏదిచదివినను సర్వంకషముగా దానిలోని లోటుపాతులన్నియూ నా మనస్సుకు తృప్తికలుగునట్లు చదివెదను. ఇట్లే

ఇంగ్లీషు, తెలుగు, సంస్కృతము మూడుభాషలను చదివితిని. అక్షరమెట్లు పుట్టు చున్నది ? ఏ భాషయొక్క పర్ణసమామ్నాయ మెట్లున్నది ? దీనిశక్తి యెంత ? ఇక్కడనుంచి ఎక్కడ వాల్మీకి–వ్యాసులు, ఇక్కడ నన్నయ–తిక్కనలు, అక్కడ హోమర్–వర్జిల్, షేక్స్పియర్లదాకా పరమేశ్వరుడు నాకిచ్చిన శక్తినిబట్టి [అది అల్పమని నేననుకొనుటలేదు] తరచి తరచి చూచితిని"[10] ఇది వారి ఆయాభాషలలో వారికున్న ఉపజ్ఞ. దీనితో వారి పాండిత్య ప్రకర్ష, ప్రతిభ, వారి భాషావైభవంలో శైలీవిన్యాసంలో స్పష్టమవుతుంది.

మొదట వారి శైలినిగూర్చి పరిశీలిద్దాం.

### 6.4.1 శైలి :

విశ్వనాథవారిది ప్రత్యేకమైన శైలి. అది ఎవరికీ సాధ్యంకానిది. అది వారికే సాధ్యం. అనుకోకుండా ఎంతో సౌలభ్యముంటుంది సందర్భానుగుణంగా. ఒక్కొక్కసారి సమాసభూయిష్ఠమై తదనుగుణంగా నడుస్తుంది. శ్రీకృష్ణదేవరాయలు అన్నా, ఆయన ఆముక్తమాల్యదఅన్నా తగని మమకారం వారికి అందులోని అర్థ కాఠిన్యమూ, దూరాన్వయమూ, ప్రజ్ఞాపాటవమూ, వర్ణనా వైశద్యమూ, ప్రౌఢరచనా చమత్కారమూ, శబ్ద సంయోజనమూ, పద్యం ఎత్తుగడా, ముగింపూ, నిర్వహణా శిల్పమూ ఇవన్నీ విశ్వనాథవారికెంతో ఇష్టం. అందువల్లే వీరిరచన, శైలీ అన్నీ దాదా ఇదేరీతిని ఒప్పుతున్నాయి అయినప్పటికీ విశ్వనాథవారి ప్రత్యేకశైలీ విన్యాసం స్పష్టమవుతుంది. ఇది ఒక రచయిత వ్యక్తిత్వానికి నిదర్శనమవుతుంది. సంస్కృత లాక్షణికులు శయ్య అన్నదాన్నే మనవాళ్ళు శైలి అనేఅర్థంలో వాడు తున్నారు. ఇంతకంటే ఇంగ్లీషులోని 'Style శబ్దానికిది దగ్గరగాఉంది. అదే రీతి లోనే ప్రయోగించబడుతూంది. Style is the man' అన్నారు ఇంగ్లీషులో. అంటే ఆ శైలిననుసరించి ఆ రచయితని గుర్తుపట్టవచ్చు. అల్లే తెలుగులోని మహా కవులందరూ తమదైన బాణీని కలిగినవారు. నన్నయ్య, తిక్కన, శ్రీనాథుడు, పోతన, పెద్దన, కృష్ణదేవరాయలు, రామరాజ భూషణుడు–ఎవరైనాసరే ; వారి బాణీ వారిది. అలాగే విశ్వనాథవారు; అటు పద్యంలోగాని, ఇటు గద్యంలోగాని తమ దైన శైలిని నిలబెట్టుకొన్న ఆధునికాంధ్ర పరిశిష్టకవి. వారిశైలి వారిదే ఆరంభంలో విశ్వనాథవారు గ్రాంథికభాషనే వాడుకొన్నారు. వేయిపడగలు గద్య ప్రబంధమంటే తప్పులేదు. అందులోని సంభాషణానికి, వ్యక్తికి, పరిస్థితులకు అనుగుణమైన శైలీ

విన్యాసాన్ని ప్రదర్శించారు. రచయిత తామై చెబుతున్నప్పుడు, వ్యక్తులు సంభాషించే సమయంలో, వర్ణనా వైదగ్ధ్యాన్ని వివరించేటప్పుడు వివిధ శైలులను సత్యనారాయణగారు అనుసరించారు. ఈ విషయానికి వేయిపడగలు నవలంతా ఉదాహరణమే.

"సుబ్బన్నపేట వీధులలో నొక యువతి యిట్లు పాడుచు గంతులు వేయుచు మొగమున నున్న పెద్ద కుంకుమ బొట్టు చెమటకు కాఱిపోవుచుండగా, జేతనున్న వేపమండ మాటి మాటికి నూగు లాడించుచు జుట్టు విఱియ బోసుకొని, పయ్యెద తొలగుట గూడ నెఱుగని తన్మయత్వముతోఁ గొంతసేపు పరువెత్తుచుఁ గొంతసేపు తొందరగా దిరుగుచు నుండెను."[11] అలాగా ఇంత పెద్ద వాక్యం సందర్భోచితంగా ప్రయుక్తం, కాని చిన్న చిన్న వాక్యాలు లేకపోలేదు.

'అప్పటికిఁ బది గడియలు ప్రొద్దెక్కెను వేసఁగి ఈదురుగాలి కొట్టుచుండెను.' ఇలా నడుస్తుంది.

సాంకేతిక పదజాలం వాడవలసి వచ్చినప్పుడు వాద ప్రతి వాదాలలో సమయోచితంగా శైలి ప్రయుక్త మవుతుంది. అభినయమూ, విమర్శ మొదలైన వాటిలో ఇలాంటి శైలి గోచరిస్తుంది. వీటి కెన్నైనా ఉదాహరణ లివ్వవచ్చు.

### 6.4.2 భాష :

ఇక వీరి భాష గ్రాంథిక మన్నది ముందే మనం తెలుసుకొన్నాము. ఆనాటి పరిస్థితులకు అనుగుణంగా విశ్వనాథవారు వేయి పడగల్లో గ్రాంథిక భాషనే స్వీకరించారు. ఇందాకే చెప్పినట్లు ఆయా సందర్భాల కనుగుణంగా భాషలో సారళ్యమూ, కాఠిన్యమూ గోచరిస్తాయి. ఇది శైలిలోని భాగమే. ఇతః పూర్వమే పేర్కొన్నట్లు వాద ప్రతివాదాల్లో, వర్ణనా నైపుణ్యంలో తన శక్తి నంతటినీ ఉపయోగించి భాషా రీతిని ప్రయోగించినారు.

#### 6.4.2.1 వర్ణనలు :

విశ్వనాథవారి వర్ణనలు ప్రత్యేకమైనవి. వస్తువుల్ని, పశుపక్ష్యాదుల్ని సందర్భాల్ని, వ్యక్తుల మనః ప్రవృత్తుల్ని, ఋతువుల్ని అన్నింటినీ అనేక రీతుల వర్ణించారు. రత్నగిరి క్షేత్రయ్య పదాభి నయం (పు - 24): గిరిక దశావతార వర్ణన (అధ్య 29); ధర్మారావు వర్ణన (పు. 12,32); నవవధువు వర్ణన (పు.106,107);

పాముల వానివర్ణన (పు. 299, 300). గణాచారి వర్ణన (పు. 1, 318), గిరికవర్ణన (పు. 324, 325), కపిలగోవు (పు. 2), గోవర్ణన (అధ్యా 25), సాయంసమయం (పు. 22), ఉషోదయం (పు. 29), దినలక్ష్మి (పు. 34, 35) రాత్రి, చీకటి (పు. 73, 513), సూర్యోదయం (పు. 167), మంచు (పు. 281), వెన్నెల (పు. 428), సుడిగాలి (707), పందిళ్ళు (760), గుండేపువరద (265–267), సుబ్రహ్మణ్యేశ్వరస్వామి మహిమ (పు. 6), నాగేశ్వరాలయం (పు. 35, 36) వేణుగోపాలస్వామి (పు. 37, 38), ఋతువర్ణన (పు. 523), హేమంతము (పు. 482, 483), వసంతము (పు. 384, 385, 576) వర్షర్తువు (పు. 482, 483) ఇలాగే ఎన్నో విధాలుగా చక్కటి వర్ణనల్లో, వాటికి తగినరీతిలోనే భాష ప్రయుక్తమైంది. వాద ప్రతివాదాల్లో విమర్శలలో తగినభాష యుక్తియుక్తంగా భాషాప్రయోగం కనిపిస్తుంది. ఇది విశ్వనాథవారి భాషావైవిధ్యంలోని విశేషం. వీటన్నిటినీ వివరించడమంటే ప్రత్యేక గ్రంథరచనమే అవుతుంది.

6.4.2.2 అన్యదేశ్యాలు :

ఇక ఆ కాలంలో ప్రయోగంలోఉన్న అన్యదేశ్యాల్ని చక్కగా వీరు వాడుకొన్నారు. అలా ఆ మాటల్ని ప్రయోగిస్తేనే అందం. గ్రాంధికంకదా అని వాటిని వదలి పెట్టిగాని, వాటికి మారుగా వేరుపదాల్ని వాడడంగాని సముచితంకాదు. సందర్భోచితంగా వాడడమే సముచితమైనరీతి. అదే విశ్వనాథవారు వేయిపడగల్లో చేసిన పని.

అలాంటి పదాలు : హోదా (66), జరీబు (66), దివాను (67), ఎలక్ట్రిసిటీ ప్లాంటు (63), షెల్‌పెట్రోలు డబ్బాలు (63), గ్రాండ్ ఇండియన్ సర్కస్ (63), మ్యాజిక్ ప్రొఫెసరు (64), ఆర్డరు (68), టపా (68), జరీ (69), కాఫీ (70), పరగణా (71), కోటు, సూటు (71), డేరా (71), బ్యాండుమేళము (72), లాటీలతో, గ్యాలరీ, తుపాకీ (72), సినిమాలు, టీ పార్టీలు, గవర్నమెంటు, తారురోడ్లు(80), స్పెన్సరు కంపెనీ (81), దుబారాఖర్చు (80), దస్కత్తు (95), మాటతకరారు (96), కంట్రోలు, ఇన్‌ఫ్లూయంజా (198), అయిరన్ వర్క్సు (217), మాస్టర్లు

(215), ఘోషా (241), రైల్వేస్టేషన్, కాలేజీ, పోలీసుస్టేషన్ (316), దరిఖాస్తు, ఫిలుముహాలు (251), పార్శీనాన్సు (396), ఠాణా, తనిఖీ, శిస్తులు (666), రాజీ నామా (667), ఖూనీ (683), డాక్టరేటు (686), టీ ప్లాంటేషన్ (688), కాపిట లిజము (870), ఫైలాలజీ (878), జెనరల్ హాస్పిటల్, పోస్టుమార్టమ్". ఇలాగా ఎన్నో అన్యదేశ్యాలు వాడి తమ ప్రతిభను ప్రకటించుకొన్నారు.

## 6.5 ప్రతీకాత్మకత, ధ్వని :

ఇకపోతే వారు రచించిన వేయిపడగల్లో ప్రతీకాత్మకత ఉందని కొందరూ, వేయిపడగలు ధ్వని కావ్యమని మరికొందరు ప్రశంసించారు. ఆ తీరుతెన్నులను సైతం పరిశీలిస్తే విశ్వనాథవారి నవలాశిల్ప వైదుష్యం స్పష్టమవుతుంది

6.5.1 ప్రతీకాత్మకత : కొందరి విమర్శకులకు ఈ విధంగా దోస్తుందినవల. హైందవ వ్యవస్థకు, హిందూమత విశ్వాసాలకు, ఆస్తికతకు నాగేశ్వరస్వామి శివా లయము, వేణుగోపాలస్వామి ప్రతీకలు.

ధర్మారావు ధర్మమే. రామేశ్వర శాస్త్రి "వర్ణాశ్రమ ధర్మములు ముద్ద కట్టిన మూర్తి; భారత దేశముయొక్క ఆత్మ త్రయీధర్మ విద్య లేక వ్యాఖ్యానమూ." చాతుర్వర్ణ్యాల వ్యక్తుల్ని వివాహమాడి భోగాంగనను ఉంచుకోవడమే దీనికి తార్కాణం. భక్తికి ప్రతీక దేవదాసి గిరిక; జ్ఞాన యోగానికి ప్రతీక హరప్ప. పాశ్చాత్య వ్యామోహ పీడితుడై హైందవాన్ని గుర్తించిన వ్యక్తి రంగారావు. దౌష్ట్యానికి ప్రతీక పరమేశ్వరం. పురావైభవ పరిరక్షకుడు అనడానికి కృష్ణమ నాయుడు ప్రతీక కాల వశాత్తు పతిత అయినా బాగు పడవచ్చు ననడానికి ప్రతీక మంగమ్మ. త్రికాల వేదిత్వానికి ప్రతీక గణాచారి పాతివ్రత్యానికి ప్రతీకలు రంగాజమ్మ, అరుంధతీ, శశిరేఖా, రథంతరులు. ఇంకా డా॥ కుటుంబరావు గారి మాటలు ఇలా ఉన్నాయి " 1) దేవ మాతృకలకు ప్రతినిధి వసరిక, 2) ఐహికా ముష్మికముల సంబంధమును ధర్మారావు, గణాచారి, హరప్పయు సూచింతురు. 3) పాతివ్రత్యమునకు అరుంధతి ప్రభృతులుదాహరణము. 4) దైవ స్వరూపముగా గిరిక చిత్రింప బడినది. 5) ఆర్ష వివాహము. పూర్వ నాగరకతకొక విలక్షణము."[12]

ఇంకా ఎందరో విమర్శకులు ఎన్నో విధాలుగా దీనిలోని ప్రతీకాత్మకతని ప్రస్తరించారు "వేయిపడగలు లోని ప్రతీకని వివేచన గాని, ప్రాగ్రూప

(Archetypal) విజ్ఞానంగాని కేవలం లౌకిక జీవన వివేచనంతో ఆగిపోదు. ఆ నవలలోని కథ అంతా ఒక ఆధ్యాత్మిక సాధనంగా అంతరాంతరాల్లో సూక్ష్మ సూక్ష్మ గ్రంధి నిబద్ధమై సాక్షాత్కరిస్తుంది. నవల పేరే సహస్ర ముఖత్వానికి సూచకం. నవలలో సుబ్బన్నపేట, సుబ్రహ్మణ్యేశ్వరుడు, వరుసగా వ్యక్తమైన జగత్తుకూ, అవ్యక్తమైన పరబ్రహ్మమునకూ సూచనలు. సుబ్రహ్మణ్యేశ్వరుడు సహస్రముఖుడైన ఆదిశేషుడు – అనంతుడు ఆదిశేషుడు భారతీయ దివ్య ప్రతీకల్లో కాలానికి ప్రతీక. ఆదిశేషుడు లక్ష్మణుడు. ఆయనే పతంజలి యోగశాస్త్ర ప్రవర్తకుడు ఈ నవలలో నిబద్ధమైనది కుండలినీ యోగం. కుండలిని అంటే పాము. 'యోగి జనేషు సంసదుదితోజ్జ్వల సత్ ప్రథమావతార :' అని శ్రీమద్రామాయణ కల్పవృక్షంలో శ్రీ విశ్వనాథ లక్ష్మణుని సంబోధించినారు."

"ప్రతి పాద్య మయ్యే తత్వం గ్రంథం యొక్క ఉపక్రమోపసంహారాభ్యాసాలవల్ల ప్రధానంగా నిరూపిత మవుతుంది. ఇవి గ్రంథానికి అంతరిక్యాన్ని సంపాదిస్తవి.

"నవలయొక్క ఉపక్రమంలో సూచితమైన కుండలినీయోగం నవలయొక్క ఉపసంహృతిలో గూడా స్పష్టంగా వ్యక్తంచేయబడింది నాయికా నాయకుల సమాగమంతో ఈ నవల సంపూర్తమైంది. ముక్తిజీవుడికి ఇతరమయిన సర్వవ్యవహారమంతా నశించి చివరకు మిగిలేది ఈశ్వరసాక్షాత్కారమే. తంత్రశాస్త్రాల్లో ఇది శివశక్తుల సంయోగంగా చెప్పబడింది. సౌందర్యలహరి హంసద్వంద్వ సంయోగంగా భావించింది."[13]

ఇలాగా వేయిపడగలు ప్రతీకాత్మకంగా రచితమై శిల్ప పరిపాకంతో విలసిల్లుతుందని స్పష్టం.

### 6.5.2 ధ్వని :

ఈ నవలలోని ధ్వని నీవిధంగా వివరించారు డా॥ బి. వి. కుటుంబరావుగారు.

"ఈనవల వ్యంగ్య ప్రధానమైనది. వేయిపడగలనగా సహస్రముఖమైన ధర్మము; ప్రధానముగ చాతుర్వర్ణ్యము, ఊరిపెద్దకు నాలుగుతలల పామగపడెను;

దంపతులకు రెండు తలలది రాజు, గణాచారి, ధర్మారావును బలిపీఠప్పుఁ గోళ్ళు, కృష్ణమనాయని మరణంతో విరిగిన యాకాలత్తే పదునారేండ్లున్నది; హరప్పనాయని కాలమున నతుకబడి, యాతని మృతితో నిరుపయోగమయ్యేను. గణాచారి నిష్క్రమణముతో బరమ నిరుపయోగమైనది. ధర్మక్రమచ్యుతి వీనిచే వ్యంజితమై యొంటి కాలుఉన్న నిరుపయోగమయ్యేను. ఆ యొంటికాలు ధర్మారావు.

"పూర్వాంధ్ర జాతివైభవము సహస్రభోగములఁగ భాసించి, రూపమదృశ్యమైనటుల వ్యంజింప జేయుటయందుఁ జరిత్ర ప్రసిద్ధిగల నాగులతో సంబంధమిందు సంధానితము. భారతీయ నాగరకతా సంప్రదాయములను శ్రీ విశ్వనాథ సత్యనారాయణ గారివలెఁ ద్రవ్వితల కెత్తగల వారీయుగమున లేరు.

"....స్వామికి వీరన్ననాయని వంశ్యులు ప్రతినిధులు, బ్రాహ్మణ ప్రచారకులు; కొప్పువంగడపుటాడు పడుచులు వ్యాఖ్యాత్రులు. ఇట్లు ద్యావాపృధ్వులమధ్య స్వర్గ మర్త్యధామముల మధ్య ప్రత్యక్షాప్రత్యక్షములమధ్య నొకానొక సుస్థిర సంబంధమీ నవల వలన నేర్పడినది.

"పై నుండి కాపాడువాడు భగవానుడు; క్రిందనుండి రాజు; బ్రాహ్మణుడును ఈరెండు సంస్థలకును మధ్య తీరని లంకెయగు గణాచారిదొక మహద్వ్యవస్థ. ఇది యొక ధర్మమండపం. స్వామి, ప్రభువు, బ్రాహ్మణుడు, గణాచారియను నీ నల్వురు దీనికి నాలుగు స్తంభములు. ఇదియంతయు నీ నవల యారంభమునాటికథ."[14]

"రాజు అనగా ధర్మాచరణ. ధర్మాచరణలో జరిగిన లోపం ఏమిటి ! అని ప్రశ్నిస్తే నవలలో ఆ సందర్భంలో అందుకు ఉదాహృతమైనవిషయం – కృష్ణమనాయడు రామేశ్వరస్వామి మాసికమువట్ల నిర్లక్ష్యము వహించుట, ధర్మారావువెళ్ళి అడగ్గా చివరకు ఆరురూపాయలు ఇవ్వబడుట, ధర్మారావు ఋణగ్రస్తుడైన సంగతి గోపన్న చెప్పగా విన్నతర్వాత కాని రాజు సాహాయ్యము చేయకపోవుట. తర్వాత ధర్మారావును జమీందారు ఆదరించినా తప్పుతప్పే. ఈ విధంగా ధర్మాచరణలో లోపము జరిగినది రాజును పాము కాటందుకొన్నది. అని ధ్వని"[15]

"....ఏకవీరలో గుర్రపువాళ్ళ పిల్ల అమృతాన్ని ప్రవేశపెట్టినట్లు మంగమ్మలో 'వాలి'ని ప్రవేశపెట్టడం, దానిద్వారా మంగమ్మ 'మనస్సు'ను అభివ్యక్తం చేస్తూ ధ్వనిపూర్వకంగా కవిచేసిన రచన నవలలో ఉత్తమమైనది.... ....నవలలో ఋతువులూ, వెన్నెలా, ఎండా, రాత్రీ, పగలూ, వర్ణింపబడిన తీరునుగూర్చి ప్రత్యేకంగా జెప్పవలసిన పనిలేదు. మనిషికి ప్రకృతికి రానురాను నాగరకతవల్ల ఎంతటి దూరం ఏర్పడుతుందో పసరిక మరణంవల్లే కాదు, వర్ణనల వల్ల కూడా నాగరికతా వ్యామోహితమైన పాఠకుని మనసుకు తట్టుతున్నది."[16] అని ఈవిధంగా సుదర్శనం గారు ఇందులోని ధ్వని వివరించారు

ఇలాగా విశ్వనాథ సత్యనారాయణగారు తమ బృహన్నవల అయిన వేయి పడగల్లో అత్యుత్తమంగా నవలాశిల్పాన్ని బహుముఖాలుగా పరిపోషించి నవలనెంతో శ్రేష్ఠమైన రచనగా చేయగలిగారనడం సహజోక్తి :

## సూచికలు


1. తిక్కన : నిర్వచనోత్తర–రామాయణము – 1–31.

2. విశ్వనాథ సత్యనారాయణ : శ్రీమద్రామాయణ కల్పవృక్షము–బాలకాండము–అవతారిక – పు. 29.

3. విశ్వనాథ సత్యనారాయణ : అల్లసానివాని అల్లిక జిగిబిగి – పు. ,34,8

4. విశ్వనాథ సత్యనారాయణ : నేనూ – సాహిత్య రచనలు మహతి–ప్రభావం పు. 21.

5. డా॥ మొదలి నాగభూషణశర్మ : తెలుగు నవల – కథా కథన శిల్పం : తెలుగు నవల – నూరు సంవత్సరాలు – పు. 31‘

6. వేయి పడగలు – పు. 227, 228.

7. ఆర్. ఎస్. సుదర్శనం : నవ్యాంధ్ర సాహిత్యంలో దృక్పథాలు—భారతి.... సెప్టెంబరు 1964.

8. పై మూడవ సూచికలోనిదే. పు. 14, 15, 16.

9 పైదే. పు. 18.

10. వేయి పడగలు పు. 1.

11. పైదే. పు. 1.

12. డా॥ బి. వి. కుటుంబరావు : ఆంధ్ర నవలా పరిణామము పు. 374.

13. డా॥ కోవెల సుప్రసన్నాచార్య : వేయి పడగలు – ఆధ్యాత్మ భావ భూమిక– విమర్శిని – 3 పు. 89, 91.

14. పై 12 వ సూచికలోనిదే పు. 375, 376.

15. పై 12 వ సూచిక లోనిదే.

16. పై 7 వ సూచిక లోనిదే.

# 7.0 నవలా కారుడుగా విశ్వనాథవారి స్థానం

ఇతః పూర్వ ప్రకరణాల్లో విశ్వనాథవారి 'వేయి పడగలు' నవలలోని ఇతి వృత్త నిర్వహణ దక్షత, పాత్రపోషణా చరణత్వం, సమకాలిక పరిస్థితుల చిత్రీకరణం, నవలా శిల్పవైభవం వివరించడం జరిగింది. ఈ ప్రకరణలో చివరిగా 'వేయి పడగలు' నవలా విశిష్టతతో పాటు నవలా కారుడుగా విశ్వనాథవారి స్థానాన్ని నిర్ణయించడమే ప్రస్తుతాంశం. దీనితో విశ్వనాథవారి బహుముఖ ప్రతిభా వైభవాన్ని సూక్ష్మాతి సూక్ష్మంగా తెలుసుకొన్నట్లవుతుందని మనకు అవగత మవుతుంది.

## 7.1 "వేయి పడగలు' విశిష్టతః

"వేయి పడగల్లో ప్రతీక పాత్రల (Symbolic characters) దృష్ట్యా విస్తృతమైంది. భారతీయ సంఘం ప్రతీకా సంఘం తప్ప వ్యావహారిక సంఘం కాదు. ప్రతీక అంటే తాను తాను కాదు. మరొక దానికి సంకేతం. అదే ఆత్మ పదార్థం. వ్యావహారిక సంఘమంటే తాను తానే. పదార్థ రూపుడు కన్పిస్తున్న వాడు అని అర్థం మానవుడి లోపల మూడు పరిధులు లేక వృత్తాలున్నాయి. 1. వ్యావహారిక వృత్తం, 2. కళా వృత్తం, 3. తాత్త్విక వృత్తం — వీటి సమన్వయం మానవుడు. ఇది ఆధునిక బుద్ధి కందదు. దీన్నే వేదాంతులు జాగ్రదవస్థా త్రయంగా మనస్తత్వ శాస్త్రవేత్తలు (Conscious, sub - conscious, Un–Consicious లుగా చెబుతున్నారు. Sub - Conscious కళాధారం. ఇందులో నుండే జగత్ సృష్టి జరుగుతున్నది. Surreslism దీన్ని నిరూపిస్తున్నది. యోగాది శాస్త్రాలకు Unconscious ఆధారమని సి. జి. యాంగ్ (C. G. Jong) నిరూపణ. ఈ మూటిని బంధించటమంటే ఐహికాముష్మిక సమన్వయమని అర్థం .... దీన్నే The dance of Siva - మొదటి వ్యాసంలో ఆనంద కుమారస్వామిగారు నిరూపించారు. ఈ దృష్టి ప్రతీకా దృష్టి. దీనితోనే భారతీయ కళా సామ్రాజ్యాన్ని దర్శించాలి...."

"అందుకని భారతీయ సంఘం ఆత్మ పదార్థ ప్రతీక. దీన్నే యాంగ్ personal theory — నిరూపిస్తున్నది. ఈ దర్శనం కలవారు ఆధునికుల్లో

కుమారస్వామి, అరవింద, వివేకానంద, గాంధీ — కవుల్లో విశ్వనాథ ఒక్కడే.... విశ్వనాథ వేయి పడగల్లో గుండేరు పొంగడం, — లక్ష్మణస్వామి మరణించిన తరువాత, జరిగిన రంగారావు పట్టాభిషేకం పాడు చేసిన వర్షాతిశ్రవత - ఇవన్నీ - మానవుని అధర్మానికి ప్రకృతిలోని అంతరచైతన్యం ప్రదర్శించిన కోపమని వ్రాయటం జరిగింది. ఇది భారతీయ ఋషాత్మ. అందుకే టాగూరు గోరాకంటె వేయిపడగలు వేయిరెట్లు గొప్ప గ్రంథం. ఆ స్వీయ సూత్రదర్శనం విశ్వనాథకే ఉంది. తెలుగుభాషలో వేయిపడగలు పుట్టటం ఈ జాతి అదృష్టం."[1]

"నవ్యాంగ్ల రచయితలలో ప్రముఖుడైన డి.హెచ్. లారెన్స్ వ్రాసిన The Rainbow' [ఇంద్రధనుస్సు] నవలకూడా ఈ సందర్భంలో జ్ఞాపకంవస్తుంది స్వర్గ మర్త్యాలమధ్య, ప్రకృతి మానవులమధ్య ఏర్పడి ఉండిన మహైక్యము మూడు తరములలో ఎట్లా పారిశ్రామికమూ, మేధాప్రధానమూ అయిన నాగరకతా ప్రభావం వల్ల విచ్ఛిత్తిచెందిందో చిత్రించే కావ్యం "ది రెయిన్‌బో". అందులోని మొదటి అధ్యాయంలోని వాక్యాలు– 'They knew the intercourse between heaven and earth, Snnshime drawn into the breast and bowels, the rain sucked up in the day time, nakedness that comes under the wind in autumn.... Their life and inter-relatoins were such.' వేయిపడగలలో మొదటి అధ్యాయంలోని వాక్యాలు– "ఈరీతిగా భూమ్యాకాశములమధ్య, స్వర్గ మర్త్యలోకముల మధ్య, ప్రత్యక్ష ప్రత్యక్షములమధ్య నొక స్థిరమైన సంబంధమేర్పడెను.' లారెన్సు వ్రాసిన నవలలో కేంద్రస్థమైన ప్రతీక కేథీడ్రెల్ (చర్చి), విశ్వనాథవారి నవలలో కేంద్రస్థమైనది దేవాలయము. ఇంగ్లీషు నవలలోనూ లయ ఉన్నది. ఆ నవల ముగింపు ఆశారేఖా (ఇంద్రధనుస్సు) దృశ్యం కావటంలోనే. రెండునవలలు చివరివాక్యాలు ఆశాభావాన్ని వ్యక్తంచేసేవే.... రెండు నవలలు తుదివిశ్వాసమూ వివాహవ్యవస్థయే"[2]–అని ఆర్. ఎస్. సుదర్శనంగారు తులనాత్మకంగా సునిశితంగా పరిశీలించి వివరించారు.

ఇలాగా మహోన్నత సృష్టిచేశారు సాహితీలోకంలో విశ్వనాథవారు. వారి అభిప్రాయాలతో చాలామంది అంగీకరించకపోవచ్చు. అది వేరేవిషయం కాని ఆయన మహామేధావి. ఆయన ప్రతిభ 'వేయి పడగలు'లో గోచరిస్తుంది. ఆయనలోని ద్వైధీభావం స్పష్టమయినా అది వారి వ్యక్తిత్వం. ఇక నవలాకారుడుగా వారికి తెలుగుసాహిత్యంలో గల స్థానాన్ని పరిశీలిద్దాం.

7.2 నవలా కారకుడుగా విశ్వనాథవారి స్థానం :

శ్రీ విశ్వనాథవారు సుమారు అరవై నవలలు రచించినట్లు మనం రెండో ప్రకరణంలో తెలుసుకొన్నాము. వారూ వీరూ ఎందరో విమర్శకుల అభిప్రాయాల్ని ఇంతవరకు తెలుసుకొన్నాము. ఇప్పుడు తమ నవలా ప్రపంచాన్ని గూర్చి తామే చెప్పిన మాటల్ని ఉల్లేఖించడం ఎంతైనా అవసరం.

"ఇంక నవలలను గురించి చెప్పవచ్చును. తెరచిరాజు, స్వర్గానికి నిచ్చెనలు, ఇవి రెండు ఈ పాతికేండ్లలో మొదటనే పడతవి బందరులో ముంజులూరి కృష్ణారావని ఒక మహానటుడు ఉండెడి వాడు. పూర్వపు కూచిపూడి వాళ్ళలో పరదేశి మొదలైన వాళ్ల ఎటువంటి అభినేతలో ఆయన అటువంటివాడు. నాకభినయం చాలా తెలుసు. అదంతా అతనిని చూచి తెలిసికొన్నదే. అతడొక విచిత్రమైన పురుషుడు. అతని నాట్య కౌశలమంతా తెరచి రాజు నిండా వ్రాసినాను.... ఏకవీరలో నేను ప్రారంభించిన త్వగింద్రియ స్పర్శలక్షణం తెరచిరాజులలో మరలా నెత్తికొని వ్రాశాను.

"రెండవది స్వర్గానికి నిచ్చెనలు. ఇదొక చిత్రమైన నవల మతముపేర కూడాను దుర్జనులు ఇతరులను వంచింతురు. ఇతరులను వంచించుట ఈ లోకము నందు ఒక మహా విద్య. అదొక శిల్పము. ఈ శిల్పవేత్తల సంఖ్య అనంతం .... ఈ స్వర్గానికి నిచ్చెనలన్న నవల దైవము అన్న విషయములో ఆస్తికమనువారు చేసిన వంచన సర్వస్వము ఉన్నది.

"చిన్న చిన్న నవలలు చాలా ఉన్నవి. వాని నట్లుంచి మూడు రకములైన నవలలను గూర్చి చెప్పెదను. ఒకటి - పురాణ వైర గ్రంథమాల—12 నవలలు— రెండవది నేపాళ రాజచరిత్ర - 6 - నవలలు - మూడు కాశ్మీర రాజ చరిత్ర—6— నవలలు - ముందు వీనిని గురించి చెప్పెదను.

"ఈ మహా విషయాన్ని పురస్కరించికొని 'పురాణవైర గ్రంథమాల' అని పంద్రెండు నవలలు వ్రాసాను. నేటి ఆంధ్ర చరిత్రను బట్టి చూస్తే ఇక్ష్వాకులు,

పల్లవులు, విష్ణుకుండినులు, ఇటువంటి పేర్లు వాళ్ళు పాలించిన కొద్ది భూభాగాలు, శాసనములు, ఈ రీతిగ మన ఆంధ్ర చరిత్ర ధ్వంసమై పోయినది.

"మన చరిత్ర విస్పష్టముగా నున్నది. మన పురాణములయందలి మగధరాజ వంశములయందలి యథార్థచరిత్ర ననుసంధానించి నేను పురాణ వైర గ్రంథమాలను పండ్రెండు నవలలను వ్రాసితిని. అందులో 'చంద్రగుప్తుని స్వప్న'మన్న నవల గుప్త చంద్రగుప్త, మౌర్యచంద్రగుప్తుల భేదమును చెప్పునది

"రెండవ ఆరునవలలు కాశ్మీర చరిత్రము.... కల్హణుఁడు, కల్యాది విషయములందు పొరబడినాడు. అవి ఆరునవలలు వ్రాసినాను

"మరి ఇంకొక ఆరునవలలు నేపాళరాజ చరిత్రను గురించి వ్రాసితిని"

"ఈ ఇరువదినాల్గు నవలలో మన పురాణములలో, ఆయా చరిత్రములలో నున్న యంశములు తారీఖుల ప్రకారము కాలమును చూపించితిని. చరిత్రలోని ప్రధానాంశములను వదిలిపెట్టలేదు.

"అందుకు నేనుపడ్డ శ్రమను వదలు. ఈనాడు పాఠకులకు శ్రద్ధ ఎక్కడిది? విజ్ఞాన మక్కరలేదు. పాండిత్యమక్కరలేదు. స్వజాతిభాషమక్కరలేదు ఇది వేద భూమియన్న యభిమానముండుట తప్పుగా కనిపించుచున్నది

"ఇన్ని నవలలో చరిత్రాంశములను తీసివేయ కథలన్నియు నేను కల్పించినవే. పంపలాది విలక్షణమైన పాత్రలు నేను సృష్టించినవే. కథ, కథచెప్పెడి సొగసు, శిల్పం జూడుముగ్గి— ఒక గొప్పనవలకు కావలసిన సామగ్రియెంతయో ప్రతినవలలో సమకూర్చితిని. ఒక నవలవలె యింకొకనవల యుండదు. అనంతమైన కల్పనా వైవిధ్యమున కంత లేదు. భాషయా? యెక్కడ యేభాష యుచితమో యాభాషయే వ్రాయబడెను. నాపద్య ప్రపంచకమెటువంటిదో, నేను నిర్మించిన గద్య ప్రపంచకమునట్టిదే! ఎంగిలికూడులేదు. నా జాతి, నా తెలుగువాళ్లు, తెలుగు భాషనాది.... నేనువ్రాసిన షుమారు అరువదినవలలలో యే విషయాన్నిగూర్చి వ్రాయలేము? పాశ్చాత్యులయొక్క, సైన్సుయొక్క చరిత్రలో విషయాలు ఉంటవి. వాళ్ళ ఫిలాసఫీయొక్క విషయాలు ఉంటవి. వాళ్ళ సాహిత్యంలోని రహస్యములు

ఉంటవి. వాళ్ళ శాస్త్రాలలోని మహా విషయాలు ఉంటవి. వృక్షశాస్త్రము, పశుశాస్త్రము చివరకు Money మారకం, అవసరమైతే ఇది ఉంటుంది, అది ఉండవని ఉండదు. ఇటుచూస్తే వేదాలు, ఉపనిషత్తులు, భాష్యాలు, తర్కాలు, వ్యాకరణాలూ, అటు చూస్తే పాశ్చాత్యవిజ్ఞానంలో నేను నిద్రాహారాలులేకుండా సంపాదించిన విజ్ఞాన మంతా నా నవలలలో. నా పుస్తకములలో ఉంటుంది.

"వాళ్ళ త్రవ్వకాలున్నవి. వాళ్ళ త్రవ్వకాలలో బయటకు తీసినవాటిల్లో మహ టాయమానంగానున్నది ఈజిప్టుయొక్క నాగరికత. నేను 'ఆటునదు' అన్న నవల వ్రాసి కృష్ణాపత్రికలో ప్రకటించితిని. అందులో నీ పరిశోధనఅంతయు వ్రాసితిని. మన పురాణకథలు ప్రక్షిప్తకథలని చెప్పినట్లే పాశ్చాత్యులు గ్రీసుపురాణాలను కూడ చెప్పారు.

"పునర్జన్మయని మరియొక నవల వ్రాసితిని మాండూక్యోపనిషత్తులోనుండి తీసి, పునర్జన్మ యెట్లు సాధ్యమగునో నిరూపించినాను.

"గడచిన నాలుగైదేండ్లుగా యూరప్‌ఖండం రాజకీయంగా చిత్రవిచిత్రమయిన విప్లవములను చేసుకొన్నది.... ఈ మహావిషయమునుగూర్చి సముద్రపు దిబ్బయను నవల వ్రాసితిని.

"హిందూస్థానీ సంగీతమునుగూర్చి, దానిచరిత్రను, తాన్‌సేన్ నాటి సంగీతము మారిమారి ఖ్యాలులులోనికి దిగినది. ఆ సంగీతము మహారాష్ట్ర దేశములో కొంత మారినది ఈ చరిత్రయంతయు డ్రామాయణమెట్టిద యున్న నవలలో వ్రాసితిని.

"దయ్యాలనుగూర్చి దాకావతియను గ్రంథమును వ్రాసితిని ఈ కథను నేను కల్పించలేదు. ఒక నా శిష్యునియింటిలో జరిగిన కథ

"ఇవికాక ఈ కాలప్పురాజ్యము నడచేపద్ధతి, నడుపబడే పద్ధతి 'ధన మూల మిదం జగత్' అన్న అర్థమునకు సామ్రాజ్యపట్టాభిషేకం చేయబడిన ఈనాటి పరిస్థితిలో రాజ్యములో ఉన్నూ మంత్రులూ ఎట్లున్నారో వసుయంతి స్వయంవరమన్న నొక నవలను వ్రాసితిని.

"ఇక్కడనుంచి అక్కడ వాల్మీకి వ్యాసులు, ఇక్కడ నన్నయతిక్కనలు, అక్కడ హోమర్, వర్జిల్ షేక్స్పియర్ల దాకా పరమేశ్వరుడు నాకిచ్చిన శక్తినిబట్టి, అది అల్పమని నేననుకొనుటలేదు, తరచితరచి చూచితిని. ఇంగ్లీషుభాష మనకు పనికిరాదు. దీనిని విష్ణుశర్మ ఇంగ్లీషు చదువులో వ్రాసితిని.

"ఆంధ్రచరిత్ర త్రవ్వి త్రవ్వి పరమ రహస్యములు కొన్ని ఆంధ్రప్రశస్తిలో, కొన్ని నవలలుగా 'స్నేహఫలము', చందవోలురాణి, మొదలైన గ్రంథములలో వ్రాసితిని. అందుకనియే నా శరీరంలో ఎన్నిజన్మల ఆంధ్రరక్తము ప్రవహించుచున్నదోయని నా యాంధ్రప్రశస్తిలో వ్రాసితిని.

"నిజానికి శిల్పముకాని సాహిత్యంకాని జాతీయమై ఉండవలెను. విజాతీయమై ఉండరాదు. వ్రాసినవానికి ముక్తి, చదివినవానికి రక్తి ముక్తి. ఎంత సముద్రము మీద ఎగిరినను పక్షి రాత్రి గూటికిచేరును. ఇది జాతీయత. ఇది సంప్రదాయము."[3]

'ఇక విశ్వనాథపై శ్రీ శ్రీ చెప్పిన మాటలు గమనించండి. 'పురోగమనమా ? పశ్చాద్గమనమా ? అనే విషయం ఆలోచించాలి ఇంగ్లాండులో టి. ఎస్. ఇలియట్ ను మహా కవులలో ఒకడని అందరూ అంగీకరిస్తారు. కానీ అతని దృక్పథం మాత్రం అభ్యుదయ నిరోధకం. మన విశ్వనాథ సత్యనారాయణ గారున్నారు. ఆయనా అంతే. గ్రీకు రోమను కాలాల సంస్కృతి Eliot ను ఆకర్షించినట్లే రామాయణ భారత కాలాల వైభవము విశ్వనాథవారిని ముగ్ధుల్ని చేస్తుంది. ఆ వేళకీ ఈ వేళకీ మానవ జాతి చాలా ముందంజ వేసిందంటే ఇద్దరూ ఒప్పుకోరనుకుంటాను. ఇందుకు నిదర్శనంగా ఈ కాలపు మానసికాందోళనలను వేలెత్తి చూపిస్తారు.'

ఇంకొక చోట ఇలా అన్నారు శ్రీ శ్రీ. 'ఈనాడు శ్రీనాధుడంతటి వాడైన విశ్వనాథ సత్యనారాయణని నేను ఎంత గౌరవిస్తానో నీకు తెలియదు ? వీలైతే ఈ ప్రపంచాన్ని వెయ్యేళ్ళు వెనక్కి తీసుకు పోదామని విశ్వనాథ ప్రయత్నిస్తాడు. నాకీతనెప్పుడూ నన్నయభట్టులాగా కనబడ్డానికి కారణం ఇదే."[4]

"శ్రీ విశ్వనాథ తెనుగుజాతి కాధునిక కాలమున మార్గదర్శకుడైన మహర్షి. ప్రబోధకుడైన ప్రవక్త. భూత భవిషద్వర్తమానాత్మకమైన కాల స్వరూపమును

స్పష్టముగా దర్శించి ప్రకటించిన బ్రహ్మ నైష్ఠికు డాయన. కాల ప్రవాహమును ఆద్యంతములుగా నందరు దర్శించలేరు వారి కాయన ప్రకటించిన దర్శన మవ కవగతము కాదు. అంత దర్శనము, అంత కవితా శక్తిగల మహాకవి, మరొక మంచి జాతకముగల భాషా భాషీయులయందు జన్మించి యున్నచో ఆయన నిజముగా విశ్వకవి నాథుడై యుండెడివాడు అంత ప్రక్రియా వైవిధ్యముగల సాహిత్య మును సృష్టించిన కవి ఈనాటి ప్రపంచ భాషల యందెందును లేడు. ఒక్క మన తెలుగులో కలడు. ఆయన విశ్వరూపమును .విశ్వమునకు ప్రకటించుటకే భాషకు దగిన అవకాశము లేక పోవుట ఆంధ్రభాషా శాపగ్రస్త లక్షణములలో నొకటి.

"ఆయన రచనలో గాని, వ్యక్తిలో గాని ఏదో అలౌకికమైన మహాశక్తి ద్యోతక మవుతుంది. అది మహా ప్రభంజన శక్తి. ఆ శక్తిని ఆంగ్లభాషలో చెప్ప వలెనంటే Titamic అని నిర్దేశింప వచ్చును. ఆయన తనను గూర్చి ఎక్కడో యోగ భ్రష్టుడనని గీతావాక్యార్థములో చెప్పుకొన్నట్లు జ్ఞాపకం. కొంత వరకది సత్యమే కావచ్చును. కాని నాకు మాత్రము విజ్ఞాన దృష్టితో భావన చేయగా ఒకటి స్ఫురించినది. శ్రీ సాంబసదాశివుని సేవించే గణములలో నుండి ఏదో శివాజ్ఞ నిర్వర్తించడానికి మన ఆంధ్ర భూమిలో అవతరించిన సహస్ర బాహువులు, సహస్ర శీర్షములు గలిగిన ప్రథమ మూర్తియేమో అనిపించింది — విశ్వనాథ. అందువల్లనే ఆయన విశ్వనాథ వారింట శివప్రతిష్ఠ చేసిన పుణ్యదంపతుల గర్భ వాసాన జన్మించినాడని నా విశ్వాసము.

"ఆంగ్లభాషా సారస్వతంలో మిల్టన్ మహాకావ్యకర్త అని ఇలియట్ అంగీక రించాడు. Pattsion అనే విమర్శకుడు మిల్టనునుగూర్చి ఒక మహావాక్యాన్ని యిలా చెప్పాడు. "An appreciation of Milton is the past reward for consummate scholarship" అని ఆ మహావాక్యం.

"మనం శ్రీ విశ్వనాథనుగూర్చి యిలా అందాం. "An appreciation of 'Viswanatha' is the past reward for consummate scholarship" ఇది విశ్వజనీన కవియైన శ్రీ విశ్వనాథనుగూర్చిన సిద్ధాంత వాక్యం".[5]

ఇది విశ్వనాథవారి తిరుగులేని వ్యక్తిత్వం. ఇది విశ్వనాథవారిని నవలా

  

కాటుడిగా నిరూపించే విరాట్స్వరూపం. వారు మహామేధావులు, ప్రతిభాసంపదతో పాటు అమేయశేముషీ వైభవంతో వ్యుత్పన్నతా సంపన్నులు. వారి వేయిపడగలు ఒక అపూర్వసృష్టి· అనంతమైన ప్రపంచము ;

సూ చి క లు


1. డా॥ తుమ్మపూడి కోటేశ్వరరావు : భూమిక : బ్రాహ్మీమయమూర్తి – పు. xiv–xvi

2. ఆర్. ఎస్. సుదర్శనం : నవ్యాంధ్ర సాహిత్యంలో దృక్పథాలు : భారతి, సెప్టెంబరు, 1964

3. విశ్వనాథ సత్యనారాయణ : నేనూ–నా సాహిత్యరచనలు – ప్రతిభ – మహతి–పు. 13, 21.

4. తాటికొండ వెంకటకృష్ణయ్య, ముదివేడు ప్రభాకరరావు } బ్రాహ్మీమయమూర్తి పు. 170, 171

5. పై దే. పు. 182, 188.

# ఉపయుక్త గ్రంథాలు


1. అభ్యుదయ : ఈ దశాబ్దినవల : విశేషసంచిక జనవరి 1980.
2. అల్లసానివాని అల్లిక జిగిబిగి : విశ్వనాథ సత్యనారాయణ
3. ఆంధ్రనవలా పరిణామము : డా॥ బి. వి. కుటుంబరావు
4. ఒక్కడు నాచనసోమన్న : విశ్వనాథ సత్యనారాయణ
5. కళలు – శాస్త్రీయవిజ్ఞానం : కొడవటిగంటి కుటుంబరావు
6. కవిసమ్రాట్ విశ్వనాథ : ఆచార్య దివాకర్ల వేంకటావధాని
7. కోలాచలం శ్రీనివాసరావు–నాటక సాహిత్య సమాలోచనము
   డా॥ ఎస్. గంగప్ప
8. కావ్యజగత్తు : డా॥ జి. వి. కృష్ణారావు
9. The literary Endeavour Vol. III Nos 1&2.
10. తెలుగునవలల్లో కుటుంబ జీవనము : డా॥ సి. ఆనందారామం
11. తెలుగు నవల–నూరు సంవత్సరములు
    ఆం. ప్ర. సాహిత్య అకాడమీ
12. తెలుగునవల మనోవిశ్లేషణ : కోడూరి శ్రీరామమూర్తి
13. తెలుగునవలా వికాసం :- డా॥ మొదలి నాగభూషణశర్మ
14. తెలుగునవలా సాహిత్య వికాసము : పుల్లాభొట్ల వేంకటేశ్వర్లు
15. తెలుగు విజ్ఞాన సర్వస్వము : సం. III, IV–తెలుగు సంస్కృతి
16. తెలుగు సాహిత్యవికాసం : ఆంధ్ర సారస్వత పరిషత్తు
17. నన్నయ ప్రసన్న కవితార్థ యుక్తి : విశ్వనాథ సత్యనారాయణ

18. ప్రాహిష్ణుమయ మూర్తి : తాటికొండ వేంకట కృష్ణయ్య, ముదివేడు ప్రభాకరరావు

19 మన తెలుగు నవల – పరిశీలన : చైతన్య సాహితి, వరంగల్లు,

20. Marathi Sahitya – Kusumavathi Despande

21. సాహితి : యువభారతి ప్రచురణ, హైద్రాబాదు

22. Unilit : Andhra Viswa Sahiti, 1963

23. విమర్శిని : కాకతీయ విశ్వవిద్యాలయం – జనవరి 1978

24. వేయి పడగలు : విశ్వనాథ సత్యనారాయణ

25 విశ్వనాథ వాఙ్మయ సూచిక

26. వ్యాస సూచి : ఆం ప్ర సాహిత్య అకాడమి

27. శ్రీమద్రామాయణ కల్ప వృక్షము – బాలకాండము : విశ్వనాథ సత్యనారాయణ

28. విశ్వనాథ భారతి

29. సాహిత్య ప్రయోజనం : కొడవటిగంటి కుటుంబరావు

30 సాహిత్యంలో దృక్పథాలు : ఆర్. ఎస్. సుదర్శనం : భారతి, సెప్టెంబరు 1964

31. సాహిత్య శిల్ప సమీక్ష : పింగళి లక్ష్మీకాంతం

32. [illegible]వానిర్ఝరి – మాసపత్రిక

33. Hudson, W. H; An Introduction to the study of Engli… Literature.